శ్రీరస్తు. Acc. 5352

# ఉత్తమసంగ్రహము

కడపమ్యునిసిపల్ హైస్కూలునందు ప్రధానాంధ్రపండితుఁడగు

కావ్యస్మృతితీర్థ:

జనమంచి శేషాద్రిశర్మచే రచింపఁబడినది.







చెన్నపురమున

వావిళ్ల ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1931



 [మూల్యము 0-10-0

# ధన్యవాదము.

పరమకారుణికులారా!

కలియుగమున దినములు జరుగుకొలఁదిని మతములనుపేర విరోధములు ప్రబలుచున్నవి. మతధర్మానుష్ఠానము సున్నయైనది. ఉపన్యాసవేదికలయందుఁ దప్ప నైకమత్యము కానరాదు. వేషధారులు పెక్కండ్రు కనఁబడుచున్నవారు. వేషముతప్ప వేఱుయోగ్యత వారియందు గగనకుసుమముగా నుండును. వీరిమూలమున మతధర్మాచరణపరాయణులకుంగూడ నెగ్గు ఘటిల్లుచుండును. ఒక్కరిదోషము పెక్కండ్ర బాధించును. స్వార్థపరులై శిష్యులంగూర్చుకొని తమకుఁ దెలియనివానిని దెలిసినట్లు నటించుచుఁ బరమతముల దూషించుచు ధనము సంపాదించువారే పెక్కండ్రయిరి. ఒక్కమతము నవలంబించువారికి వేఱొక్కమతతత్త్వము ప్రాయశః తెలియదనుట యచ్చెరువుకాదు. తెలిసినవారొక్కకొందఱే యుందురు. అట్టిమహానీయు లిట్లు దూషింపరు.

“మాంత్రికావా భవిష్యామో యతయో యోగినోఽపివా”

అన్నట్లు విద్యావిహీనులు మతసంస్కర్తలైన నిఁక నందుఁ గలసారమునుగూర్చి చెప్పవలసినదేమి?

శివదూషకులు కొందఱు, విష్ణుదూషకులు కొందఱు, ఉభయదేవతాదూషకులు మఱికొందఱు నుండ నట్టివారివలన లోకమునకుఁ గలుగుమేలేమో తెలియదు. జాతివైషమ్యములను నెలకొల్పుమహానీయులు కొందఱుండఁగా నైకమత్యము నెలకొల్పఁ బాటుపడుపరార్థకనిరతులు, కరుణాళువులుగూడ కొందఱున్నవారు. పరమేశ్వరుఁడు సనాతనధర్మము నశింపకయుండఁ జూచుచుండునుగదా. పామరులు వీరినడుమఁబడి కడునిడుమలం బడుచుందురు. పైవ్రాసిన యిరువురిలో మొదటివారిపలుకులు పామరులకు రసవంతములుగఁ దోఁచును. రెండవవారిపలుకులు సుంత నీరసములుగాఁ దోఁచును.

గుణజ్ఞులుగ నెల్లరుండరుకదా. కావున నీకాలము మతధర్మములు తాఱుమాఱగుటకుఁ దగినదనవచ్చును.

పురాణములం జదువుచున్నకొలఁది నాకుం దోఁచినభావముల నుపనిషత్తులం జదివి వానిసిద్ధాంతములతోఁ గలుపఁగా నొక్కవిధముగనే యున్నట్లు తోఁచినవి. వానినే యీశాస్త్రమున వ్రాసి యుత్తమమార్గమని పేరుపెట్టితిని. ప్రపంచసేవయే భగవత్సేవయని నమ్మి యట్లొనరింప బద్ధకంకణులైయుండు మహాత్ములిందలిగుణాగుణములఁ బరిశీలింపవలంతులు. పక్షపాతము కలవా రిప్పనికిం జాలరు. మానవజ్ఞానమునకుఁ దోఁపని విషయములందు విజృంభించి కలఁతలు కలుగఁజేసికొనుట తగదని శాంతము పొదుకొలుపుటకే యీనాయుద్దేశమని పెద్దలకుఁ దెలుపుటకే యీపుస్తకముఁ బ్రకటించితిని. మహాత్ములు నిష్పక్షపాతమతులునగు విద్వాంసు లిద్దానిం బరికింతురుగాక. విశేషించి వ్రాయఁదగినవిషయము లింతకంటె లేవు.

నాయీశాస్త్రమును జక్కఁగాఁ బరికించి ముద్రింప ననుమతి నొసంగినవారును, సనాతనాధునాతన భాషాకోవిదులును, దత్తమండలకళాశాలాంధ్రపండితులు నగు బ్రహ్మశ్రీ ప్రయాగ వేంకటరామశాస్త్రులుగారికిని, నాయం దవ్యాజప్రీతినునిచి సకలవిధములఁ దోడ్పడుచు సంస్కృతాంధ్రగ్రంథోద్ధారకులు నగు మ.రా.శ్రీ, వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికిని, ఎప్పుడుగాని యేవిషయమునను కుత్సితవాదము పనికిరాదని, తెలిసినదానిని బాహాటముగఁ దెలుపవలయునని నాకుం బలుసారులు తెలుపుచు వ్రాయుచు నాపూనిక కెంతో తోడ్పడుచుండు మ. రా. శ్రీ గార్లదిన్నె రామేశ్వరరావు, బీ. ఏ., బి. యల్., గారికి నేతన్ముఖమున నాకృతజ్ఞతాపూర్వకవందనముల నర్పించుచున్నాఁడను. ప్రమాదములనెల్ల నాకుం దెలుపఁ బండితాఖండలులను, కువిమర్శములచే నపూర్వపుణ్యము నార్జింపఁబూనకుఁడని విమర్శకాగ్రేసరులను జేతులొగ్గి ప్రార్థించుచున్నాఁడను.

ఇట్లు,
భక్తజనచరణసరసిజద్వయసేవకుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ.
శ్రీ. శ్రీ. ౧.

శ్రీ

శివాయ గురవే నమః.

# ఉపోద్ఘాతము

భగవత్సృష్టిలో మానవుఁ డుత్తముఁ డందురు. మానవునికిఁగలవివేకమును విమర్శజ్ఞానము నిందులకు నిమిత్తము లనవచ్చును. మానవులు తమబుద్ధివైభవమునఁ బ్రాపంచికవిషయముల తత్త్వ మెఱుంగుటయే కాక, అతీంద్రియమైన పరతత్త్వముయొక్క యస్తిత్వమును సైతము తగిన ప్రమాణములచే నిరూపించిరి. ఆపరతత్త్వమునకును జగత్తునకును గలసంబంధమును గనిపట్టిరి. అట్టివారిలో నగ్రగణ్యులు సనాతనులయిన మనమహర్షులు. ఆమహనీయులు జననాదిషడ్భావయుతమగుట విశ్వము నశ్వర మనియు, తదంతర్గతులగుటఁ దామ నట్టివారై సంసారావర్తమునఁ బరిభ్రమించుచుంటి మనియుఁ గ్రహించి, భవజలధిఁ దరించి శాశ్వతమైన పరమపదముఁ జేరుటకయి విశ్వప్రయత్నములు గావించిరి.

"తమేవం విదిత్వాతిమృత్యుమేతి"

"నాన్యః పంథావిద్యతేయనాయ" ఇత్యాదిశ్రుతులచే నాపరతత్త్వము కలరూపుదెలిసిన నమృతత్వము—శాశ్వతత్వము—మోక్షము నందవచ్చును. భవతరణమునకు వేఱుదారి లేదని నిశ్చయించిరి. ఆవల అచింత్యము అవ్యక్తము, అనంతము, అతీంద్రియము నైన యాత్మవస్తువు నెఱుంగుటకుఁదొల్లింటి మహనీయులు పలువురు పలుమార్గములు నిర్ణయించిరి. వారు నిర్ణయించిన పద్ధతులనే దర్శనము లందురు. తర్వాతివారిలోఁ గొందఱు కొంద ఱాపద్ధతులలో నొక్కొకదాని నవలంబించుచువచ్చిరి.

అవాఙ్మనసగోచరమయిన యాత్మతత్త్వ మెఱుంగుట యందఱకును సాధ్యమగునది కాదు. కావున మహనీయులయిన మనపూర్వులు, నిర్గుణము, నీరూపము, నిర్వికల్పము నైన యాత్మవస్తువునకు గుణరూపకల్పనము గావించి

యముపాసింప దొడంగిరి. కొంద ఱాపరతత్త్వము పురుషుఁడనిరి; కొందఱు స్త్రీ యనిరి; కొందఱు శివుఁ డనిరి, కొందఱు విష్ణు వనిరి. ఇట్టి యభిప్రాయ భేదములచే బహుమతములు ప్రజలలోఁ బ్రబలినవి. వానిలో శైవము, వైష్ణవము, శాక్తము, కాపాలికము, గాణపత్యము, సౌరము ననునవి ప్రధానములు. ఇయ్యవి సనాతనములు. (ఇప్పుడు మనదేశమున వ్యాప్తిఁజెంది యున్నవి శైవవైష్ణవశాక్తములు.) శ్రుతులు, స్మృతులు, ఇతిహాసములు, పురాణములు నన్నిమతములవారికిని బ్రమాణములే. ఏమతమువా రామతమే యుత్తమ మందురు. కాదన్నఁ గలహింతురు. ఈమతభేదములు కారణముగ నీ కొండొరులను దూఱుట యటుండ, తదుపాస్యదేవతలను నిందించుటయుఁ గలుగుచున్నది.

"రుచీనాం వైచిత్ర్యాదృజుకుటిలనానాపథజుషాం,
నృణామేకో గమ్యస్త్వమసి పయసామర్ణవ ఇవ."

యనుసూక్తిచొప్పున నేదారిని బట్టిపోయినను గమ్యస్థాన మొక్కటియే యని యెంచక యితరులను నిందించుట, దూషించుట, ఏవగించుట యెంతటి మతాభినివిష్టులకు నర్హము కాదుకదా.

ఆట్టి యత్యాచారులఁ జక్కదిద్ది భగవత్సేవచే భవసాగరము దాఁటి పరమపదము జేరఁగోరువారికి నుత్తమమార్గముం జూపున దీ

# "ఉత్తమ మార్గము"

అన్వర్థసంజ్ఞమగు నీయుత్తమగ్రంథమును రచించినవారు సుప్రసిద్ధ పండితకవితల్లజులగు శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు. బ్రాహ్మబ్రహ్మాండాది పురాణరాజములనేకాక శ్రీమద్రామాయణమును వ్యాఖ్యానవిశేషములతోఁ గూడ నాంధ్రవాఙ్మయప్రపంచమున నవతరింపఁజేసిన యీ 'యభినవాంధ్ర వాల్మీకి' రచనాప్రకర్షమును బ్రశంసింప నెంచుట దినకరుని దివ్వెతోఁ గనఁ బఱుప నెంచుటయే.

వేదాంతసారసంగ్రహమనఁదగిన యీపుస్తకమునం దీశ్వరుని నిర్గుణ సగుణస్వరూపములు, ప్రకృతిపురుషులపరస్పరసంబంధము, తదారాధనపద్ధతులు చక్కఁగ వివరింపఁబడియున్నవి. స్మృతీతిహాసపురాణపారదృశ్వలగుట శ్రీశర్మగా రాయా గ్రంథములనుండి ప్రమాణములఁ జూపుచు మొదటినుండి చివరవఱకును దమయభిప్రాయములను బలపఱిచియున్నారు. మఱియును వీరు "వేదాంతముల్ హితబుద్ధిం బఠియించి" యుపనిషత్తులనుండి పెక్కులు ప్రమాణము లొసంగిరి. "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" "నేహనానాస్తికించన" మున్నగు శ్రుతులతో సామరస్యము కలుగునట్లు, ఈశ్వరునికి — బహురూపబహునామకల్పనల కుపపత్తులు చెప్పి శివకేశవాదుల యేకతను నిరూపించిరి. విగ్రహారాధనముయొక్క ప్రయోజనముం జెప్పి యాభ్యంతరపూజయుత్కృష్టమను స్పష్టపఱిచిరి. "స్థూలారుంధతీన్యాయమున" నధికారిభేదమునుబట్టి సేవాభేదము లేర్పఱుపఁబడినవని మనోహరముగ నిరూపించిరి.

ముక్తిసౌధాధిరోహణమునకు భక్తిజ్ఞానవైరాగ్యములు మూఁడుసోపానములు. ఇందు

"మద్భక్తివిముఖానాం హి శాస్త్రగర్తేషు ముహ్యతాం,
న జ్ఞానం చ న మోక్షస్స్యాత్తేషాం జన్మశతైరపి."

ఇత్యాదిప్రమాణములచే భక్తియే ప్రధానమని కొందఱు. 'బ్రహ్మవిదాప్నోతిపరమ్' ఇత్యాది ప్రమాణాంతరములచే జ్ఞానము ముఖ్యమని కొందఱు, 'న కర్మణా న ప్రజయా' ఇత్యాదులగు మఱికొన్ని ప్రమాణములనుబట్టి వైరాగ్యము ప్రధానమని కొందఱును వివదింతురు. శ్రీశర్మగారు భక్తిజ్ఞానవైరాగ్యము లన్యోన్యాశ్రయములు. అనఁగా, నొకటిని విడిచి యొకటి యుండదనియు, వీనితోఁబాటు విహితకర్మానుష్ఠానము యోగముకూడ నుండినఁగాని యారూఢుఁడు కాఁజాలఁడనియు సప్రమాణముగ నిర్ణయించిరి. మఱియు గీతోపనిషద్వాక్యములంబట్టి భక్తుఁడెట్టివాఁడో స్పష్టపఱిచిరి.

చరమశ్లోక మనఁబడు

"సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః."

అనుభగవద్వాక్యమునందలి తాత్పర్యము తద్దయు హృద్యముగ నిం దభివర్ణింపఁబడియున్నది.

ఈపుస్తకమునం దెచ్చటఁ జూచినను శాంతరసము వెల్లివిరియుచున్నది. అందందుఁగల సరసపరిహాసములు పాఠకులకు నవ్వుపుట్టించును. మచ్చున కొకటిరెండు:—

"పరమేశ్వరు ననుగ్రహము...సర్వవిధముల రక్షకుఁడు భగవంతుఁడని నమ్మి ఫలముఁగోరక సత్కర్మము లాచరించుచు సర్వభూతదయాళురై భగవంతునె యెల్లవస్తువులందుఁ గనుఁగొనుచు భేదబుద్ధి లేకయుండువారలకుఁ గలుగును. ఇతరులకు భగవత్ప్రసాద మనఁగా దధ్యోదనాదికమే."

"భక్తియన్న నెల్లరకు లభింపదు; ఏయంగడిలోనో మూల్యమెంతయో యిచ్చి కొందమన్న దొరకదు." పుట 148 ఇందన్నియుపనిషత్తులసారము, విశేషించి భగవద్గీతాభాగవతములసారము తియ్యని తేటతెలుఁగుమాటలతో సుమనోహరముగఁ దెలుపఁబడియున్నది.

పరమార్థజిజ్ఞాసువులైన యాస్తికమహాజనులందఱు "పలుసారులు దీనిఁ బఠింపఁగాఁ దగుక్" అని గ్రంథకర్తగారు చెప్పినచొప్పున భవతరణమునకు నుత్తమమార్గమనఁదగు నీయుత్తమమార్గమును బలుమాఱులు చదివి తదుక్తమైన యుత్తమమార్గము నవలంబించి ధన్యులయ్యెదరుగాక.

శ్రీ శర్మగారును,

"బహవో గురవస్సంతి శిష్యవిత్తాపహారకాః,
ఏకఏవ గురుశ్రేష్ఠశ్శిష్యహృత్తాపహారకః."

యన్నయార్యోక్తి ననుసరించి శిష్యహృత్తాపహరణచణములగు నిట్టియుత్తమ గ్రంథముల నింక ననేకములను రచియించి యాంధ్రలోకము నలరింత్రుగాత.

అనంతపురము
జ్యోత్స్నత్రిశ్రావణ
శుద్ధద్వితీయ.

ప్రయాగ వేంకటరామశాస్త్రి,
దత్తమండలకళాశాలాంధ్రోపాధ్యాయుఁడు.




శ్రీః.

# ఉత్తమమార్గము.

।

## ఇష్టదేవతాస్తుత్యాదికము.

శ్లో. యస్మాత్సర్వద ఈశ్వరోఽఖిలగతో నానాగమాభిష్టుత
స్సంసారార్ణవమగ్నమానవసముద్ధర్తా కృపావారిధిః,
జ్ఞానానందమయః పరాత్పర ఇతి స్తుత్యో మహాయోగిభి
స్సోఽయం పాతు నిజాంఘ్రిపద్మభజనాసక్తాన్ జనానన్వహమ్. ౧
నానావేషధరాన్ ధనార్జనపరాన్నానాశిలాస్థాపకాన్
నానామ్నాయవిశేషశాస్త్రపరమార్థజ్ఞాయితాన్ దాంభికాన్
దృష్ట్వా దాసజనాఖ్యపూర్వమతసద్ధ కవిధ్వంసకాన్
తూష్ణీం తిష్ఠసి దేవదేవ కలినా ధూతోఽసి కిం సాంప్రతమ్. ౨

।

చ. హరుఁ డను పేరు కర్ణములయందుఁ బడన్ మది సేవగించి య
ప్పరశివుఁ దిట్టు నొక్కరుఁడు పద్మదళాక్షుని పేరువిన్న నొ
క్కరుఁడు కృపావిహీనుఁడయి కాఱులు తోఁచినరీతిఁ బల్కు నీ
యిరువురు క్రూరకర్మము లవెప్పు డొనర్చిరొ తోఁప దింతయున్. 1
మ. పరమేశుం డొకఁడయ్యుఁ గర్మగతులన్ భావించి యాయాతనూ
త్కరముం దా ధరియించు నం చుపనిషత్కాండంబు బోధింప న్యా
యరతిం గాంచి తదర్థముం గొనక యెట్లైనన్ స్వవక్త్రార్థమే
ధరణిన్ నిల్పఁగఁ జూచు నొక్కఁడు దురంతస్వీయకర్మంబునన్. 2

మ. ఇతిహాసోత్తమముల్ పురాణములు నెన్నే నింకనుంగల్గు గ్రం
థతతుల్ భక్తిమెయిం బరాత్పరు నదేనామాకృతిం బొల్చిన
ట్లు తలంపన్ భజియింపఁ బాపములు డుల్లున్ ముక్తిచేకూరు నన్
హితముం దెల్పఁగ భేదభావమును సుంతే వీడఁ డొక్కండిలన్. 3

సీ. కేశముల్ పెంచి యోగీశుఁడ నే నని
యొక్కండు సభలలో నరముఁ దట్టుఁ
కౌపీనము ధరించి కాంచనచేలు కిం
కరుఁడ నే ననుచు నొక్కరుఁడు పల్కు
ముక్కుఁ జిక్కఁగమూసి మూర్ఖు లౌనౌవనఁ
దపసినం చొక్కఁ డుద్ధతి వచించుఁ
జేతులు తట్టుచుఁ జెలఁగి కేకలు వైచి
హరిభక్తుఁ డనని యొక్కరుఁడు ప్రేలుఁ
ఆ. కనులు మూసి మంత్రఖండసర్వజ్ఞుఁడ
నగుదు ననుచు నొక్కఁ డాడు నార!
కలియుగమున నింక ఘనుల కేమి కొఱంత
సాధుసార! తొలఁగి చనుఁడు మీరు. 4

మ. మతసంస్థాపకవాక్యముల్ తెలుపు దుర్జ్ఞానప్రధానజ్ఞసం
తతిఁ బోఁద్రోసి పురాణముల్ వెదకి శ్రద్ధాయుక్తి వేదాంతముల్
హితబుద్ధిం బఠియించి తద్హృదయమా నీమార్గమేయన్న యా
దృతి నీయుత్తమమార్గ మన్ సుకృతి నెంతే భక్తిచే వ్రాసితిన్. 5

మ. కలికాలంబున భక్తిమార్గమున నే గాంగేయముంగూర్పదా
సు లుపన్యాసముచెప్పి "పామరు లిదే శ్రుత్యర్థ మా నంచు ని
ర్మలమా త్రోవయె యంచు భక్తిరతినమ్మన్" గార్యసిద్ధింగనన్.
లయం జూచి తదీయదౌష్ట్యము నె యా గ్రంథంబునం దెల్పితిన్. 6

ఉ. సూనృతమార్గ మెద్ది యని శుద్ధమనంబున నొక్కమాఱు పెం
పూనినశ్రద్ధ నెన్నినిది యుద్ధతు లొప్పినమార్గ మంచు నే
మానులు చెప్పలే దనుచు మంచిఫలం బిట లేదటం చొగిన్
జానుగఁ దోఁచుఁ గానఁ బలుసారులు దీనిఁ బఠింపఁగాఁదగున్. 7

చ. తెలిసియొ సుంతయేఁ దెలియుంతీరు నెఱుంగకయో వచించు నా
పలుకుల దోషమున్నఁ గవిపండితు లాదృతి సైచి తప్పులన్
వెలికినిద్రోచి యొప్పులను వేయివిధంబుల నుగ్గడించి ని
స్తులకృపఁ గావఁగావలయుఁ దోషవిదుత్తము లాట నెంతయున్. 8

## కృతిసమర్పణము.

మ. ఘనశక్తిన్ జగముల్ సృజింప మనుపంగాఁ ద్రుంపఁగాఁ జాలి యీ
శునిభావం బన నొప్పి నిర్జర మునీశుల్ భక్తి ధ్యానింపవే
దని కాయ స్తుతవర్తనం బలర నిత్యఖ్యాతివర్తిల్లు లో
కవియంత్రిం బరదేవి నీకృతికి వేడ్కం జేసితిన్ రాజ్ఞిగన్. 9

# విషయావతరణము.

ఆస్తికశిరోమణులారా! సత్ మార్గాన్వేషణతత్పరులారా! శ్రీపరమేశ్వరుఁడు నిరుపమానశక్తిసంపన్నుఁడని, సర్వసాక్షియని సర్వాంతర్యామియని, యద్వితీయుఁడని, యచింత్యమహిముఁడని వేదములు మొదలుకొని కథలవఱకుఁ గల గ్రంథములు తెలుపుచున్నవి. ఈవిషయమున శంకాసమాధానము లక్కఱలేదు. సర్వవిదిత మగువిషయమును గూర్చి వ్రాయుట బుద్ధిమంతులలక్షణము కాదని పెద్దలందురు. *అజ్ఞుఁ

* అచింత్యమవ్యక్తమనంతరూపం శివం ప్రశాంతమమృతం బ్రహ్మయోనిం, తదాదిమధ్యాంతవిహీనమేకం విభుం చిదానందమరూపమద్భుతం. కైవల్యోపనిషత్తు. అణోరణీయాన్మహతో మహీయానాత్మా గుహాయాం నిహితోఽస్య జంతోః. తమక్రతుం పశ్యతి వీతశోకో ధాతుః ప్రసాదాన్మహిమానమీశమ్. అనియు, స బ్రహ్మా స శివస్స హరిస్సేంద్రస్సోఽక్షరః పరమస్స్వరాట్. అనియు, ఓం తద్బ్రహ్మ, ఓం తద్వాయుః, ఓం తదాత్మా, ఓం తత్సత్యం, ఓం తత్సర్వమ్. ఓం తత్పురోర్నమః. అనియు, తైత్తిరీయోపనిషత్తు, ౪ ప్రశ్నము. స బ్రహ్మా స శివ ఇంద్రస్సోఽక్షరః పరమస్స్వరాట్, స ఏవ విష్ణుస్స ప్రాణస్స కాలోఽగ్నిస్స చంద్రమాః. ౭. స ఏవ సర్వం యద్భూతం యచ్చ భవ్యం సనాతనమ్, జ్ఞాత్వా తం మృత్యుమత్యేతి నాన్యః పంథా విముక్తయే. ౮. కైవల్యోపనిషత్తు.

శ్లో. కవిం పురాణమనుశాసితారమణోరణీయాంసమనుస్మరేద్యః,
సర్వస్య ధాతారమచింత్యరూపమాదిత్యవర్ణం తమసః పరస్తాత్.

(౯ గీత ౮ అధ్యా.)

యథాఽఽకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్, తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ. ౬. సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం

డని, యమృతుఁడని, తేజోరూపుఁడని, యానందమయుఁడని, సర్వశబ్దవాచ్యుఁడని, యణువులలో నణువని, మహత్తులలో మహత్తని యుపనిషత్తులు బోధించెడిని. ఈయర్థమునే పురాణములు నితిహాసరాజమై పంచమవేద మనంబడు శ్రీమహాభారతమును సహస్రముఖములం దెల్పెడిని. అంతియగాక యాపరబ్రహ్మమే బ్రహ్మవిష్ణుశివేంద్రాదిరూపుఁడనియు నుపనిషత్తులుద్ఘోషించెడిని. స్థావరజంగమాత్మకప్రపంచమంతయుఁ బర

యాంతి మామికాం, కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహం. ౭. ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునఃపునః, భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్. ౮. నచ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ, ఉదాసీనవదాసీనమసక్తం తేషు కర్మసు. ౯. మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం, హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే. ౧౦. అహం క్రతురహం యజ్ఞస్స్వధాహమహమౌషధమ్, మంత్రోఽహమహమేవాజ్యమహమగ్నిరహం హుతమ్. ౧౧. గీత. ౯. అధ్యా.

అశబ్దమస్పర్శమరూపమవ్యయం తథా
రసం నిత్యమగంధవచ్చయత్,
అనాద్యనంతం మహతః పరం ధ్రువం
నిచాయ్య తం మృత్యుముఖాత్ప్రముచ్యతే. 3 .
అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో
రూపం రూపం ప్రతిరూపో బభూవ
ఏకస్తథా సర్వభూతాంతరాత్మా
రూపం రూపం ప్రతిరూపో బభూవ.

(కఠోపనిషత్తు ౫ .)

బహిశ్చ=స్వేనావికృతరూపేణాకాశవత్. అని శంకరభాష్యము.

మాత్మరూపమే యనియు బోధించును. బ్రహ్మతేజోపబృంహితముగాని దేదియులేదని వెల్లడించెడు. సర్వశబ్దము లాపరబ్రహ్మమునకే చెల్లును. ఆద్యంతములులేక నిర్గుణమై యెల్లతావుల వ్యాపించి రూపవంతముగాక బ్రహ్మము వెలయును. దాని నెవ్వారు నాస్థితియందుఁ జూడఁజాలరఁట. ఏకారణముననో తటాలున నామహాతేజోరూపము రూపమును దాల్చును. ఆస్థితియందే దానికి సగుణబ్రహ్మ మనిపేరు. గుణసహిత మనఁగా బ్రకృతివిశిష్టమని భావము. ప్రకృతి యనునది యాపరాత్పరుని మాయ. మహాశక్తి, పరదేవి లోనగునామము లాభగవచ్ఛక్తికిఁ జెల్లు. తత్సాన్నిధ్యబలమున నానిర్గుణపరబ్రహ్మము రూపముం దాల్చి కార్యదీక్షుంబూను. అనఁగా సృష్టిచేయ నూహించును. ఆయూహ కల్గినంతనే తదిచ్ఛాశక్తియగు నామహాప్రకృతి సకలబ్రహ్మాండజాలముల నిర్మించును. ప్రకృతిం గూడని యతఁడే నిర్గుణుఁడనియు, దానింగూడినతఁడే సగుణుఁడనియు నా

ఇదం వై తన్మధు దధ్యఙ్ఙాథర్వణోశ్విభ్యాముచాచ తదేతదృషిః పశ్యన్నవోచత్ రూపగ్ం రూపం ప్రతిరూపో బభూవ తదస్య రూపం ప్రతిచక్ష..-యు...౧౯. (బృహదారణ్యకోపనిషత్తు)

సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖం
సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి. ౧౩.
సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితం
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ. ౧౪
బహిరంతశ్చ భూతానామచరం చరమేవ చ
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్. ౧౫

(గీత ౧౩ అధ్యా)

పరాత్పరుఁడు చెప్పంబడు. ప్రకృతింగూడినఁగాని యేకార్యము చేయఁజాలఁడు. ఏకాలమునను దా స్వతంత్రించి యేపనియుఁ జేయఁడు. ప్రకృతిచేయుచుండఁ దా సాక్షిమాత్రుఁడై చూచుచు నానందించుచుండు. సృష్టిపాలనసంహారాదికార్యములుచేయ శక్తియే స్వతంత్రురాలగు. ఈయాశయము సిద్ధాంతముకానిచో సర్వసాక్షి, నిర్లిప్తుఁడు, నిష్క్రియుఁడు ననునామము లాతనికి నూడిపోవును. శ్రుతిసిద్ధములగు నానామములు చెల్లవనుట తెలివితక్కువగాక మఱేమగును? ప్రకృతియే సృష్టిస్థితిసంహారములుచేయు ననఁగా బ్రహ్మవిష్ణుమహేశ్వరరూపములుగాఁ దా నావిర్భవించెననికదా యర్థము.

ప్రకృతిరూప మెద్ది యని కొందఱు ప్రశ్నింతురు. భగవంతున కేరూపమో తన్నాయకు నదే రూపమని యెఱుంగవలయు. ప్రకృతిశబ్దము స్త్రీలింగము. కావున స్త్రీయన వలనుపడదు. బ్రహ్మశబ్దము నపుంసకలింగము. కాన భగవంతుఁడు నపుంసకుఁ డనుట యెట్టిదో యిదియు నట్టిదే. ప్రకృతియనఁగా భగవంతుని యిచ్ఛాశక్తి యని తెల్పితినిగదా. రూపమును బట్టి యెట్టు లూహించిన నూహింపవచ్చును. స కర్తృరూపమును ధరించినప్రకృతి పురుషుఁ డనంబడు. ఇట్లే యన్నియు నని యెఱుంగుట తెఱంగు. ఆత్రిమూర్తులుకూడ భగవత్ప్రతినిధు లనంబడుదురు. వారిపత్నులగు గీఃశ్రీసర్వమంగళలు మూలప్రకృతి ప్రతినిధు లనంబడుదురు. ఈమూవురుకూడఁ బ్రకృతిసహాయములేక యేకార్యమును జేయఁజాలరు. "విష్ణో రేషానపాయినీ" యనుట ప్రసిద్ధమేకదా. మానవుని ఛాయ యెడఁబాయ నట్లు ప్రకృతిప్రతికృతియగులక్ష్మి విష్ణువు నెడఁ

బాయదనియే దీనిభావము. ఇట్లే యితరులవిషయమున నూహిం పందగు.

శ్లో. ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి,
  వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్. ౧౯
(గీత. ౧౩ అధ్యా.)

అను నీభగవద్గీతోక్తి పైవ్రాసినయాశయమును స్పష్టీక రించుచున్నది. శ్రీకృష్ణవాక్యము ప్రమాణముకా దనువార లుండ రనుకొనియెదను. ఉండినచో వా రంగీకరింపకున్నను బాధ లేదు. అట్టివారిని నమ్మించుటకు నేఁ బ్రయత్నింపను. వారి యాక్షేపములకు సమాధానము చెప్పకున్న నొకలోపమనియు నే భావింపను. మూర్ఖులుకాక పామరులగువారికిఁ దెలియఁ జెప్పుటకే యీ నాప్రయత్నము. భగవదనుగ్రహామునఫలించె నేని కృతార్థుఁడ నగుదును.

ప్రకృతిపురుషుల కనాదిత్వము సిద్ధము. తక్కుంగల వారలందఱు నా ంతములుకలవారలే. అందుఁ ద్రిమూర్తులు శాశ్వతు లనవచ్చును. వారిపిదప నింద్రాదులను శాశ్వతు లన వచ్చును. వారిపిదప మఱికొందఱ నీరీతిగాఁ జీమలకంటె మానవులు శాశ్వతు లనవచ్చును. అనఁగాఁ బ్రకృతిపురుషే తరులందఱు శాశ్వతులు కారని సారము. ఈభావముగల మాన్యులు వతలలో ను మో ములగు త్రిమూర్తులను సమానులని భావింతురు. అట్టి సద్భావములేనివారు తోఁచి నట్లు ఒక్కరికంటె వేఱొక్కఁడధికుఁ డందురు. వారిని వలదని వారించుటకాని,అలుకా దిట్లని తెలుపుటగాని సత్ప్రయత్నము కాదు. ఏలన వారిప్రాక్కర్మ మట్టిది. అది యాడింపఁగాఁ దోలు

బొమ్మలరీతి వా రూఁగులాడుచున్న వారు. వారి నీభావముగల వారలనుగాఁ జేయఁబూనుట సాధ్యమగునా

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః,
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః. ౧౭. (౪ అధ్యా.)

అను గీతోక్తి సార్థకము గాకుండునా? శ్రీకృష్ణపరమాత్మయే కర్మగతి దురూహమనఁగా మనము దాని మార్పఁగల మను భావ మూనుట కేవలాజ్ఞానమని తలంపవచ్చును. దానఁ బాప మొనఁగూడదు. కర్మము స్వేచ్ఛమెయిఁ ద్రిప్పుచుండఁగా నస్వతంత్రుఁ డగుమానవుఁడు తాఁ దిరుగుచు స్వతంత్రుఁడ నని తలంచును. తనప్రయత్నములు నిష్ఫలము లగుచుండినను, గర్మము బలవ త్తరమనియుఁ దనపౌరుషము తుచ్ఛమనియుఁ దలంపఁడు. ఏదియే నొక ప్రయత్నము సఫలముకాఁగా దానిని దానే బుద్ధిచమత్కృతి మెఱయించి సాధించితినని తలంచును. అంతటితో నూరకయుండక నలువురకుఁ జెప్పును. విఫలమగు ప్రయత్నమును దైవగతిగా భావించును. ఇతరుల కర్మే తెలుపును. ఇంతకంటె నజ్ఞానము వేఱేది కావలయును? సామాన్యముగా మానవు లవిషయము నేకాంతమునఁ గూరుచుండి యాలోచింపరు. ఆలోచించిన నది పాడకట్టకపోదు.

ప్రకృతి యనాదియైనపుడు భగవంతునింబోలె నద్దానిని సంభావింపవలయును. పూజింపవలయును. ఉపాసింపవలయును. దాని నీరీతిగా సంభావింపనిచో భగవంతునిజూడఁ దరమే కాదు.

శ్లో. దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే.

(పరమేశ్వరుఁడనై యెల్లయెడల వ్యాపించియుండు పరాత్పరుఁడనగు నాకు స్వభావభూతురాలై యీ పూర్వోక్త గుణమయి యగు మాయవిశేషించి సుఖముగాఁ దరింపరానిదే యగు. ఎవ్వారు నన్నే శరణొందెదరో వా రీమాయదాఁటె దరు.అనఁగాఁ దొలుత భగవంతునెడఁ బాయకయుండుమాయ నుపాసించి తదనుగ్రహామునకుఁ బాత్రుఁడై సంసారబంధ విముక్తిం గాంచును. భగవంతునిం గాంచును. 'దురత్యయా' అనుపదమునుబట్టి సులభముగా దాఁటరాదనఁగా భావ మిదియే కదా. భగవంతునిస్వభావ మగు ప్రకృతిని రెండుచేతులంబట్టి త్రోయఁదరమగునా వేఱొకమార్గము కనఁబడునా.ఆశ్రయించు మార్గ మొక్కఁడే యగపడియెడును.

ఈభగవద్గీతాభావమునే శ్రీశంకరభగవత్పాదాచార్యుల వారు సౌందర్యలహరియం దిట్లు వెలిపుచ్చిరి.

జగత్సూతే ధాతా హరిరవతి రుద్రః క్షపయతే
తిరస్కుర్వన్నేతత్స్వమపి వపురీశ స్తిరయతి,
సదా పూర్వస్సర్వం తదిదమనుగృహ్ణాతి చ శివ
స్తవాజ్ఞామాలంబ్య క్షణచలితయోర్భ్రూలతికయోః. ౨౪

(బ్రహ్మ జగమును బుట్టించును. హరి పాలించును. హరుఁడు లయింపఁజేయును. ఈత్రిమూర్తులను మహేశ్వర తత్త్వ మంతర్హితముగాఁ జేయును. ఈశ్వరుఁ డీముగ్వురను దనయందు విలీనత నొందఁజేసికొని తాను సదాశివునియం దం తర్భూతుఁడగును. బ్రహ్మాండప్రళయ మిదియే ఆసదాశివతత్త్వ ముకూడ నోభగవతీ! క్షణకాలము త్రిప్పఁబడిన నీభ్రూలతికల యానతింగొని ధాతృహరిరుద్రేశానాత్మకతత్త్వచతుష్టయము నను గ్రహించును.)

 



శ్లో. త్రయాణాం దేవానాం త్రిగుణజనితానాం తవ శివే
భవేత్పూజా పూజా తవ చరణయోర్యా విరచితా,
తథా హి త్వత్పాదోద్వహనమణిపీఠస్య నికటే
స్థితా హ్యేతే శశ్వన్ముకుళితకరోత్తంసమకుటాః. ౨౫

నీపాదములకుఁ జేసినపూజయే సత్త్వరజస్తమోగుణముల వలనఁగలిగిన విష్ణుధాతృరుద్రులకుఁ బూజయగును. ఎట్లనఁగా వారు నీపాదపీఠముదగ్గరఁ జేతులజోడించి కిరీటములయందుఁ నునిచికొనియుందురు. కావుననే వారు పూజ్యులగుదురు.

కొంద ఱీశ్లోకముల వినఁగనే త్రుళ్లిపడుదురు. అట్టి వారికి భగవద్గీతయందు విశ్వాసము లేదనవలయును. ప్రకృతి కంటె నల్పు లన్నమాటను వా రంగీకరింపరు. వారిభావమునఁ బ్రకృతి యనఁగా నొకతుచ్ఛదేవత యని యుండనోపు. పాపము! ప్రకృతి నా మాయ దురత్యయురాలు. దైవి అను నీగీతోక్తిని వా రర్థవంతముగా గ్రహించియుండరు కాఁబోలు. వార లిట్లు గ్రహింపవలయును. “పరాత్పరుఁడు, నిర్గుణుఁడు, విక్రియుఁడు, సాక్షిమాత్రుఁడు. అద్వితీయుఁడు. ఆభగవంతుని యిచ్ఛయే మూలప్రకృతి. పరబ్రహ్మమునకుఁ బ్రకృతికి నవినాభావసంబంధము. ఆమహాతేజమునుండి ప్రకృతిని వేఱు చేయఁజాలువారు లేరు. అగ్నినుండి యుష్ణగుణమును, జంద్రునుండి శైత్యమును వేఱుచేయ సాధ్యముకానియట్లే యని గ్రహింపఁదగు. సకలబ్రహ్మాండముల నాభగవన్మాయయే కల్గించును. ఒకొక్కబ్రహ్మాండమునకు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు నింద్రాదిదేవతలు గలరు. ఈత్రిమూర్తులుగాని యందొక్క విష్ణువుకాని భగవంతుఁ డైనవు డెందఱు భగవంతులు కావలెను. పెక్కండ్రుకలరని వాదింతురేమో

"ఏకో నారాయణః" అను శ్రుతికి

"ఏకఏవ రుద్రో న ద్వితీయాయతస్థే" అన్న శ్రుతికి

నర్థమేమి? ఒక్కొక్క బ్రహ్మాండమున కొక్కొక్క భగవంతుఁ డనపు డొక్కఁ డనుమాట నశించును. అనవస్థా ప్రసంగము ప్రాప్తించును. విష్ణుశబ్దము పెక్కండ్రకు నుండవచ్చును. సర్వవ్యాపకుఁ డెవఁడో వాఁడే విష్ణువన్నను, మఱియేనామమునఁ జెప్పినను దగినవాఁడు. ఆతనికి రూపనామనిర్దేశము లేదు.

"ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్

ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే

ఆనందేన జాతాని జీవంతి.

ఆనందం ప్రయంత్యభిసంవిశంతీతి." (ఆనందవల్లి.)

అని యానందమే భగవద్రూపమని శ్రుతి తెలుపుచున్నది.

అణోరణీయ నహమేవ తద్వన్మహానహం విశ్వమిదం విచిత్రమ్,
పురాతనోఽహం పురుషోఽహమీశో హిరణ్మయోఽహంశివరూపమస్మి. ౨౦
అపాణిపాదోఽహమచింత్యశక్తిః పశ్యామ్యచక్షుస్సశృణోమ్యకర్ణః,
అహం విజానామి వివిక్తరూపో న చాస్తి వేత్తా మమ చిత్సదాహమ్. ౨౧
వేదైరనేకైరహమేవ వేద్యో వేదాంతకృద్వేదవిదేవ చాహం,
న పుణ్యపాపే మమ నాస్తి నాశో న జన్మదేహేంద్రియబుద్ధిరస్తి. ౨౨
న భూమిరాపో మమ వహ్నిరస్తి న చానిలోమేఽస్తి న చాంబరం చ,
ఏవం విదిత్వా పరమాత్మరూపంగుహాశయం నిష్కలమద్వితీయం,
సమస్తసాక్షిం సదసద్విహీనం ప్రయాతి శుద్ధం పరమాత్మరూపమ్. ౨౩
(కైవల్యోపనిష .)

ఇట్లుపనిషత్తులను ప్రమాణములుగాఁ జూపఁబూనిన మహాగ్రంథమగును. కాన నించుక వ్రాసితిని.

నామరూపక్రియాశూన్యుఁడగు భగవంతు నాశ్రయించుటెట్లు? అన్న దొకప్రశ్నము. సర్వనామములు సర్వరూపములు సర్వక్రియలుగలిగి యిట్టివాఁడని నిర్ణయింప శక్యముగాని వాఁడనియే గ్రహింపవలయును.

"తదను ప్రధానద్వారా రాజదర్శనం కర్తవ్యమ్"

(మంత్రిమూలమున రాజును దర్శింపవలయును) అను న్యాయము ననుసరించి ప్రకృతి నాశ్రయించి తదనుగ్రహమునకుఁ బాత్రుఁడై పిదపఁ బరాత్పరుని సమాశ్రయింపవలయును. ఆవిధ మేది?

## ౭ అన్యోన్యాశ్రయము.

దేహులు ప్రకృతిబద్ధులు. ప్రకృతిబంధనము (సంసారరూపము) వదలినఁగాని భగవంతుని జెంద వలనుపడదు. భగవంతు నారాధించి నమలవఱచుకొనినఁగాని ప్రకృతినుండి విముక్తిఁ గాంచ ననువుపడదు. ఇదియే యన్యోన్యాశ్రయదోషమని కొందఱందురు. ప్రతిపక్షులముఖపిధానముచేయ నుచ్చైస్స్వరమున సభాభవనము బ్రద్దలగున ట్లుద్ఘోషించుచుఁ బండితుల మనుకొనుచుఁ ద్రుళ్లువారు కొందఱు గలరు. వారికిఁ దత్త్వము తెలియదు. ఇతరులకుఁ దెలియకయుండ మాటలాడుచుందురు. ఆవాదమునే వేదాంత మనవచ్చును. అట్టివారే పెక్కండ్రు గలరు. వారికేమో తెలియు ననుకొనువారును బెక్కండ్రు గలరు. ఈయిరుదెగలవారికే గురుశిష్యన్యాయము కుదురును. వా రుపదేశింతురు. వీరు ధనమొసంగుదురు. వారు

భగవంతు నొకపాషాణమునందో చిత్రమునందో కనఁబఱతురు. వీరు చూచి పరమానందభరితులగుదురు. ఈయిరువెగలవార లకు భగవంతుఁడు ముక్తినొసఁగును. శిష్యులకు ధనవిముక్తియు, దేశికులకు మానవజన్మవిముక్తియుఁ గలుగును. మరల వీరికిని వారికిని మానవజన్మము సంభవించు టరుదు. కావుననే సద్గురువు నాశ్రయింపవలయునని పెద్దలు పలుకుదురు.

వారమునకుఁబూనక భగవంతు నారాధింపఁ దలంపు గొనువారిసంఖ్య యత్యల్పము. అట్టివారు సత్కర్మముల నొన రించుచు ఫలాభిసంధిరహితులై ప్రకృతియనుగ్రహమునకుఁ బాత్రులై తద్బంధవిముక్తిం గాంచి ప్రకృత్యతీతుఁడగు పర మేశ్వరు నారాధింపవలయును. ప్రకృతి నుపాసింపక పరమాత్మ నుపాసింపవలనుపడదా యన్న నొ ననవలయును. ఎవ్వాఁడు గాని ప్రకృత్యతీతునుపాసింప వలనుపడదు. శంఖచక్రగదాపద్మ ములను ధరించిననారాయణు నారాధించినను, చంద్రశేఖరు నాశ్రయించినను, విరించిం గొల్చినను ప్రకృతి నుపాసించినట్లే యగును. ఏల! ఈచిహ్నములు పరాత్పరునకు లేవు. సగుణరూ పుఁడగుభగవంతునకుఁ గలవు.

"ప్రకృతిం స్వామవష్టభ్యసంభవామ్యాత్మమాయయా"

అనుగీతోక్తియీభావమును సిద్ధాంతము చేయుచున్నది. కావుననే ప్రకృతినే యుపాసించుచు మేము ప్రకృతి నంగీక రింపమని వాదింతురు. వారికే మూర్ఖులనిపేరు. పామరుల కా పేరు చెల్లదు. తెలియనివారు బాలు రనఁబడుదురు. మొండి పట్టుదలగలవారు మూర్ఖులనుపేరునకు నర్హులగుదురు. శ్రీమ న్నారాయణమూర్తి నారాధింతుమన్నను, పార్వతీనాథు నా శ

యింతుమన్నను, సరస్వతీపతిఁ బూజింతుమన్నను బ్రకృతివిశిష్టు నుపాసింతుమని చెప్పినట్లె. ప్రకృతినిదాఁటి నారాయణు నుపాసింతు మందురేని వారికి జ్ఞానమే తక్కువ. శరీరియగువాఁడు పరాత్పరుఁడు కాఁడు. ప్రకృతి విశిష్టుఁడే. ఆతనినుండి ప్రకృతిని వేఱుచేయ సాధ్యముకాదని ముందే తెలిపితినిగదా. ప్రకృతియు నొక్కవస్తువుకాదు. భగవంతు నిచ్ఛయగును. ఈవాదమున బుద్ధిని బ్రవేశింపఁజేసి శాస్త్రగ్రంథములు పరిశీలింపఁబూనిన మానవున కాయుర్దాయము చాలదు. తుదకెన్ని జన్మములును జాలవు. కావుననే

"సర్వేశాక్తాద్విజాః ప్రోక్తా న శైవా నచ వైష్ణవాః."

అని వ్యాసమహర్షి దేవీభాగవతమునఁ దెలిపెను. అనఁగా శైవులును వైష్ణవులును సగుణోపాసకులే యని భావము. శ్రీరామానుజాచార్యులుగారీరహస్య మెఱింగియే శ్రీనిత్యత నంగీకరించిరి. వైష్ణవుల మనుకొను కొందఱు శక్తి యనఁగాఁ బార్వతియే యని యూహించి దూషింతురు. భగవంతున కెట్లు శివకేశవాదినామములు చెల్లునో ప్రకృతికి నట్లే శ్రీ, లక్ష్మి, భార్గవీ, కాళీ, పార్వతీ, గిరిజా, వాణీ, సరస్వతీశారదాప్రభృతి నామములు చెల్లును. మహాలక్ష్మిని మూలప్రకృతి యని భావించు వైష్ణవులును, బార్వతిని మహామాయ యని తలంచుశైవులును, సరస్వతిని బరదేవి యని యూహించు హైరణ్యగర్భులును సమానులు. అనఁగా శాక్తులు. ప్రచ్ఛన్నశాక్తు లనఁదగుదురు. శక్తి విహీనుఁ డేపనిని జేయఁజాలఁడు. పరమపురుషుఁడుకూడ సగుణుఁ డగునపుడుఁ గార్యక్షముఁడు కాఁజాలఁడు. ఈవిషయమునే శ్రీశంకరాచార్యులుగారు

శ్లో. శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
నచేదేవం దేవో న ఖలు కుశలస్స్పందితుమపి,
అతస్త్వామారాధ్యాం హరిహరవిరించాదిభిరపి
ప్రణంతుం స్తోతుం వా కథమకృతపుణ్యః ప్రభవతి.

అని స్వ కరించిరి. ఎవ రెన్ని చెప్పినను దాఁబట్టినకుందేటికి మూఁడేకాళ్లనువారి నిష్ఫలప్రయత్నము మార్పునొందదనుట సత్యము. వారిది దృఢమూలకమగుకర్మము. అది దేవతాద్వేష మును గలిగింపక వదలదు. కావుననే శ్రీకృష్ణపరబ్రహ్మము

న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసంగినామ్,
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరన్. ౨౬
(గీత. 3 అధ్యా.)

అని నిర్వచనము చేసెను. అన్యదేవతలదూషించువారిని వలదన రాదు. ఊరకుండుటయే సమంచితకార్యము. వారికిఁ దెల్పఁ బూనుటకంటెఁ దా నట్టిదుష్కార్యమును చేయక యూరకుం డుటయే శ్రేయము.

సర్వమతములు శాక్తమున నంతర్భూతము లగును. ఎల్ల రయుపాస్యదేవతలు ప్రకృతివశంగతులు. కావునఁ దెలిసి యొండె, తెలియకయొండె వారు ప్రకృతినే యుపాసించుచు న్నవారని మనము తెలిసికొని సంతోషింపవలయు. కొందఱు మహాకాళీ రూపమును ధ్యానపద్ధతిని గాంచి యత్యంతక్రూరదే వత యందురు. శవారూఢయై ముండమాలాధారణము గావించి భయంకరఘంటానాద మొనరించుచు ఖడ్గకపాలవరాభ యచిహ్నములుగల చతుర్బాహువులొప్ప మహాజిహ్వా కనఁబఱ చుచు నుండునుగాన మహాకాళి వికారస్వరూపముగలది.

క్రూరదేవత యని దూఱుదురు. హిరణ్యకశిపుని దొడలపైఁ బెట్టుకొని వక్షము చించి రక్తధారలు ప్రవహించుచుండ భయంకరాకారము చూచు దేవతల గుండియ లవియింప సింహవక్త్రమున నున్ననరసింహమూర్తి వారిపాలిటికి శాంత మూర్తిగాఁ దోఁచును గాఁబోలును. మహాకాళి శ్మశానవాసిని యని, కావున నమంగళాంగి యని మఱికొందఱు దాసులు పలుకుదురు. హిరణ్యకశిపుని సంహరించుచోటు వివాహమండ పమని వా రుద్ఘోషింతు రేమో. యుద్ధరంగమంతయుఁ బెండ్లి యిల్లగునా? మనస్సునఁ గలపరిజ్ఞానము లేని యభిమాన మిట్టి దాసుల నిట్టు లాడించుచున్నది. తమయభిమాన మొకదేవతపై నున్న యట్లే యితరులయభిమానముకూడ నొకదేవతపై నుండు ననియుఁ దనయిష్టదేవతను దా నెంత గొప్పగా భావించునో యింకొకఁడుకూడ నట్లే భావించుననియు నీహరిదాసబ్రువు లూహింపరని తోఁచెడిని. అట్లే భావించుచో వా రితరుల యిష్టదేవతలఁ దనయిష్టదేవతవలెఁ దలంతురనియు దూషింపక యుందురనియు నాయాశయము.

## మతములు, వానియాశయములు.

శైవము, వైష్ణవము, శాక్తము, కాపాలికము, గాణాపత్యము, సౌరము ననునివి యాఱుమతములు సనాతనములు. శివుఁడు, విష్ణువు, ప్రకృతి, భైరవుఁడు, గణనాథుఁడు, సూర్యుఁడు నను నీయాఱుగు రందు నధిదేవతలు. శైవమునందు శివుఁడే పరమాత్మ. సర్వప్రపంచము తద్వ్యాప్తము. తత్పర మేదియు లేదు. వైష్ణవమునందు నిట్లే. తక్కినవానియందు నీపద్ధతియే కలదు. ఇం దొకదానికంటె వేఱొకమత ముత్కృష్టమన వలను

పడదు. అట్లు పలికినచో వీరి నింకొక రాక్షేపింతురు. అందఱకును సమానముగాఁ బురాణజాలము గలదు. శైవమునందుఁ గాపాలికగాణాపత్యము లంతర్భూతములు కాచ్చును. వైష్ణవమున సౌర మంతర్భూత మగును. శాక్తమున నీయైదు నంతర్భూతములగును. ఇది కొందఱిమతము. వైష్ణవమున శాక్తమతప్రవిష్టులకుపాస్యమంత్రములు లేవు. శాక్తమున నివియన్నియు షడామ్నాయములయందుఁ గలవు. విష్ణుమంత్రమున కివి యంగమంత్రములు కాఁగూడదా యనరాదు· వైష్ణవు లంగములగు శక్తిమంత్రముల నుపాస్తింతురా. వా రుచ్చరింపరు. కావున నది సంపూర్ణత నీవిషయమునఁ గాంచఁజాలదు. శాక్తమునం దట్లు గాదు. పరాశక్తి కన్నిమంత్రము లంగములగును. శాక్తు లన్నిమంత్రముల నుపాసింతురు. సర్వమంత్రముల ననఁగాఁ బూర్వోక్తషడ్దేవతాభేదమంత్రముల దీక్షాప్రదానకాలమున నుపదేశింపక మాన వలనుపడదు. కావున నీయైదును శాక్తమునం దంతర్భూతములని చెప్ప నవకాశమొదవెను. మత మనఁగా సర్వదేవతాసమారాధనమున కవకాశ మిచ్చునదిగా నుండవలదా.

ఈ యాఱుమతములు వేదమును బ్రమాణముగా నంగీకరించినవి. వేదప్రామాణ్యము నంగీకరింపనిమతములును గలవు. వాని ప్రస్తావ మిట నక్కఱ లేదని మానితిని. ఈయాఱుమతములలో నుత్తమమధ్యమాధమము లివి యని చెప్పవచ్చునని కొంద ఱందురేమో కాని యది సమంచితముకాదని నాయాశయము. ఏలనఁగా నొక్కదైవతమే యుత్కృష్టమని యొక్కొక్కమతమునందును జెప్పఁబడినది. నామములు వేఱు. భాషానియమము ననుసరించి లింగభేదము గలదుగాని విశేష మేమియు

లేదు. ఇన్నిమతము లుండనేల యని యడుగువా రుందురు. ఒక్కొక్కకర్మము నాచరించినవా రొక్కదేవతానామము నభిలషింతురు. వారి కనుకూలముగా నుండవలయునని యేర్పఱుపఁబడినవి. కాని మతాశయము లన్నియు నొక్కవిధముగనే యున్నవి. పాషండులకు భిన్నములుగాఁ దోఁపవచ్చును. పాషండు లనఁగా దేవతాంతరదూషకులు. వా రన్నిమతములలోఁ గలరు. వారల కందఱకు గమ్యస్థానము నరకమే యని చెప్పఁబడినది. పాషండత్వము త్యాజ్యమని యెఱింగియుఁ బరమందుఁ దమకుం గలుగఁగల మేలునుకూడ లెక్కింపక దేవతాంతరదూషణము చేయువారలకంటె మూర్ఖు లెవరైన నుందురా యని దీపముపట్టి వెదకిన నెందును గానరా రనక తప్పదు. దాన మూటఁగట్టుకొనునది పాపమే కాని వేఱుగాదు. కట్టా! అదెంతటి యన్యాయము. ఆవిషయమునఁ జింతించిన లాభము లేదని యూఱడిల్లవలయును.

ఇందఱు దేవతలుండఁగా జనులందఱు శివకేశవులను గుఱించియే ముచ్చటించు టేల యని యడుగవచ్చును. శివకేశవులు లయపాలనకర్తలు. వీరి నిర్మించినవాఁ డొకఁడు కలఁడని విమర్శించువా రరుదు. ఇందొక్కరు ముక్తిప్రదాతయని యింకొకఁడు కాఁడని వాదింతురు. బ్రహ్మకుఁ బూజయే లేదందురు. అందుల కేదో కారణమును జెప్పుదురు. బ్రహ్మనుగుఱించి తపస్సుచేసి వరము లొందినవారు వేనవేలుగ నుండ నాపరమేష్ఠికిఁ బూజయే లేదనుట యెట్టిదో యరసినఁ దెలియఁగలదు. వేదప్రతిష్ఠాపకుఁడు చతుర్ముఖుఁడు. వేదోక్తమయి జ్ఞానదాయకమయి యలరు పూజ ధ్యానమే. బాహ్యపూజకన్న వేయిమడుంగులు ధ్యాన ముత్తమోత్తమము. ధ్యానగమ్యుఁడు

బ్రహ్మాయగును. శివకేశవు లిరువురును ధ్యానగమ్యులే. వీరిలోఁ దారతమ్య మెక్కడిది? ఇందొక్కఁ డధికుఁడు, వేఱొకఁడు తక్కువయనుట మంచికార్యము కాదు.

పురాణములయందు బ్రహ్మ వరమిచ్చి దాన దుష్ఫలము లోకులకుం గలుగఁగా దాను విష్ణువుకడకో శంకరునికడకో పోయి దానిబాధమాన్పఁ బ్రార్థించినట్లు కలవు. ఈయిరువురిలో నొక్కఁడైన బ్రహ్మకడకుంబోయి నాయిచ్చినవరమున నిట్టిచెట్ట గలిగినది. దానిందీర్చి లోకమును గాపాడుమా యని ప్రార్థించినజాడ కానరాదే. అని యడుగుదురేమో. కేవలవైదిక సహాయుఁడు జ్ఞానరాశి యగు బ్రహ్మను ద్వేషించినవాఁ డొక్కం డును గానరాఁడు. ఆమహనీయునికార్యము సృష్టియే. పాలన సంహారములు గలవారినే తఱచుగా ద్వేషింతురు. కావున వీరి కంటె నాతఁ డీవిషయమునుబట్టి యల్పుఁ డనరాదు. తత్పత్ని శారద. విద్యాధిదేవతకదా. సృష్టిస్థితిసంహారములుచేయుటకుఁ ద్రిమూర్తు లనఁబడు బ్రహ్మవిష్ణు మహేశ్వరులు సమానులుగ నుండవలసినది న్యాయముకాని యందొక్కవిష్ణు వధికుఁడని తక్కినయిర్వురు తచ్ఛాసనమును వహించి పనిచేయుచుందురని చెప్పుట న్యాయసమ్మత మేనాఁడును గానేరదు. త్రిమూర్తులలోఁ బరిగణింపఁబడు విష్ణువే భగవంతుఁ డనునప్పుడు నిర్లిప్తుఁడు సర్వసాక్షి యగు తా నొక్కయధికారము నేల పూనునో తెలియఁజాలకున్నవాఁడ. అనఁగా ఆవాదము నిస్సారమని నాభావము. భగవంతుఁడు విష్ణువు కావచ్చును. త్రిమూర్తులలో నుండువిష్ణువు తక్కినయిరువురకంటె మిన్న కానేరఁడు. బ్రహ్మ శివాదినామములు పరాత్పరునకు నుండవచ్చును. సర్వశబ్ద వాచ్యుఁడుకదా భగవంతుఁడు.

ఒక్కయధికారమును పూనినవాఁడు నిర్లిప్తుఁడు కానేరఁడు. ప్రకృతి విశిష్టుఁడు కానిస్థితియందు సృష్టియే నశించును. సగుణుఁడైనప్పుడుంగూడ నాపరబ్రహ్మము ప్రకృతిమూలమున సర్వకార్యములు చేయించుచుఁ దానిరంజనుఁడు సర్వసాక్షియునై యుండును. కావుననే త్రిమూర్తులు బ్రహ్మాండమునఁ గల యధికారపురుషులలో నుత్తమోత్తములు ఇంద్రాదులు వారికంటె శక్తిహీనులు. వీరెల్లఁ బ్రకృతినిర్మితులు. ప్రకృతికింబరుఁ డొక్కపరమపురుషుఁడే యని యెఱుంగనగు.

## ఉపాసనము.

ఈవిషయమును బెంచివ్రాయక మానవుల యుపాసన విషయమును వ్రాసెద. అన్నిజన్మములకంటె మధ్యమలోకమున మానవు లుత్తములు. అనేకజన్మముల సుకృతము లొనరించి వానికి ఫలముగా మానవత్వమును జీవుఁడు కాంచును. అనఁగా జ్ఞానమును సంపాదించుట కనువగుజన్మమును గాంచునని భావము. దీనినుండి పతనమును గాంచుచోఁ గృమిజన్మము కూడఁ గలుగవచ్చును. కావుననే మానవజన్మమునుండి యుత్తమజన్మము లభించుటకు జన్మమే లేకుండ భగవదనుగ్రహము నకుఁ బాత్రుఁడై ముక్తినొందుటకుం దగినవిధులు వేనవేలుగ నేర్పఱుపఁబడినవి. ఆవిధులే శ్రుతిస్మృతిపురాణేతిహాసాదులు. వీనియం దేదానియందు నొక్కమార్గమే విధింపఁబడక పెక్కుమార్గములు చూపఁబడినవి. ఎందులకనఁగా మానవులందఱు నొక్కవిధ మగుకర్మము నొనరించినవారు కారనియు, వారివారికిఁ గలుగఁదగుగతుల కనురూపముగా మార్గము లుండవలయుననియు, నం దేమార్గమునైన ననుసరించి ప్రవర్తించిన

ను త్తమజన్మ మలవడి నిష్కాముం డై భగవంతుని కరుణకుఁ బాత్రుఁ డగుననియు నాలోచించిరే యనేకమార్గములు కల్పిం పఁబడినవి. అనేకయజ్ఞములు, బహువిధపూజలు, పెక్కుమంత్ర ములు, ఎన్నియో వ్రతములు, తీర్థయాత్రాదులు నందుఁ గలవు. ఇన్ని కలవుగాని ముఖ్యసూత్రమునందు భేదములేదు. సకల మార్గముల సారమేమని పరికించువారి కది గోచరించును. ఆ యూహ కలుగుటకు మిక్కిలిపుణ్యము తోడ్పడవలయును. లేకున్న నొకమార్గమునకంటె నింకొక్కటి యుత్తమమనియో, మధ్యమమనియో, అధమమనియో గోచరించును.

పురాణములను దొలుతఁ బరికింతము. ఒక్కొక్కపురా ణమునం దొక్కొక్కదేవత ప్రధానతం గాంచును. ఆదేవత కంటెఁ దక్కినదేవతలందఱు తక్కువవారని తెలియవచ్చును. సర్వదేవత లాదేవతనుండి వరములం గాంచిరనియో, కష్టము లను దొలఁగించుకొనిరనియో యుండును. మఱియొకపురాణ మున నింకొక్కదేవత పేర్కొనఁబడియుండును. దానియం దంతకుముందుగఁ జదివినపురాణమునఁ బేర్కొనఁబడిన దేవతయే యీపురాణమునఁ బ్రతిపాదింపఁబడిన దేవతకుఁ బాదసేవచేయు నని చెప్పఁబడియుండును పఠించువారు పురాణద్వయ భేద మెట్టి దని విమర్శింపఁజాలనిచో రెండును దప్పులనియో లేక యొకటి తప్పనియో తోఁచును. పఠించువారు తమయిష్టదేవతకంటెఁ దక్కినదేవతలంద ఱల్పులని తీర్మానించుకొనును. అంతటితో నూరకయుండక యాదేవతలను, దద్భక్తులను దూలనాడును. పురాణద్వయసార మేది యని విమర్శించుశక్తి కలవాఁడైనచో నందలిసారము నెఱుంగఁగల్గును. అప్పు డీయిరువు రొక్కరూప మేకాని వేఱు కాదనియుఁ బేరు భేదముగ నున్నను నీయిరు

వురు నాభగవదంశములే యనియు భావింపఁజాలును. అట్టిస్థితి యం దుండువారికుఁ డందొక్కని దూలనాడఁ బూనఁడు. ఇదియే, కర్మభేదమునుండి కల్గినమార్పని యెఱుంగవలయును.

క్రూరకర్మముల నొనరించినవారు క్రూరస్వభావు లగు దేవతలయందు భక్తిగలవార లగుదురు. దేవతలయందుఁ గ్రూరత్వ శాంతత్వకల్పనాదులు కర్మము ననుసరించి కలుగును. శ్రీమహావిష్ణువు సత్త్వగుణప్రధానుఁడు. నరసింహమూర్తి యట్లుగాక క్రూరుఁడుగాఁ గనఁబడును. ఏల? శ్రీమహావిష్ణువే నరసింహరూపమును దాల్చెను. క్రూరుఁ డెట్టులయ్యెను? దానవ సంహారమును జేయుటంబట్టియేకదా. ఆయుగ్రత్వము వాస్తవమా? కాదు. క్షణకాల ముండునది. ఉగ్రమూర్తిగాఁ గొంద ఱకే యగపడును. పరమభక్తుఁడగు ప్రహ్లాదునకు భయంకరాకారుఁడుగఁ గనఁబడియెనా? ప్రహ్లాదు నభయప్రదానమున ననుగ్రహింపలేదా. దుష్టులకు నుగ్రమూర్తిగాఁ దోఁచినను మహర్షులకు శాంతమూర్తిగనే కనఁబడును. ఉపాసకుఁడును నరసింహమూర్తిని శత్రుసంహారాదికార్యములు సిద్ధింపఁగోరి యుపాసించిన మహోగ్రాకారముననే కనంబడితత్కార్యానుకూల ము లగుఫలములనొసంగును. పరమపురుషార్థమును గాంక్షించి యామూర్తినే ధ్యానించిన శాంతైకమూర్తిగఁ దోఁచును. మహాకవి కాళిదాసు మహాకాళిని విద్యను గోరి భజించెను. ఆమె శారదాకారమునఁ బ్రత్యక్షమయ్యెను. మహాకాళికింగల యుగ్రత్వము కల్పిత మనవలయునా? స్వభావ మనవలయునా? కొందఱు పండితమ్మన్యులు మహాకాళి క్రూరదేవత యందురు. వారిమనోభావ మట్టిది. వారికర్మ మట్టిది. ఈవిషయమును భగవద్గీతయందలి యీశ్లోకము దృఢపఱచును.

శ్లో. యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. ౧౧
(౪ అధ్యా.)

(ఎవ్వారే ప్రకారమున నేప్రయోజనమున నేఫలమును గోరి నన్నుపాసింతురో వారి నట్లే యాఫలదానమున ననుగ్రహింతును. అనఁగా ఫలములఁ గోరువారిని ఫలదానముచేతను, ముక్తింగోరువారిని జ్ఞానదానముచేతను, జ్ఞానులగు సన్న్యాసులను మోక్షదానముననను, దీనులను గష్టహరణమును మన్నింతు నని భావము.

శ్రుతి. తం యథా యథోపాసతే తం తమేవఫలం లభతే.

కావున నుపాసకుఁడు స్వకర్మానురూపముగ దేవత నుపాసించును. దాని కనురూపమగుఫలము నొందును. భగవంతుఁడతనిమనోభావము ననుసరించి తగినరూపమునఁ బొడసూపునని మనము గ్రహింపవలయును. ఈవిషయమునే,

శ్లో. ఆత్మసంభావితాః స్తబ్ధాధనమానమదాన్వితాః,
యజంతే నామ యజ్ఞైస్తే దంభేనావిధిపూర్వకమ్. ౧౭
అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః,
మామాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః. ౧౮
తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు. ౧౯
ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని,
మామప్రాప్యైవ కౌంతేయ తతో యాంత్యధమాంగతిమ్.౨౦.అధ్యా౧౬

అను గీతాశ్లోకములు బోధించుచున్నవి. ఉపాసకుఁడు విధిపూర్వముగ నుపాసింపవలయు. అవిధిగ నుపాసింపరాదు. సర్వ

భూతాంతరాత్మనుగా నుపాస్య దేవతను జింతింపవలయును. సర్వ దేవతాస్వరూపుఁడుకదా భగవంతుఁడు. కావున నామహానీయు నేనామమున నేవ్యక్తిగాఁ జింతించినను సమానమే. కాని యింద్రు నుపాసించువాఁడు ప్రాగ్దిగధిపతి. దేవతలలో శ్రేష్ఠుఁడు. స్వర్గాధీశుఁడు. అని తలంచిన ఫల మల్పమే కలుగును. పరమైశ్వర్యమును గోరువాఁ డింద్రనామమున నా సర్వేశ్వరునే భావింపవలయు. అపు డాభగవంతుఁ డింద్రరూపమునఁ బ్రత్యక్షమగును. ఇది యొకక్రొత్తమార్గముగ సామాన్యముగాఁ దోఁచును.

శ్లో. అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం. ౨౨
యేఽప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయాన్వితాః,
తేఽపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్. ౨౩
అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ,
న తు మామభిజానంతి తత్త్వేనాతశ్చ్యవంతి తే. ౨౪
(గీత. అధ్యా ౯)

(ఇతర దేవతలయందు భక్తిగలవారలా స్తిక్యబుద్ధిచేఁ బూజింతురో వారు విధివిరహితముగ నన్నే పూజించుచున్నవారు. ఏలయనఁగా శ్రౌతస్మార్తయ ములకన్నింటియొక్క దేవతాత్మత్వముచేత భోక్తను నేనే. ప్రభువును నేనే. కాని యీవిషయమును వాస్తవమని యెల్ల రెఱుంగరు. కావున వారవిధిపూర్వకముగ నారాధించుటంజేసి సంపూర్ణఫలము నందఁజాలరు.) అనఁగా సర్వదేవతలయాత్మను నేననియు నావిధ మెఱింగి పూజించినచో సంపూర్ణఫలము గలుగుననియుఁ గాక

యున్న దానికిం దగినంతయే కలుగుననియు భావము. సర్వదేవతలుగాఁ బరిణమించి సర్వబ్రహ్మాండముల నావరించి యున్నవాఁడొక్కఁడే యని భావించువారికే సంపూర్ణఫలము గల్గునని సారము. ఈవాక్యములనుబట్టి చక్కఁగా నాలోచించిన నుపాసకుఁ డెట్లుపాస్యదేవతను భావింపవలయునో తేటపడును. ఇట్లుండఁగా శివునికంటె విష్ణు వధికుఁడని కొందఱును, విష్ణువునకంటె శివుఁ డుత్కృష్టుఁడని కొందఱును వాదించుట న్యాయవిరుద్ధమని పొడకట్టెడిని.

ఈగీత నుపదేశించినవాఁడు శ్రీకృష్ణమూర్తి కావున విష్ణువే కృష్ణుఁడు కాన, విష్ణువే యధికుఁడని తేలినదనియు, సర్వదేవతల నావిష్ణుస్వరూపముగా భావింపవలయుననియుఁ గొందఱందురు. అక్కటా! వారియాశయ మెంత విరుద్ధమైనది. శ్రీకృష్ణమూర్తియే,

శ్లో. "ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్" అనియు,
"రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్." అనియు,
"యచ్చాప్యస్మి సర్వజంతూనాం బీజం తదహమర్జున." అనియు,

గీతాశాస్త్రమునఁ బదియవయధ్యాయమునఁ దెలిపియున్నాఁడు. విష్ణువు శంకరుఁడు నేనే నన్నఁగా నీయిరువురరూపములుగాఁ బరిణమించుపరమాత్మ నని కదా భావము.

మయా ప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శితమాత్మయోగాత్,
తేజోమయం విశ్వమనంతమాద్యం యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్."
౪౭. గీత. ౧౧ అధ్యా.

అను నీగీతావాక్యమునుబట్టియే శ్రీకృష్ణుఁడు తేజోరూపుఁడని స్పష్టమయ్యెడిని. కావున నీగీతోపదేశముచేసినవాఁడు

పరాత్పరుండనియే తేలునుగాని వైకుంఠమే నివాసముగాఁ గలిగి లోకములఁ బరిపాలించునట్టి యొక్కయధికారమేగల విష్ణుమూర్తి యని స్పష్టము కాదు. విష్ణుకృష్ణులకు భేదమా యందు లేని వారికే కాదు శివకృష్ణులకుఁగూడ భేదము లేదనియే సమాధానము. విష్ణుసహస్రనామములలో,

"సర్వశ్శర్వశ్శివస్థాణుః ఈశ్వరో విక్రమీ ధన్వీ,
రుద్రో బహుశిరా బభ్రుః, హిరణ్యనాభస్సుతపాః,
బ్రహ్మణ్యో బ్రహ్మకృద్బ్రహ్మ"

అనియు నింక నిట్టి వెన్నియోనామములు కలవు. ఇందుఁ గల శివ, స్థాణు, రుద్రేశ్వర ప్రభృతినామములకు నింకొక్క యర్థము చెప్పవచ్చు నందు రేమో. శివసహస్రనామమునఁ గల విష్ణుపరమగు నర్థముగల శబ్దములకుంగూడ నింకొక్క యర్థము చెప్పవచ్చునే. అప్పుడేమందురు? ఇట్టిప్రశ్నములకు నర్థములకు సమాధానము చెప్పుట సులభమగుపని. ఏగ్రంథమును బరిశీలించినను శివకేశవాదినామముల నాసగుణబ్రహ్మము వెల యుచుండుననియే స్పష్టమగును.

## వాంఛ ననుసరించి దేవతాభేదములు.

ఉపాసకుఁడు కాంక్ష నెద్దానిం బూని యారాధించునో యపు డాభగవంతు నేరూపముగలవానిగా భావింపవలయునో శ్రీభాగవతమునందే చెప్పఁబడినది. దాని జూడుఁడు.

శ్లో. "బ్రహ్మవర్చసకామస్తు యజేత బ్రహ్మణస్పతిం,
ఇంద్రమింద్రియకామస్తు ప్రజాకామః ప్రజాపతిమ్.
అన్నాద్యకామస్త్వదితిం స్వర్గకామోఽదితేస్సుతాన్,

విశ్వాన్ దేవాన్ రాజ్యకామస్సాధ్యాన్ సంసాధకో విశామ్. ౩
దేవీం తు మాయాం శ్రీకామస్తేజస్కామో విభావసుం,
వసుకామో వసూన్ రుద్రాన్ వీర్యకామస్తు వీర్యవాన్. ౪
ఆయుష్కామోఽశ్వినౌ దేవౌ పుష్టికామ ఇళాం యజేత్,
ప్రతిష్ఠాకామపురుషో రోదసీలోకమాతరౌ. ౫
అకామస్సర్వకామో వా మోక్షకామ ఉదారధీః,
తీవ్రేణ భక్తియోగేన యజేత పురుషం పరమ్." ౧౦
(౨ స్కం. ౩ అధ్యా.)

అనఁ గాంక్ష ననుసరించి భగవంతు నీరూపమున ధ్యానింపుఁడని పై శ్లోకములు బోధించును. భగవంతుఁడు భక్తవాంఛాపూరణముచేయ నిన్ని రూపములు దాల్చుననియు వీనికెల్ల నర్చారూపములని పేరులనియు గ్రహింపవలయును.

"ఏకోఽపి సమహాదేవస్త్రిధాసౌ సమవస్థితః. ౫౩
సర్గరక్షాలయగుణైర్నిర్గుణోఽపి నిరంజనః,
ఏకధా చ ద్విధా చైవ త్రిధా చ బహుధా స్థితః. ౫౪
యోగేశ్వరశ్శరీరాణి కరోతి వికరోతి చ,
నానాకృతిక్రియారూపనామవంతి స్వలీలయా. ౫౫
హితాయ చైవ భక్తానాం సఏవ గ్రసతే పునః,
త్రిధా విభజ్య చాత్మానం త్రైకాల్యే సంప్రవర్తతే." ౫౬
(కూర్మపురాణము. ౪ అధ్యా)

భాగవతమునఁ దెలుపఁబడినయర్థమునే యీపురాణము వివరించినది. విశేషించి భగవన్నామముల కిట నరముకూడఁ దెలుపఁబడినది. వానిం బరిశీలించినచో దేవతా భ్రమము తొలఁగు.

శ్లో. "ఆదిత్వాదాదిదేవోఽసావజాతత్వాదజస్స్మృతః,
పాతి యస్మాత్ప్రజాస్సర్వాః ప్రజాపతిరితి స్మృతః. ౫౯
దేవేషు చ మహాన్ దేవో మహాదేవ ఇతి స్మృతః,
బృహత్వాచ్చ స్మృతో బ్రహ్మ పరత్వాత్పరమేశ్వరః. ౬౦
వశిత్వాదప్యవశ్యత్వాదీశ్వరః పరిభాషితః,
ఋషిస్సర్వగతత్వేన హరిస్సర్వహరో యతః. ౬౧
అజత్వాదప్యపూర్వత్వాత్స్వయంభూరితి సంస్మృతః,
నరాణామయనం యస్మాత్తేన నారాయణస్స్మృతః. ౬౨
హరస్సంసారహరణాద్విభుత్వాద్విష్ణురుచ్యతే,
భగవాన్ సర్వవిజ్ఞానాదవనాదోమితి స్మృతః. ౬౩
సర్వజ్ఞస్సర్వవిజ్ఞానాత్సర్వస్సర్వమయో యతః,
శివస్సనిర్మలో యస్మాద్విభుస్సర్వగతో యతః. ౬౪
తారణాత్సర్వభూతానాం తారకః పరిగీయతే,
బహునాత్ర కిముక్తేన సర్వం బ్రహ్మమయం జగత్. ౬౫
అనేకభేదభిన్నస్తు క్రీడతే పరమేశ్వరః." (కూర్మ. ౪ అధ్యా.)

ఏయేకారణములవలన నేనామ మాపరమాత్మకుఁ గల్పింపఁబడినదో తెలియఁబడినదికదా. సర్వమాపరమేశ్వరుఁడే యగుననియే నమ్మి తెలివితక్కువచే దుర్వాదముల నొనరించి పాపమున కొడిగట్టకుండుటయే శ్రేయము ఒక్కొక్క కార్యము చేయుటచే నొక్కొక్క నామము కలిగినదనియు నన్నిరూపముల లోకరక్షణాము విహరించుచున్నవాఁ డాపరమాత్మ యొక్కఁడే యనియుఁ స్పష్టమయ్యెడిని. ఇప్పట్టున హరిహరులయం దుత్కృష్టత్వాపకృష్టత్వము లెక్కడనుండి వచ్చెను? కేవలాజ్ఞానకల్పితము కాదా యది. ఆయజ్ఞానమే పరమపురుషార్థమని యేల భావించుచున్నారో యూహింపఁ జాలకయున్నాను.

ఈకూర్మపురాణము తామసపురాణమనియు నది ప్రమాణముకాదనియుఁ గొందఱందురు. వారివాదమున కనుకూలముగఁ జెప్పునదియే వారికిం బ్రమాణము. ఆవిషయమును వెల్లడించుట కొక్కయుదాహరణముం జూపి యావాదము దుర్వాదమని నిరూపింతును. ఒకానొకప్పుడు విష్ణుమూర్తి కైలాసమున కరిగి శంకరుంగూర్చి తపస్సుచేయుచుండెను. ఈశ్వరుఁడు మహర్షులంగూడి ప్రత్యక్షమయ్యెను.

శ్లో. "ఆగత్య భగవాన్ రుద్రశ్శంకరో వృషవాహనః,
దదర్శ విష్ణుం దేవేశం తపంతం తప ఉత్తమమ్.
జుహ్వానమగ్నిం విధివద్ద్రవ్యైర్మంత్రైర్జగత్పతిమ్. ౧

... ... ... ... ...

తతో వ్యాప్తమనా విష్ణుస్తుష్టావ హరమీశ్వరమ్.
నమస్తే శితికంఠాయ నీలగ్రీవాయ వేధసే,
నమస్తే శోచిషే అస్తు నమస్తే ఉపవాసినే. ౧౩
నమస్తే మీఢుషే అస్తు నమస్తే గదినే హర,
నమస్తే విశ్వతనవే వృషాయ వృషరూపిణే. ౧౪
అమూర్తాయ చ దేవాయ నమస్తేఽస్తు పినాకినే,

... ... ... ... ...

హరాయ హరిరూపాయ నమస్తే తిగ్మతేజసే,

... ... ... ... ...

కాను వాక్స్తుతిరూపా తే కోను స్తోతుం ప్రశక్నుయాత్,
కస్య వా స్ఫురతే జిహ్వా స్తుతౌ స్తుతిమతాం వర. ౩౬
క్షమస్వ భగవన్ దేవ భక్తోఽహం త్రాహి మాం హర,
సర్వాత్మన్ సర్వభూతేశ త్రాహి మాం సతతం హర. ౩౭

రక్ష దేవ జగన్నాథ లోకాన్ సర్వాత్మనా హర,
త్రాహి భక్తాన్ సదా దేవ భక్తప్రియ సదా హర." ౩౮

(హరివంశము. భవిష్యపర్వము. ౮౭ అధ్యా.)

ఇట్లు విష్ణువు స్తుతియింపఁగా శంకరుఁడు వరమిచ్చెను. హరివంశముకూడఁ బ్రమాణగ్రంథము కానిచో వారియజ్ఞానమే ప్రమాణము కాఁగలదు. ఈవిషయమున నింకొక్కయుదాహరణముం జూపెదను.

శ్లో. "యుష్మద్దత్తవరో బాణో జీవతామేష శంకర,
త్వద్వాక్యగౌరవాదేతన్మయా చక్రం నివర్తితమ్. ౪౬
త్వయా యదభయం దత్తం తద్దత్తమఖిలం మయా,
మత్తో విభిన్నమాత్మానం ద్రష్టుమర్హసి శంకర. ౪౭
యోఽహం సత్వం జగచ్చేదం సదేవాసురమానుషం,
మత్తో నాన్యదశేషం యత్తత్త్వం జ్ఞాతుమిహార్హసి. ౪౮
అవిద్యామోహితాత్మానః పురుషా భిన్నదర్శినః,
వదంతి భేదం పశ్యంతి చావయోరంతరం హర. ౪౯
ప్రసన్నోఽహం గమిష్యామి త్వం గచ్ఛ వృషభధ్వజ,"

(విష్ణుపురాణము. ౫ అంశము. ౩౩ అధ్యా.)

"దేవ దేవ మహాదేవ భూతాత్మన్ భూతభావన.
త్రాహి నశ్శరణాపన్నాన్ త్రైలోక్యదహనాద్విషాత్. ౨౧
త్వమేకస్సర్వజగతామీశ్వరో బంధమోక్షయోః,
తం త్వామర్చంతి కుశలాః ప్రపన్నార్తిహరం గురుం. ౨౨
గుణమయ్యాం స్వశక్త్యాస్య సర్గస్థిత్యప్యయాన్ విభో,
ధత్సే యయా సదృగ్భూమన్ బ్రహ్మవిష్ణుశివాభిధాం. ౨౩
త్వం బ్రహ్మ పరమం గుహ్యం సదసద్భావభావనం,

నానాశక్తిభిరాభాత స్త్వమాత్మా జగదీశ్వరః.” ౨౪

... ... ... ... ...

(శ్రీభాగవతము ౧ స్కం ౭ అధ్యా.)

సాత్త్వికపురాణములని వైష్ణవులచే నంగీకరింపఁబడిన విష్ణుపురాణభాగవతములయం దీప్రమాణములు గలవు. వీనింబట్టి పరి లించినను శివకేశవులొక్కతత్త్వమునుండి కల్గినవారనియు, భేదమే లేనివారనియు స్పష్టమగును. ఎవ్వని స్తుతించినను నీవే సమస్తము ననుటచే నేనామము నేరూపమును నేప్రవృత్తిని సర్వేశ్వరుండగు పరమాత్మయే ధరించి చేయుచున్నాఁడనియు, హరిహరబ్రహ్మాదు లాపరమాత్మరూపాంతరములే యనియు సిద్ధాంతము తెలెడిని. వీనింజూచియు విష్ణువే యధికుఁడని శివుఁడే శ్రేష్ఠుఁడని పలుకువారిని మనము స్మరింపకుండుటయే ప్రియము. దుష్కర్మపరిభూతస్వాంతులగుట వారి కట్లే సర్వదా తోఁచుచుండుననుట నిక్కము. ఈవిషయమునే శ్రీభగవద్గీతయుఁ దెల్పుచున్నవి.

“సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯
యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి. ౩౦
సర్వభూత స్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే.” ౩౧

(౬ అధ్యా.)

ఈకృష్ణవాక్యము సర్వము పరబ్రహ్మమయమే యగునని తెల్పెను. ఇట్లుండినపుడు మానవు లితరులయుపాస్యదేవతల నేల యధములని దూషింపవలయునో తెలియదు.

అహం త్వం సర్వగో దేవ త్వమేవాహం జనార్దన,
ఆవయోరంతరం నాస్తి శబ్దైరర్థైర్జగత్పతే.
నామాని తవ గోవింద యాని లోకే మహాంతి చ,
తాన్యేవ మమ నామాని నాత్ర కార్యా విచారణా.
యశ్చ త్వాం ద్వేష్టి భో దేవ స మాం ద్వేష్టి న సంశయః.

(హరివంశము.)

ఇట్లు ప్రమాణములంజూపి యింకను బెంచి వ్రాయక యీవిషయమును వదలి విషయాంతరమును దడవెదను.

ఇది విషయావతరణ మను ప్రథమసోపానము.

# భగవద్విశ్వాసము.

...

## ఆరాధనభేదములు.

భక్తవర్యులారా! భగవంతుని సగుణు నారాధింపవలయు నని వ్రాయఁబడియెను. దేవతాదూషణము స్వలాభహానికరమని యు దాన నించుకేని లాభము లేదనియు విశేషించి హానియే కల్గు ననియు సప్రమాణముగాఁ దెలుపఁబడియె. ఇం దారాధించు పద్ధతు లెట్టివని నిర్ణయింపఁబడును. ఈపద్ధతి యెఱుంగుట ముఖ్యము.

సర్వవ్యాపకుఁ డగుపరాత్పరుని మనోగతునిగఁ జేసి కొనుట సామాన్యకార్యమా. దానికొఱకు రూపమే లేని యా తత్త్వమున కొకరూపము కల్పింపవలయును. దీని కర్చారూప మని పేరు ఆరూపమును మనోగతముగ నొనర్చుకొనుటయు విశేషశ్రమసాధ్యము. దానికొఱకుఁ బ్రతిమాదులు కల్పింపవల యును. ప్రతిమార్చన మనఁగా విగ్రహపూజ యనఁగా నొక టియే. దీనికే బాహ్యపూజ యని పేరు. ఈబాహ్యపూజ మాన సికపూజకుఁ బ్రథమాంగము. ఒకప్రతిమను గల్పించుకొని యద్దానిని జూచుచు భగవంతునం దావాహనముచేసి పూజింప వలయు. ఈపూజయే నిరంతరముచేయుచుండిన నిరర్థకప్రయత్న మగును. ఈబింబమును మనోవీథిం గాంచుట కభ్యసించి నంతవఱకే యీబాహ్యపూజ. ఇది నిష్ఫల మనరాదు. మానసి - ర్చనమునకుఁ బ్రథమాంగముకదా. సర్వకాలము ప్రతిమా

రూపునిగా భగవంతు నారాధించుచుండిన నేనాఁటికి నాతఁడు తరింపఁజాలఁడు. ఈకల్పితరూపమును మనఃపద్మముననునిచి భావ కల్పితోపచారములచేఁ బూజింపవలయును. కొంతకాల మిట్లు చేయఁగా భగవంతు నర్చారూపము ధ్యానించుట కుపయుక్త మగును. మనఃపద్మమునం దాసీనుం జేసిన యాపరమేశ్వరుని యందు నిశ్చలముగా మనస్సు నిలుపుటకే యోగమని పేరు. ఆస్థితియందుఁ బదార్థము లాయుపాసకునకుఁ బనికిరావు. కష్ట మనునది లేక కూరుచున్నచోటినుండి కదలక యాభక్తుఁడు భావనాకల్పితములగు నమూల్యవస్తువుల నాపరంధాము నర్చించును. ఆస్థితియందుండు నుపాసకుఁడు కామసంకల్పవర్జితుం డగును.

"పూర్ణస్యావాహనం కుత్ర సర్వాధారస్య చాసనమ్,
స్వచ్ఛస్య పాద్యమర్ఘ్యం చ శుద్ధస్యాచమనం కుతః.
నిర్మలస్య కుతస్స్నానం వాసో విశ్వోదరస్య చ,
అగోత్రస్య త్వవర్ణస్య కుత స్తస్యోపవీతకమ్,
నిర్లేపస్య కా భూషా క్వాలంకారో నిరాకృతేః,
నిరంజనస్య కిం ధూపైర్దీపైర్వా సర్వసాక్షిణః,
నిజానందైకతృప్తస్య నైవేద్యం కిం భవేదిహ.
విశ్వానందయితుర్విష్ణోః కిం తాంబూలం ప్రకల్ప్యతే.
స్వయంప్రకాశచిద్రూపో యోఽసావర్కాదిభాసకః,
గీయతే శ్రుతిభిస్తత్ర నీరాజనవిధిః కుతః,
ప్రదక్షిణమనంతస్య ప్రణామోఽద్వయవస్తునః.
వేదవాక్యైరవేద్యస్య కిం వా స్తోత్రం విధీయతే.
బహిరంతశ్చ సంపూర్ణో కథముద్వాస్యతే విభుః.
ఇతీయం భావనా యస్య దృఢా భవతి సర్వదా,

నైవ తస్య పరా పూజా మౌనమేవ పరో జపః,
అచింత్యమపరం ధ్యానం ధ్యానం నిర్విషయం మనః.
దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవస్సనాతనః,
త్యజేదజ్ఞాననిర్మాల్యం సోఽహంభావేన పూజయేత్.
అహింసా ప్రథమం పుష్పం పుష్పమింద్రియనిగ్రహః,
సర్వభూతదయా పుష్పం క్షమా పుష్పం విశేషతః,
... ... ... ... ..."

ఇదియే మానసికపూజాపద్ధతి యని యోగు లందురు. యోగియే కాకయున్న ధ్యానము చేయఁజాలఁడు. ఏవో నాలుగు శ్లోకములు చదివి కన్నులుమూసినచో నది ధ్యానముకాదు.

"శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్. ౨౫
యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరం,
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్. ౨౬
సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯
సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే. ౩౧
తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి తతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున. ౪౬
యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా,
శ్రద్ధావాన్ భజ- యో మాం స మే యుక్తతమో మతః." ౪౭

(భగవద్గీత ౬ అధ్యా.)

ఇందు శ్రీకృష్ణభగవానుఁడు పరిశుద్ధాంతరాత్మ యగుటకు మా ముపదేశించెను. యోగ మనఁగా ముక్కు చెవులు

మూసికొని గారడివానివలె నితరుల కందేదియో యున్నయట్లు కనఁబఱచుట కాదు. చిత్తవృత్తుల నిరోధించి యభీష్టదేవత యందు మనస్సును జేర్చుట.

సూ. "యోగశ్చిత్తవృత్తినిరోధః." ౨

అను పాతంజలయోగసూత్రము ననుసరించి పరికించినను నై యర్థమే దృఢపడుచున్నది. గీతాశాస్త్రమునందు భగవంతుఁడు యోగి యందఱికంటె నుత్కృష్టుఁడని యుపదేశించెను. "జ్ఞానిభ్యోఽపి మతోఽధికః" అనుమాట భగవంతుని నోటినుండి వెడలినపుడందు సత్యము కలదా లేదా యని తర్కింప నక్కఱయుండదు. అట్లు చెప్పుటకు హేతువు లేక పోలేదు. మనస్సు పరిపక్వముకావలయునన్నఁ జాంచల్యము లేక యుండవలయును. చంచలత్వము తొలఁగుటకు యోగము సాధనము. మనోనిగ్రహము దుస్తరకార్యమని యర్జునుఁడు ప్రశ్నింపఁగా నందులకు.

"అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలం,
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే. ౩౫
అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః." ౩౬

(౬ అధ్యా.)

(వైరాగ్యమనఁగా దృష్టాదృష్టభోగములయందు దోషముండు నట్లభ్యసించి యిష్టము లేకుండుట.)

అని బోధించెను. నిరంతరాభ్యాసముచేత మనస్సునుస్థిరముగ లక్ష్యమునందు నిలుపవలయును. అభ్యాసము వైరాగ్యము లేని యంతఃకరణముగలవానికి యోగము సాధింపఁ దగనిది.

నిరంతరాభ్యాసము భోగవైముఖ్యము గలవారలకే యది సాధింప శక్యము. అది సాధించినఁగాని మనస్సు స్థిరతనొందదు. అది కుదిరినఁగాని భగవత్సాక్షాత్కారము కలుగదు. ప్రాణాయామాదియోగములచేతఁ జిత్తవృత్తుల నిరోధించి పరిశుద్ధాంతఃకరణుఁడు కాకయున్న నాతఁ డెన్ని వేషములు వేసినను లాభము నొందఁజాలఁడు.

"కామబీజాన్యనంతాని సంప్రరోహంతి యద్హృది,
తత్రాటవీనిభే జ్ఞానపుణ్యసస్యం న వర్ధతే. ౫
దోషదృష్ట్యగ్నిసందగ్ధే కామబీజే తు చేతసి,
గురుశా. హలైః కృష్టే సుక్షేత్రే తద్వివర్ధతే." ౬
(సాంఖ్యసారము. ౬ పరిచ్ఛేదము.)

అని విజ్ఞానభిక్షువు తెలిపెను. యోగబలమునఁగాని యింద్రియవ్యాపారములు నశింపవనుట సిద్ధాంతము. యోగాభ్యాసములేని యఁసుఁటమాటలు వెట్టవేదాంతుల రిక్తవచనముల వంటివి. వానిఁ బాటింపక శ్రమములకు నోర్చి గురూపదేశమూలమున యోగమును జక్కఁ నభ్యసించి మనస్సు నాయుపాస్యదేవతయందు నిలుపవలయును. ఆస్థితి యత్యల్పకాలమున్నను సిద్ధినొసంగును. మనోనిశ్చలత్వము లేక మంత్ర మెన్నిసారు లుచ్చరించి జపమాల త్రిప్పినను లాభము సంపూర్ణముగా లభింపదనుట నిక్కము.

వేదాంతశాస్త్రజ్ఞుల మనుకొను కొందఱు జీవయాత్రకై పామరుల మోసపుత్తురు. "యోగము లేల? శాస్త్రవాదము లేల? గురుకటాక్షము కల్గినఁజాలు" నని యుపదేశింతురు. అట్టివారలకే శిక్ష కూట మధికము. వారినెల్ల మోసపుచ్చుచున్నామని

వారూహింతురుగాని తమ్ముం దమరే మోసపుచ్చుకొనుచున్నారని యెఱుంగరు. అట్టివారు వంచకు లనంబడుదురు. వారికంఠె బాషండు లుత్తములు. వారిమంత్రోపాసనము దుష్టమైనది. వారికి లక్ష్మియే పరదైవము. లక్ష్మీకటాక్షము ద్రవ్యరూపమునం గలుగవలయునని వారిభావమై యుండును. కావున నట్టివారి మాయావాగురులకుం జిక్కక సద్గురువుకడం జేరి భగవంతు నుపాసించుపద్ధతులం దెలిసికొని యంతతోం దృప్తినొందక శాస్త్రములం బరిశీలించి మది దృఢపఱచుకొని యుపాస్యదైవమును బరమాత్మగా సంభావించుచు సర్వదేవతామయునిగ భావించుచుం దన్మంత్రము జపించుచుం గల్పితరూపముగల యాదైవమునే మనఃపీఠమున నిలిపి జపించుచు మానసికపూజావిధి కనురూపమగునట్లు పూజించుచు నెవండు సంగవిముక్తుండగునో యతండే తత్కరుణకుం బాత్రుండగును.

భగవదుపాసన యొక్కనిమేలుకొఱకుం గాదు. సర్వభూతహితముకొఱ కది చెప్పంబడినది. సర్వభూతములహితము నాశించియే సాధకుం డుపాసింపవలయును. అట్లుంగాక స్వలాభముకొఱ కుపాసించిన నది ఫలవంతము గానేరదు. అట్టివారలకు సర్వేశ్వరుం డనుగ్రహింపండు. ఏలయనంగా సర్వభూతాంతర్వర్తియగు తన నొకచో నున్నవానిగా భావించిన నాకార్యము త్తమ మని భావించునా? "పరమేశ్వరప్రసాదసిద్ధ్యర్థ" మ్మని సంకల్పించి యుపపాసించిన నది భగవత్సంతృప్తిం జేయం జాలును. అట్టివారికి వ్యక్తిభేదములు పొడకట్టవు. ఇంక దేవతాభేదము లెట్లు పొడకట్టును? అదియే యుపాసకుని ముఖ్యలక్షణము.

"యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి."

అని భగవంతుఁడు చెప్పెఁగదా. దానియంతరార్థమేమి? జపయజ్ఞమున మనస్సు నిర్మలమగును. ధ్యానయోగము సిద్ధించును. ఇతరులను బాధింప నక్కఱలేదు. ద్రవ్య మక్కఱ లేదు. హింసాకర్మము కాదు. ఉపవాసాదినిష్ఫలనియమము లక్కఱలేదు. కావుననే జపయజ్ఞము నే నని శ్రీకృష్ణమూర్తి నొక్కి పల్కెను. చిత్తసంశుద్ధిని గల్గించుకార్యమునకంటె నుత్కృష్టకార్య మేది యుండును ఏది యుత్కృష్టకార్యమో యది భగవత్స్వరూపముగాక మఱేమగును? కావుననే సత్కర్మమును విధించునపుడు శాస్త్రములు సమాహితమనస్కుఁడై చేయవలయునని తెలుపును. సమాహితచిత్త మనఁగా యోగ బలమున నిర్మలమైన చిత్త మని యర్థము. కావున నుత్తమగతిఁ బొందఁగోరువాఁడు యోగము నభ్యసింపవలయును. ఇట్లు భగ వంతు నుపాసించు టొకయారాధనవిశేషము.

## ౧ సేవాభేదములు. ౧

ఇట్టియుపాసనమున కర్హుఁడు కానివాఁడు దానిని సంపాదింపఁగోరి సేవావిశేషములచే భగవంతు నారాధింపవలయును. అవియు నధికారిభేదము ననుసరించియుండును. అన్నియు సమానఫలప్రదములా యన్న నౌనన వలనుపడదు. కొందలు దేవాలయములకుంబోయి యుత్సవవిగ్రహములను రథమునఁ గూరుచుండఁబెట్టిన,వానిని జూచినంతనే ముక్తిదొరకు నందురు.

"రథస్థం కేశవం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే."

అనువచనము నుదాహరింతురు. కొందరు దేవాలయమును దూరమునుండి చూచి 'గోవిందా' యన్నంతన మెచ్చి సాక్షాత్కరించి భగవంతుఁ డాభక్తు నెత్తుకొనిపోయి యట్లే

వైకుంఠపురమున నుద్యానవనమున సరస్తీరమునఁ దులసీవనము నడుమ మందారబృందారకభూరుహమునీడఁ గూరుచుండఁబెట్టి యిదియే ముక్తిమండపము! ఇందుఁ గూరుచుండుము. చల్ల గాలి వీచును. మంచియన్నము తనంతన వచ్చును. నీప్రయత్న మక్కఱలేకయే యదిస్వాదువుగ నోటిలోనికింబోయి కడుపునఁ జేరి చల్లఁజేయును. పిదప మంచి నిద్దురపట్టును. అదియే ముక్తి యగునందురు. వేఱొక్కకొందఱు శ్రీశైలమునకుం జని శిఖర మును జూడుము. మరల నీకు జన్మమే కలుగదు. శివదూతలు దివ్యవిమానమున నిన్నుఁ గూరుచుండఁబెట్టుకొని జయజయ నినాదములు చేయుచుఁ గైలాసమునకుఁ గొనిపోయి నిమేష మాత్రమున శంకరపాదపంకేరుహములఁ గనఁబఱచి యాచెంత నున్న ముక్తివృక్షచ్ఛాయఁ గూరుచుండఁబెట్టుదు రందురు. ఇంకనుం గొందఱు దేవాలయములోనికింబోయి యందుఁగల వింజామర నందుకొని రెండుమూఁడుసారులు విసరుము. ఆగాలి నీపాపముల నొక్కెత్తుగఁ గొనిపోయి భూమింద్రవ్వి యందు వాని నునిచి మరలఁ బూడ్చి వడివడి నపుదెంచి నిన్నెత్తుకొని యెక్కడికో పోవును. ఆవల నీకేమికావలయునో యాపనియే సాగును. అదియే మోక్షమందురు. మఱియుంగొందఱు భగ వంతునిగొల్చుట, యాపరమాత్మ నీసేవనెఱింగి ప్రత్యక్షమగుట, ఆమీఁద వరము లిచ్చుట కడుంగడుంగష్టము. దేశికు నారా ధింపుము. సంసారముమానిగాని భార్యంగూడిగాని నీకున్నగృ హక్షేత్రారామముల నమ్మివచ్చిన ద్రవ్యమును స్వర్ణముగాఁజేసి గుట్టుగఁ దెచ్చి దేశికుపాదారవిందములకడ సమర్పించి చేతులు జోడించుకొని యుండుము. వారియింట సర్వకార్యములు చేయుచుండుము. దేశికభుక్తశేషము మహాప్రసాద మనఁబడు.

దానిని వారొసంగనిది చాలదే యనక గుటుక్కున మ్రింగి యది యెంగిలియనక చేతులుకూడ జలములఁ గడుగుకొనక పార్శ్వములకుఁ బట్టింపుము. శయనించినపు డామహాప్రసాదమును జీమలు భక్షించి పవిత్రతం గాంచి విష్ణులోకమునకు నీకంటె ముందుగాఁ బోవును. నీవును వానిని కృతార్థజన్మము గలవానినిగా నొనరించిన మహాపుణ్యమున దేశికు ననుగ్రహమునను, దేశికుఁ డనుగ్రహించిన యెనిమిదక్షరములుగల మహామంత్రము ప్రభావమునను గైవల్యమునకుం బోవుదువు. దేశికులేలరారని మాత్రము ప్రశ్నింపకుము. వారు స్వేచ్ఛాప్రవర్తకులు. విధినిషేధములు వారి కక్కఱలేదు. పామరులను భక్తలనుగాఁ జేయుచు వారిపాపములనుదమ రేమూటగట్టుకొనుచుఁ జాలకాల మీలోకమున నుందురు. ఇది భగవంతుఁడు దేవాలయమున విగ్రహరూపమునఁ గనఁబడి యొరులకు వినఁబడకుండఁ గుడిచెవిలో నూఁదెను. వారియాజ్ఞానుసారము శ్రీదేవివలె స్త్రీరత్నముగా నున్న భార్యంగూడి నిరంతరము పాయసమును బరమేశ్వరునకుం జూపించి తామే యారగించుచు స్వర్ణాకర్షణమంత్రమును జపించుచు నుపవాసాదులు పామరులకుం గల్పించినచోట వాని మాని వలసినన్నిమారు లారగించుచు ధ్యానయోగము నభినయించుచుఁ దమకుఁ దెలియని వేదాంతవిషయములను దెలిసినట్లు నటించుచుఁ దెలివిలేనివారలకుపదేశించుచు నీవిషయములు గురుపరంపరాప్రాప్తములు కాన శిష్యులకుఁ దప్ప నొరులకుఁ జెప్పఁగూడదని కట్టుబా టొనరించుచు భాష్యకర్తల భావము గురుమూలముననఁగాని దెలియఁదరముగాదనియు, వారందందు నితరులకుఁ దెలియకయుండవలయునని పొడిపెట్టి యున్నవారనియు శబ్దములపైఁ గలయర్థము వాదమునకుఁ

దప్పఁ దరణోపాయమునకుఁ బనికిరాదనియు, శిష్యులఁ దరింపఁ జేయ దేశికులవారే యందం దవతరింతురనియు, వారినెఱుంగ సామాన్యముగా శక్యముకాదనియు, వారు తమగుట్టు తెలియకుండఁ బండితులుగానియట్లు నటించుచు గూఢముగా నర్ధరాత్రమునందు శ్రీమహావిష్ణువును ధ్యానింతురనియు, వారప్పుడప్పుడు దేశికరూపమున దర్శనమిచ్చుచుఁ జేయఁదగినకృత్యములను బోధించిపోవుచుందురనియు,నొక్కొక్కతఱి వారేమి యాహారమును గోరుదురో దాని నర్పింపకయున్న మరలఁ గనఁబడరనియు, విశేషించి వారికి ఘృతమునందును, గపిలధేను[illegible]రములయందును, స్వాదుఫలములయందును బ్రీతి యెక్కుఁడనియు,వారిసంతృప్తికొఱకే మేము శిష్యులమూలమున ధనము గ్రహింతుమనియు, శ్రీదేవి మొన్నటి యమావాస్యయందు నడిరేయి పొరుగింటితాయారువువలెఁ బొడసూపి స్వర్ణముద్రికలహారము (కాసులదండ) నడుగఁ గొలఁదిదినములలో సంపాదించి యిత్తును. మరల నొక్కసారి యీదివ్య సుందరవిగ్రహమును గనఁబఱచి నన్ను సఫలమనోరథునిగాఁ జేయవలయునని ప్రార్థించితిమనియు, నందులకే యీప్రయత్నముకానిమాయింటి యాఁడువారికొఱకుఁ గాదనియు నిట్టి వెన్నియో దేశికరహస్యములఁ దమ్ము మహాత్ముఁడని నమ్మినపామరులకుఁ బోధింతురు. వేఱొక్కకొందఱు పూటకు మూఁడుపిడికిళులచొప్పున భస్మము పూసికొని యారేణువులు కూరుచున్నచోటును రజతభూమిగా నొనర్చుచుండఁ గరుణాశరధియగు పార్వతీపతిని సేవింపకున్న మోక్ష మెట్లు లభించుననియుఁ బ్రదోషములయందు మాసశివరాత్రిపర్వములయందుఁ గార్తికసోమవారములయందు సదాశివుం బూజించుచుఁ బ్రాణలింగమును ధరించుచు విష్ణుతిథుల

యం దభ్యంగస్నానక్షౌరకృత్యముల నొనరించుచు వీరశైవ మతాచారముల నవలంబించుచుఁ బరమేశ్వరుని బిల్వపత్త్రములఁ బూజించుచు నారాధ్యుల మగుమాకు గుట్టుగా నింటఁగల స్వర్ణ మొసంగుచు మరల దారిద్ర్యము తొలఁగుటకై యీశ్వరు నారాధించుచు నిటు పదునొకండువత్సరములు వ్రత ముసల్పిన వృషభవాహనారూఢుఁడై యంబికంగూడి పరమ శివుఁడు ప్రత్యక్షమగును. ఇంకను భక్తుని బరీక్షింపఁగోరి కనఁ బడనిచో మరలఁ బదునొకండువర్షములు పూజింపవలయును. ఆశంకరుఁ డప్పటికిని దర్శనమీయకున్న యాపవనము పూజిం చిన మరణబాధలఁ గల్పించి యప్పుడును వదలనిభక్తి కలిగి యున్న విమానమున నెక్కించుకొని కైలాసమున కరిగి బిల్వ పత్త్రములు భక్షించుచు గంగాసలిలములఁ ద్రాగుచుండుమని బోధించును. అట్లుచేయుచున్న మెచ్చి గాణాపత్య మొసంగు నని యుపదేశింతురు. మహానుభావులు కొందఱు భ్రూమధ్య మున సొగసుగఁ గుంకుమబొట్టుపెట్టి శిరస్స్నానముచేయక యున్నను గోసముడిచివైచి భగవతి త్రిపురసుందరి రాజరాజేశ్వరి త్రిపురభైరవి పూజింపఁదగినదేవత యనియు, నామెకన్న దేవ తలే లేరనియు, మూలప్రకృతి నాశ్రయించినఁగాని ముక్తి లేదనియు, భగవతిని రహస్యపూజల నలరింపవలయు, నెట్టి దుష్పదార్థములైనను దన్మంత్రప్రభావమున సత్పదార్థములుగా మాఱుననియు, నదియేకదా ప్రత్యక్షమనఁగా ననియు, బోధిం చుచు మధుపాననిరతులై పలలభక్షకులై యిది శక్తి యజ్ఞ మనుచుఁ దెలుపుచుఁ గనుల మూయుచుఁ దెఱచుచు శిష్యు లకు మంత్రముల నుపదేశించుచు మహాలక్ష్మీప్రీతి యలరార భక్త నభినయింతురు. ధ్యానము నభినయింతురు. ఇట్టివారల

మాటలకు బేలుపోయి కొందఱు పురుషార్థములను బోఁగొట్టు కొందురు.

## దేవాలయములు.

దేవాలయములకుం బోయి పాషాణమృత్తికాదులచేఁ జేయఁబడినప్రతిమలఁ బూజించుట ప్రథమసోపానము. పరమేశ్వరుఁ డరూపుఁడైన నుపాసకులకు ధ్యానసాధనమున నేదే నొకరూపము నంగీకరించును. అనఁగాభక్తుఁడేరూపమునఁ దన్ను ధ్యానించునో యారూపమునఁ బొడసూపుననియే దీనిభావము.

"న తే రూపం న చాకారో నాయుధాని న చాస్పదమ్,
తథాపి పురుషాకారో భక్తానాం త్వం ప్రకాశసే."

అనియు,

"ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా."

అనియు ప్రాచీనసూక్తులు గనుపట్టుచున్నవి.

శ్రుతి. "నీలతోయదమధ్యస్థాద్విద్యుల్లేఖేవ భాస్వరా,
నీవారశూకవత్తన్వీ పీతా భాస్వత్యణూపమా.
తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితః,
స బ్రహ్మ సశివస్సహరిస్సేంద్రస్సోఽక్షరః పరమస్స్వరాట్." అనియుం,
"అంతశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు,
త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వమింద్రస్త్వగ్ం
రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మ త్వం ప్రజాపతిః."

నియు శ్రుతి బోధించుచున్నది.

వీనింబట్టిచూడఁగా ధ్యానమునకై రూపము కల్పింపఁ డుననియు సకలరూపుఁడుగాన నాపరాత్పరుఁడు తదాకారమునఁ బొడసూపుననియు గ్రహింపఁదగును.

శ్లో. "నహ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః,
తే పునంత్యురుకాలేన దర్శనాదేవ సాధవః." ౩౧

(భాగవతము. ౪. అధ్యా)

అని శ్రీకృష్ణమూర్తియే యక్రూరునితోఁ జెప్పెను. జలమయములగు తీర్థములు, మృచ్ఛిలాకారములు పాషాణమయములునగు దేవతలు సేవించువారిని పరిశుద్ధుని జేయఁజాలుదురు కాని వారు చిరకాలమునకుఁగాని చేయనోపరు. సాధువులు దర్శనమాత్రముననే పరిశుద్ధునిగాఁజేయుదురు. అనఁగా నొకనది యందు స్నానముచేసినచో నాతనిభావమునఁ గలభక్తినిబట్టి యానదీదేవత యొకరూపమునఁ బ్రత్యక్షమై పునీతునింజేయ వలయును. స్నానమాత్రమునఁ బావనుఁడనైతి ననుకొనుట వెఱ్ఱి. భావనాబలమున నాదేవత ప్రత్యక్షము కావలయును.

"మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినే దినే,
సకృద్గీతాంభసి స్నానం సంసారమలమోచనమ్."

అను ప్రమాణముపై యర్థమును దృఢపఱచుచున్నది. అఱ్ఱే యొక విగ్రహమును గాంచి పరమేశ్వరు నాకృతిగా ధ్యానించినచో నాభక్తుని ధ్యానమహిమముంబట్టి పరమాత్మ కరుణచే నారూపమునఁ గనఁబడును. ఈఫలము చిరకాలమునకుంగాని కలుగదు. సాధువులనఁగా నిట్టికష్టములకుఁ బాల్పడి కృతకృత్యులైన వారుగానఁ దరణోపాయము నన౯ఁగా దీనికంటె నుత్తమమగు మానసికపూజను బోధింతు రనియే దీనిసారము.

దీనింబట్టి దేవాలయము లంతమేలు చేయనివనియేకదా భావమని కొందఱడుగవచ్చును. సత్యమే. ఐన నెల్లరు ధ్యానయోగము నభ్యసింపఁజాలరు. మానసికపూజచేయ నర్హులు

గారు. అట్టివారికి ననఁగా నాజన్మముననే భగవదారాధనము చేయఁ బూనువారికి (పామరులకు) దేవాలయములు సుంత సాయపడును. దేవాలయమును దూరమునుండి చూచినపుడును, సమీపమునకుంబోయినపుడును, అందుఁ గలవిగ్రహమును జూచినపుడును భక్తికుదిరిన నది క్రమక్రమముగా వృద్ధియగుటకు హేతువగును. ఆమరణము తత్కార్యముననే నిమగ్నుఁడగు నేని ఫలసిద్ధి గాంచలేఁడు.

శ్లో. "యోఽంతస్సుఖోఽంతరారామ స్తథాంతర్జ్యోతిరేవ యః,
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి. ౨౪
లభంతే బ్రహ్మనిర్వాణమృషయః క్షీణకల్మషాః,
ఛిన్నద్వైధా యతాత్మానస్సర్వభూతహితే రతాః: ౫. అధ్యా. ౨౫
సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౬. అధ్యా. ౨౯
యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరం,
అసమ్మూఢస్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే. ౧౦ అధ్యా. ౩
సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే,
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్." ౧౮ అధ్యా ౨౦

అను నీభగవద్గీతావాక్యములు పైభావమునే సిద్ధాంతముచేయుచున్నవి. ఎట్లనఁగా ఎవ్వఁడంతస్సున జ్యోతిర్మయుండ నగు నన్ను ధ్యానించునో, సంశయములులేక నన్నాత్మగా నెవ్వఁడు నమ్మునో, సర్వభూతములయం దున్నయాత్మను సర్వభూతముల నాత్మయందు గలవానినిగా నన్నెవ్వఁడు ధ్యానించునో, పుట్టుక లేక, ఆది యిది యని లేక సర్వలోకమహేశ్వరుఁడ నగునన్ను నెవ్వఁడు భావించునో, సర్వభూతములయం దేకభావనచే నన్ను

నవ్యయునిగా నవిభక్తునిగా నెఱింగి యెవ్వఁడు తలంచునో యట్టివాఁడునాకరుణకుం బాత్రుఁడై ముక్తినొందునని సారము. ఇందొక్కమాటయైన విగ్రహారాధనమును దెల్పదు. అంతియ కాక సర్వవ్యాపకునిగా నన్నుఁ దలంపకున్నఁ దరింపఁజాలరని కూడ బోధించును. కావుననే దేవాలయములు అక్షరాభ్యాసమువంటివి. తొలిసోపానము. పామరులకుం గల్పతరువులనుట న్యాయమే. కాని యాకైంకర్యమే జ్ఞానసాధనము కానేరదు. భగవంతుని కల్పితరూపము మనోవీథిఁ దాండవము సల్ప వలయును. లేకున్నఁ దరింపఁజాలఁడనుట సిద్ధాంతము.

శ్లో. "సందర్శ్యాథ శిలాం శిలామయగృహే సాక్షాదయం శ్రీహరి
ర్భక్తేభ్యో వివిధాన్ ప్రయచ్ఛతి వరాన్ సంసేవ్యమానస్త్వితి,
ఉక్తాం దేవలకస్య వాచమధికం విశ్వస్య సంసేవతే
త్వర్థం తత్త్వమసీతి వేదగదితం నో విశ్వసత్యల్పధీః."

అని శ్రీశంకరభగవత్పాదాచార్యులవారు బోధించిరి. పరమాత్మ తేజస్సు పాషాణములయం దేమాత్రముండునో లేదన వలనుపడదేమో. కాని తఱచుగా లేదనియే సజ్జనులు భావింతురు. అట్టి పాషాణనిర్మితమగుగేహమున నొకచో నొకశిలను గనఁబఱచి యితఁడే శ్రీమహావిష్ణువు. భక్తులకెల్లఁ గోరినవరములను బ్రసాదించును. సేవింపుమా యని బోధించు దేవలకుని (ఆఱాతిని గడుగుకొని బ్రదుకువాని) మాటలను మిక్కిలి నమ్మి యొకవింజామరఁ గైకొని విసరును. అంతియకాని పామరుఁడు వేదోక్తమహావాక్యములయర్థమును దెల్పిన విశ్వసింపఁడు. ఏలయన నతఁ డల్పమతికదా. అనిమహాత్ములు పలికిరి. దేవాలయమునఁ గలపాషాణములను వరములుకోరి పూజింపఁ

దలంపుగొన్నవారలకు వేదార్థ మెట్లు సరిపడును. అనేకజన్మము లెత్తినఁగాని యాయర్థము సత్యమని తోఁపదు. ఇట్లుండఁగా దేవాలయములే ముక్తి నొసంగుననియు నందున్నపాషాణమూర్తియే పరమేశ్వరుఁడని బోధించువారిమాట యిట యేటికి? వారు కేవల పామరులకే యుపదేశించుచో మహానందమే. దానికంటె నుత్కృష్టమార్గము లేదని వారిభావమేనైన వారు వంచకులే. శంక యిందుఁ గలుగ నవసరము లేదు.

కొందఱు కపటనాటకసూత్రధారులు ధనార్జనలంపటులై దేవాలయమహత్త్వముల నుపదేశింతురు. అట్లుగాక కేవలమూర్ఖజనులు తరించుపొంటె నాకార్యము చేయుచో మహాకార్యమే.

"యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః."

అనునట్లు విగ్రహపూజ తమ కక్కఱలేకున్న నితరులు తమ్ముఁ జూచి యట్లు చేయుదురన్న విశ్వాసముచేత మహాత్ములు చేయుదురు. ఫలాభిసంధిరహితముగ వారియారాధనము సాగును. అట్టివారు వారివారి యధికారవిశేషమునుబట్టి బోధింతురు. మహాత్ముల మనుకొనువారియుపదేశ మట్లుండదు. "అహేతు నాన్యానపితారయంతః" అనునట్లు తమరు తరించియు నితరులఁ దరింపఁజేయుపొంటెఁ దమ కక్కఱలేకయున్నను గర్మముల నాచరింతురు. వారిం గాంచినంతనే భక్తిరస ముప్పొంగును. బ్రహ్మతేజస్సు వారియం దద్భుతరీతిఁ బొడకట్టుచుండును. వారియుపదేశము తరణోపాయమును జూపించునదిగాయి యుండును. కావున దేవాలయములు పామరజనులకుఁ బ్రధానము యనియు నాపూజచేసి ధ్యాననిష్ఠనలవఱచుకొనినవారల,

కవి ప్రధానములుకావనియు నిరంతరము విగ్రహపూజ ప్రశస్తముకాదనియు గ్రహింపవలయును. ప్రహ్లాదాదులు భగవంతుని సర్వవ్యాపకునిగా ధ్యానించిరని భాగవతము బోధించును. వైకుంఠ మనునది యొకచోట నుండునగర మనరాదు. ముక్తిస్థాన మనవలయును. లేనిచో నది యశాశ్వత మనఁబడును. ఎందు భగవద్భక్తు లుందురో యవియెల్ల వైకుంఠమే కాక మఱేమగును. కొందఱు వైకుంఠలోకమును వర్ణించుచు సహస్రస్తంభమండపము లందుఁ గలవనిరి. ఔరా! వారు తిరుపతినిజూచి యిట్లే యందుండునని భావించిరికాఁబోలు! బృందావనము లందుఁ గలవనిరి. భావనచే నేమి నష్టమని యడుగుదురేమో. యది భావనయే యైన వాస్తవముగా నది యొక్కచో లేదనియే యర్థమగును. వేఱొకఁడు "ద్విసహస్రస్తంభమండిత"మ్మని భావించిన నది యింకొకవైకుంఠ మగును. ఇట్లెన్నియో వైకుంఠము లుండవలసివచ్చును. అంతియగాక యనవస్థాప్రసంగ మగును. కైలాసముకూడ నిట్లే. పురాణములయందేల యట్టి లోకములు కలవని యున్న దనరాదు. పురాణములు పండితులకుఁ బామరులకుంగూడఁ గావలసినధర్మముల బోధించును. కర్మవాసనల ననుసరించి యందెవ్వరు దేని కర్హులో దానిం గైకొందురు.

"సత్యం విధాతుం నిజభృత్యభాషితం
వ్యాప్తిం చ భూతేష్వఖిలేషు చాత్మనః,
అదృశ్యతాత్యద్భుతరూపముద్వహాం
స్తంభే సభాయాం న మృగం న మానుషమ్." ౧౮

(శ్రీ భాగవతము ౭ స్కం. ౮ అధ్యా.)

సర్వభూతములయందు వ్యాపించిన తనతేజస్సు నొక యదృ

త్యాకృతిం దాల్చిఁజేసి భగవంతుఁడు కనఁబడుచెననికదా దీని సారము. ఇచ్చోఁ గొందఱు నరసింహరూపమే భగవంతునిదని ధ్యానించినను గల్పితరూపములెల్లఁ బరమేశ్వరునివే యగుట బాధయేమి? "ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా" అని యున్న దేకదా. పై భాగవతప్రమాణమునుబట్టి యాలోచించిన సర్వభూతనివాసున కొక్కలోకమే నివాసార్హమనుట పొసఁగదు. వైకుంఠముకూడ నొకలోకమని, యందు భగవంతుఁ డుండునని చెప్పిన బాధయేమన్న నదియు స్వర్గాదుల వంటిదే యగును. వానికంటె నుత్కృష్టతమ మనవచ్చును. కాని యదియే శ్రీమన్నారాయణమూర్తి నివాసమున కర్హమని మాత్రము కల్పింపరాదు. అందే కాదు. కైలాసమునందు నా మహావిష్ణువే శివుఁడను పేర నున్నవాఁడన్నను బాధలేదు. ఈ నామము లీరూపములన్నియుఁ బ్రకృత్యతీతుఁడగు పరమేశ్వరు నంశములే యగు. కావుననే వీరందఱు ప్రకృత్యతీతులుకా రన వలయును. ఈనామములాభగవంతునకుం జెల్లవా యన్నఁ జెల్లు ననియే యొప్పుకొనవలయును. కాఁబట్టియే సర్వశబ్దవాచ్యుఁ డనుపేరామహాత్మునకుం దగునని పెద్దలు శ్రుతిస్మృతి ప్రముఖ ప్రమాణముల మూలమున సిద్ధాంతముచేసిరి. పరమాత్మకుఁ గొన్ని పేరులు చెల్లవని కల్పించువారు కలరేని వారికిది సమాధానముకాదు. ఇదియేకాదు. ఏదియు సమాధానముకాదు. వారిమతము ప్రకారము విష్ణుమూర్తి యొక్కచోటనే యుండును. సర్వవ్యాపకుఁడు కాఁడు. వారికి శిలామండపములే ము[illegible]నములు. స్వాద్వన్నమే భగవత్ప్రసాదము. కాంచనరూపమే మహాలక్ష్మిస్వరూపము. కాఁబట్టి వారికిఁ గొన్ని పురాణములే ప్రమాణములు. ఆకొన్నింటిలోఁ గనఁబడు శంకర

మహా_ప్రబోధక శ్లోకములు ప్రక్షిప్తములు. వారలే యావిష్ణు భక్తులు. ఇట్టివారలకు సమాధానము చెప్పఁబూనరాదు. భగవద్గీతలుకూడఁ బ్రమాణములుగా వారిచే నంగీకరింపఁ బడకపోవచ్చును. వారి కొక్క నమస్కారము.

మఱొక్క యారాధనభేదమునుగుఱించి ముచ్చటింతును. మానసికపూజ యుత్కృష్టమనియు,విగ్రహారాధనము ప్రథమ సోపానమనియు వ్రాసితిని. విగ్రహారాధనమునకన్న మిన్నయై మానసికార్చనమునకంటెఁ గనిష్ఠమై యొప్పు నొకమార్గము కలదు. విశేషించి మానసికపూజకు దీనికి భేద మంతగా లేదు. వినువస్తుసంగ్రహణ మిందున్నందున నించుక తక్కువయంటిని. పరమేశ్వరుని ధ్యానించుచుఁ బూజించుచుఁ దనకు దొరకిన పదార్థము భగవంతున కర్పించుచు నుండుటయే యాయారాధనము. అది విగ్రహారాధనము కాదు. అట్టిసాధువునకు శివకేశవు లిరువు రొక్కరుగనే కనఁబడుదురు.

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః. ౨౬
యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్. ౨౭
శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః,
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి." ౨౮
(గీత - ౯ అధ్యా.)

అను శ్రీకృష్ణభగవద్వాక్యమే పైమార్గమును దృఢపఱచుచున్నది. (దొరకినపత్రపుష్పఫలజలాదులను భ_చే సమర్పింపవలయును. ఆపదార్థము భక్తిపూర్వకముగ సంపాదింపఁబడినవి

గాన నది పరమపావనమని దేవదేవుఁ డంగీకరించును. కాని యాపురుషుఁడు ప్రయతాత్ముఁడు కావలయును. పరిశుద్ధబుద్ధి గలవాఁడు ప్రయతాత్ముఁ డనంబడును. ఏకార్యము చేసినను, ఏది భక్షించినను, సత్కార్య మింక నేది చేసినను నవియెల్ల భగవంతున కర్పింపవలయు. ఇట్లు ఫలములఁగోరక యాచరించినచో శుభాశుభ రూపములగు కర్మబంధములనుండి విడువఁబడి పరమాత్మ నొందును.) ఈభగవద్వాక్యసారమును నమ్మి విధివిహితమగు కర్మ మెద్దానిం జేసినను దానిని భగవదర్పణము చేయవలయును. దాన "ఇది నాకు" అను నహంభావము వదలిపోవును. అది వదలఁగనే నిర్మలాంతఃకరణుఁ డగును. ఈస్థితియం దుండు మానవుఁడు పాషాణనిర్మితగృహమునఁ గలవిగ్రహమును బూజింపఁడుకదా. సర్వగతునిగా నామహావిష్ణువును దలంచును. మానసికపూజయం దిట్టిపదార్థసంగ్రహణవాంఛయు నుండదు. కాననే యది యుత్తమోత్తమమనుటకుం గారణము. దీనివలన భగవంతు నారాధించుటకుఁ బదార్థసంగ్రహణ మక్కఱలేదనియుఁ జక్కనిభావనయే యద్దానికిం బ్రధానమనియు నీవిధ మెఱింగినవాఁడు యోగము నభ్యసించి మనోవీథిని బరాత్పరుం జూచుచుండుననియుఁ దాత్పర్యము. యాత్రాదులు దీనికంటె ను _ మము లనరాదు.

"అహం కాశీం గమిష్యామి తత్రైవ నివసామ్యహం,
ఇతి బ్రువాణస్సతతం కాశీవాసఫలం లభేత్."

_నుసూక్తి _త్తది కాదుకదా. కాశికిఁ బోవకున్నను నిట్లు తలంచుటచేఁ గాశివాసఫలము నొందు నేనఁగా నభిప్రాయ మేమి? సర్వదా మనస్సున భావించుటయే ముఖ్యమనికాదా.

మనస్సున నాయాత్రావిషయకచింత యున్నంజాలునని కాదా సారము.

"భావనామాత్రసంతుష్టహృదయః పరమేశ్వరః."

అన్న ప్రాచీనోక్తి యనృతమగునా. చేయనియుపచారములు చేసినట్లు భావించుటచే ననృతదోషము రాదా యనరాదు. ఆ భావనయెన్నికోటులజన్మమునకో దృఢపడును. అట్టివాఁడే తరించును. తక్కినవారు మరల మరల జన్మములెత్తి భగవంతు నారాధించి తుదకుఁ దృప్తికరమగు నారాధనమునఁ దరింతురు. ఇంక నారాధనభేదము లెన్నియో కలవుగాని యవి యంత ముఖ్యములుగావు. కావున వ్రాయమానితిని. ఇంతట నీవిషయ ముగించి విషయాంతరమును వ్రాయుదును.

## తపోవ్రతదానములు.

ఉపాసనవిషయ మించుక వ్రాయఁబడియెను. అందనేక మార్గములు గలవనియు సూచింపఁబడియెను. అందొకభేదము తపస్సనంబడును. తపశ్శబ్దమునకు యోగులు వేదాంతులు నిర్ణయించినయర్థ మేమని యించుక విచారింపవలయును. తపస్సనఁగా నింద్రియములను దమింపఁజేయుట యని సాధారణమగు నర్థము. గీతాశాస్త్రమునందు

"నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా,
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా."

(౧౧ అ. ౫౩.)

కరభాష్యము "నాహం వేదైః—ఋగ్యజుస్సామాథర్వవేదైః చతుర్భిరపి. నతపసా—ఉగ్రేణ చాంద్రాయణాదినా" అని. సామా

మ్యాలు చేయ భయంపడునట్టి చాంద్రాయణాదిరూపము తపస్సని భావము. పాతంజలయోగసూత్రములయందు సాధనపాదము నందు

సూ. "తపస్స్వాధ్యాయేశ్వరప్రణిధానాని క్రియాయోగః." ౧.

వ్యాసభాష్యము. "నాతపస్వినో యోగస్సిధ్యతి. అనాదికర్మక్లేశ వాసనాచిత్రా ప్రత్యుపస్థితవిషయజాలా చాశుద్ధిర్నాంతరేణ తపస్సంభేదమాపద్యత ఇతి తపస ఉపాదానం తచ్చ చిత్తప్రసాదన మబాధమానమనేనాఽఽసేవ్యమితి మన్యతే." అని

యతిరామానంద సరస్వతీకృత మణిప్రభానామకవృత్తి యందు

"బ్రహ్మచర్య, గురుసేవా, సత్యవచన, కాష్ఠమౌ, నాకారమాన, స్వాశ్రమధర్మ, ద్వంద్వసహన, మితాశనాదికం తపః. నకాయ శోషః. ధాతువైషమ్యే యోగవిఘాతాత్" అని.ఉగ్రమగు చాంద్రాయణవ్రతాదికము తపస్సని వేదాంతులమతము. చాంద్రాయణవ్రతముల నాచరించుటచే దేహము శోషిల్లును. దానఁ గామక్రోధాదులు తగ్గునని వేదాంతులయభిప్రాయమైనట్లు కనుపట్టు. లేక సామాన్యజను లాచరింప శక్యముకాని చాంద్రాయణాదివ్రతముల నాచరించుటచేఁ జిత్తశుద్ధికలుగునని వారియాశయ మనికూడఁ జెప్పనొప్పును. ఎట్లులైనను దేహశోషణము తప్పదు. తఱచుగా నుపవాసవ్రతమును యోగు లంగీకరింపరని స్పష్టమయ్యెడిని. కాయము శోషిల్లిన యెడల ధాతువు లనఁగా వాతపిత్తశ్లేష్మములు వైషమ్యమునొందు (అనఁగాఁ దమకు నియతమైన నడకను మానును.)ను. అది యోగవిఘాతమునకుఁగారణమగును. బ్రహ్మచర మ్ము, గురుసేవ,

సత్యవచనము, కాష్ఠమౌనము (గాఢమౌనము) ఆకారమౌనము, (దేహాము నించుకేఁ గదలింపకుండుట) తమయాశ్రమ ధర్మముల* నాచరించుట, శీతోష్ణాద్వంద్వముల సహించుట (ద్వంద్వము లనఁగా నొకదానివెంట నొకటిగ నంతరములేక సంభవించునవి) మితాశనము మొదలగునవి యన్నియుఁ దపస్సనంబడును. వీనినన్నింటి నాచరించినఁగాని తపస్సుకాదేమో యనుశంక నొందరాదు. ఇందేదే నొక్కదాని నాశ్రయించి మానక చేయుచున్నఁ దపస్సుచేసినట్లే యని యెఱుంగవలయును. ఇది యోగశాస్త్రసమ్మత మనఁదగును.

"శాస్త్రీయమార్గేణ కాయేంద్రియశోషణమ్ మనసశ్చేంద్రియాణాం చైకాగ్ర్యం వా,

"అంతర్ముఖాని యది ఖాని తప స్తతః కిమ్
నాంతర్ముఖాని యది ఖాని తప స్తతః కిమ్,
అంతర్బహిర్యది హరిశ్చ తప స్తతః కిమ్
నాంతర్బహిర్యది హరిశ్చ తప స్తతః కిమ్."

అని గౌరీశంకరభిక్షుసంగృహీత సర్వతంత్రసిద్ధాంత పదార్థ లక్షణసంగ్రహము తెలుపుచున్నది. ఇంద్రియము లంతర్ముఖము లగునేని దానికంటె వేఱొకతప స్సేమున్నది? ఇంద్రియము లంతర్ముఖములుకావేని తపస్సేల? లోపల వెలుపల హరి కనఁబడునేని దానికంటె వేఱొకతపస్సెందులకు? అట్టులాపరమాత్మ యుండినచో నట్టివానికిఁదపస్సేల? అని పై శ్లోకభావము. అనఁగా నింద్రియము లంతర్ముఖములగుటయే తపఃఫలమనియు, నవి యట్టులుండక బహిర్ముఖములుగనే యుండునేని తపస్సుచేసియు

లాభము లేదనియు, సమదర్శనత్వముకలిగిననదియే తపస్సనియు, నది యొదవనిచోఁ దపస్సు చేయుట నిరర్థకమనియు దీనిసారము.

తపస్సు చేయఁబూనినవాఁడు కామములమాని భగవత్ప్రీతిఁగోరిన యెడల నది యుత్తమతప స్సనంబడును. దీని నెల్లరు నాచరింపఁజాలరు. ఫలమునుగోరి యహింసావ్రతమూని యొకదేవతను మదినిల్పి తన్మంత్రమును జపించుచు ననన్యచిత్తుఁడై చేయునది మధ్యమతప స్సనంబడు తఱచుగా నెల్లవార లీమార్గమునే యవలంబింతురు. ధర్మార్థకామమోక్షములనంబడుపురుషార్థములు నాలుగుకోరుట పాపముగాదు. గృహస్థు లిద్దానినే తఱచుగా నాచరింతురు. వీరు

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్." ౨౨.
(గీత. ౯ అధ్యా)

అనుభగవదుక్తి ననుసరించిన నిష్కామమగు తపస్సు చేయనవకాశము లేనివారు సంసారయాత్ర గడపుచు భగవదనుగ్రహమును గోరువారు. వీరితపస్సనం దేమాత్రమేని పరహింసాభిలాషము కలిగియున్న చో నది యధమతపస్సనంబడును. వారు రజస్తమోగుణప్రధానులు. పైగీతాభిప్రాయము ననుసరించినవారు సత్వగుణైకప్రధానులు. వా రేవాంఛలంగోరకున్నను భగవంతుఁడే వారలకుం గావలసినఫలముల నొసంగును.

తపస్సు చేయు టనఁగా నెట్లు? అన్న చో నిట్లు సమాధానము చెప్పవలయును. ఇది మధ్యమతపస్సులో నంతర్భూతము. ఒకమంత్రము గురువును సేవించి యుపదేశరూపమునఁ బడసి దానికి నాకర్షణ బీజములను జేర్చి తదధిష్ఠాన దేవతారూప

మును (కల్పితమగుదానిని) మనస్సున నిల్పి యారూపమునే మనోదృష్టిం గాంచుచు మంత్రమును జపింపవలయును. అదృష్టరూపపాశములంబోలిన యాబీజములవలన నాదేవత యాకర్షింపఁబడును. ధ్యానము బలవత్తరమగునేని దేవత శీఘ్రంబె సాక్షాత్కరించును. భక్తుఁడు వరములం గోరును. ఆవరములవలనిలాభము నొందఁజాలుకర్మ మొనరించియుండి నచో దేవత యావరముల నొసంగును. కర్మము ననుసరించి వాఁడాఫలముల నొందఁగూడదేని యేదో యొకనెపమున నీయకపోవును. పట్టుపట్టినచో బుద్ధివైకల్యము నతని కాపాదించును. ఉపాసకుఁ డభీష్టదేవత నారాధించునపు డాదేవతయే పరమేశ్వరునిగా భావింపవలయును. ఏలన భగవంతునకు రూప మిది యనిలేదు. ఏరూపమున నెవఁ డారాధించునో యతని యారాధనము శాస్త్రసమ్మతమగునేని సాత్త్వికమగునేని యా రూపమున సాక్షాత్కరించును.

"యేఽప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయాఽన్వితాః,
తేఽపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్."

(గీత ౯ అ. ౨౩ శ్లో)

"అవిధిః అజ్ఞానం తత్పూర్వకమ్" అని భాష్యము.

"అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ,
న తు మామభిజానంతి తత్త్వేనాతశ్చ్యవంతి తే." (౯ అ. ౨౪)

అని శ్రీకృష్ణపరబ్రహ్మము తెలిపెను. దీనిసారమేమనఁగా శ్రద్ధ గలిగి (ఆస్తికబుద్ధిగలిగి) ఎవ రితరదేవతల నారాధింతురో వారును శాస్త్రవిహీనమార్గమున నన్నే యారాధించుచున్నారు. ఎట్లు? ఇంద్రు నారాధించువాఁడు శ్రద్ధగలిగి దిక్పాలకులలో

నొకఁడని. శచీనాథుఁడని భావించి యుపాసించిన నతనికి నుపాసనము తెలియదని భావము. ఇంద్రునియందు భగవదంశము న్నను భక్తునిబుద్ధి భేదముగలదిగాన నది విధికాదు. ఇంద్ర రూపమున నున్నపరాత్పరుని శచీరూపమును దాల్చినప్రకృతింగూడిన సగుణబ్రహ్మముగా ధ్యానించిన నది విధివంతమగు నారాధనమని హరియే తెల్పెను. ఈవిషయము దృఢపఱచుటకే రెండవశ్లోకమునందు, "తత్త్వేనాతశ్చ్యవంతి తే" అని బోధించెను. అవిధిగా నన్నారాధించువారు నన్నెఱుంగరుగానఁ దత్త్వమునుండి జాఱిపోవుదురు. సర్వరూపుఁడననినన్నెఱుంగక యారాధించినవారలొట నాతత్త్వము నెఱుంగఁజాలరని శ్రీకృష్ణుని యుపదేశసారము. ఈవిషయముననే పెక్కండ్రు ప్రమాదం పడుదురు. కోరిక లొక్కొక్కదైవమొక్కొక్కదానిని బ్రధానముగా నొసంగును. సూర్యునారాధించిన నారోగ్యముకలుగును. "ఆరోగ్యంభాస్కరాదిచ్ఛేత్" అని. కానిసూర్యమూర్తియితరవాంఛలనొసంగఁజాలఁడనికాదు. ముక్తినిగోరువారు సూర్యభగవంతునినారాధించునపుడు తేజోరూపముననున్న పరమేశ్వరునిగా నారాధింపవలయును. అట్లుగాక యింద్రునకు సహాయభూతులగు ద్వాదశాదిత్యులలో నొక్కఁడని భావించి యుపాసించిన నామూర్తినుండి ముక్తిని బడయరాదు. ఏల? భావన శాస్త్రీయముకాదు. అందులకె "యజంత్యవిధిపూర్వక" మ్మనియాశ్రీకృష్ణమూర్తి తెల్పెను. ఇట్లే యెల్లదేవతల నుపాసింపవలయునని యెఱుంగందగు.

తపశ్చర్యవలన దేహసుఖాభిలాషము తొలఁగును. అది తొలఁగినఁగాని పరమాత్మను ధ్యానింప యోగ్యత కలుగదు. కాయమును శోషింపఁజేయకయే యావాంఛ తొలఁ

గదు. కొందఱు సుఖము ననుభవించినఁగాని యది తొలఁగ దందురు. అది మెట్టవేదాంతులమాట. అనుభవించుచున్న కొలఁది నది హెచ్చును. విషయసుఖవిముఖుఁడు కావలయును గాని సమ్ముఖుఁడు కారాదు. అది స్వక్షయహేతు వగును. శ్రీశంకరభగవత్పాదులు

"నారీస్తనభరనాభీదేశం దృష్ట్వా మా గా మోహావేశమ్,
ఏతన్మాంసవసాదివికారం మనసి విచింతయ వారంవారమ్."

అని బోధించిరి. ఈశ్లోకమున ముఖ్యభాగము నాల్గవపాదము. మోహజనకమగు నారీరూపమునఁ గలభాగమును బలుమాఱులు మనస్సునఁ దలంచుచుండవలయును. ఈమాటయే ముఖ్యము. అట్లు తలంచుచున్న నాసుఖమునందు విముఖత్వము కలుగును. దుర్విషయములఁ గలచెడుగును స్మరించుచుండిన నది త్యాజ్యమే యని మది నాటును. అప్పుడు తనంతన విషయసుఖాభిలాషము నశించును. ఇదియే గొప్పలాభము. వీనికిఁ దపస్సు ప్రధానము. తపస్సుత్తమము కావలయునన్న యోగాభ్యాసము కావలయును. దానఁగాని మనస్సు చాంచల్యమును వీడఁజాలదు. కావునఁ దపశ్చరణ ముత్తమోత్తమమని సారము. భగవదారాధనమున నిది యొకభాగము.

## వ్రతములు.

వ్రతముకూడ భగవదుపాసనాంతర్భూతమే. శబ్దకల్పద్రుమమునందు. "వ్రతమ్=పుణ్యజనకోపాసనాది." అని యున్నది. నియమమనునర్థముకూడఁ గలదు. సంయమ మనునర్థముకూడఁ గలదు. ఇది మొదలుకొని యింతదనుక నీరీతి నీభగవదారాధనము చేయుదునని సంకల్పించి యట్లునెఱవేర్చుటయే వ్రతమనంబడు.

దీనికే దీక్ష యనునామాంతరము కలదు. విధిపూర్వకముగా ననఁగా స్మృతిసమ్మతముగా నాచరించుదానికే యీనియమము చెల్లును. ఆమధ్యకాలమునం దాశౌచము వానిని బాధింపదు. కొంద అది యజ్ఞదీక్షకే చెల్లునందురు. వారు దేవానాంప్రియులు. వివాహదీక్షకుంగూడ నీనియమము కలదు. భగవదారాధనదీక్షయం దది చెల్లదనుట కేవలాజ్ఞానపరిణామమున నే యనవలసియున్నది. వ్రతము లనేకములు కల్పింపఁబడినవి.

"వ్రతమ్. నియమాభిధానమ్. సమ్యక్సంకల్పజనితానుష్ఠేయ క్రియావిశేషరూపమ్," హేమాద్రి వ్రతఖండమున నిట్లు సిద్ధాంతము చేయఁబడినది. వ్రతరూపమగు భగవదారాధనము ఫలాభిసంధిరహితముగనే యుండవలయును. అట్లుకానిచో నది కామ్యమై యల్పఫలదాయక మగును. అంతియగాక పునర్జనన హేతువుకూడ నగును. కావున, వ్రతరూపమున భగవంతు నుపాసించువారు స్వాభీష్టమూర్తిని సర్వవ్యాపకునిగా భావించి తత్పరమకరుణనుగోరి విధివిహితముగా నారాధింపవలయును. కొందఱు భక్తి యుండినఁ జాలును. శాస్త్రవిధు లేల యందురు. అది మిగులఁ బొరపాటు. గీతోపనిషత్తునందు

"యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిం. ౨౩
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శా. విధానోక్తం కర్మ కర్తుమిహార్హసి." ౨౪
(౧౬. అధ్యా.)

అని శ్రీకృష్ణమూర్తి యర్జునునకు దైవాసురసంపద్విభాగయోగమున నుపదేశించెను. మానవబుద్ధిని బక్కనిత్రోవను

ద్రిష్టుటకే త్రికాలజ్ఞులగు మహాత్ములు నియమముల నేర్పఱచిరి. ఆహారములవలనఁగూడ సత్త్వరజస్తమస్సులు వృద్ధినొందునని శ్రీపరమాత్మయే తెలిపెను.

"ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః,
యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేదమిమం శృణు. ౭
ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః,
రస్యాస్స్నిగ్ధాస్స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః. ౮
కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః,
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః. ౯
యాతయామం గతరసం పూతిపర్యుషితం చ యత్,
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియం. ౧౦
తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపః క్రియాః,
దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః." ౧౦

(౧౭ అధ్యా.)

దీనింబట్టిచూడఁగాఁ దాఁజేయుచున్న కర్మముగాక భక్షించుచున్న యాహారముకూడ సత్త్వగుణము వృద్ధిచేయునది కావలయుననియు నాయాహార మిట్టిదనియు నీఫలము నాకుం గలుగవలయునని కోరక యజ్ఞదానతపఃక్రియల నాచరింపఁదగుననియు నవి భగవంతునకుఁ బ్రీతిని గల్పింపఁజాలుననియు నపుడాపరమేశ్వరుఁడు "తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహ" మ్మని చేసినప్రతిజ్ఞను నిర్వహించుననియుఁ దేలెడిని. కావున వ్రతరూపముగను భగవంతు నారాధింపవచ్చును. ఆవ్రతముకూడ సమాహితచిత్తుఁడయియే చేయవలయును. సమాహితచిత్త్వము యోగము నభ్యసించినఁగాని గలుగదను

సిద్ధాంతమును గ్రహింపవలయును. అదిలేక చేసినతపోవ్రత యజ్ఞాదు లత్యల్పఫలము నీఁజాలు ననుట సత్యము. వ్రతరూప మున భగవంతు నారాధించినఁ గలుగులాభ మేమన నింతకష్ట పడి చేసినందులకు ఫలము లేదే యన్న పరితాపము తొలంగును. పరితాపశమనమే యిందులకు గొప్పఫలము.

## దానములు.

దానముకూడ భగవదారాధనపద్ధతులలో నొక్కటి యగు. "దానమ్. స్వస్వత్వత్యాగానుకూలవ్యాపారః. గోహిరణ్యాదీనాం స్వకీయానాం మూల్యగ్రహణం వినా శాస్త్రోక్త వర్త్మనా స్వస్వత్వపరిత్యాగపరస్వత్వాపాదనత్యాగత్వ మితిదానకార్యమ్" అని లక్షణసంగ్రహమున నిర్ణయింపఁబడినది. అనఁగాఁ దనదనుభావమును వదలుకొని యితరునకు దానిని నాదనుకొనుభావమును గల్పించుకార్యము దాన మనంబడును. తనకడనున్న గోభూహిరణ్యాదులను మూల్యమును గ్రహింపక శాస్త్రనియమము ననుసరించి నాదనుభావమును వదలుకొన్నాఁడను. నాదనుభావము నీకుఁ గల్గునట్లు చేసితిని అని యిచ్చుట దానశబ్దమున కర్థమగును. శాస్త్రవిధి యేమనఁగాఁ దానెవరి కీయఁదలఁచుకొనునో యాతఁడే పరమాత్మ యని తలంచి భగవత్ప్రీతికై చేయుటయే యని యెఱుంగవలయును. సాత్త్వికరాజస తామస భేదముల నివి త్రివిధముగా నుండును. తన మేలుగోరి చేయునది సాత్త్వికమే యనంబడు. ఫలమును గోరనిదియే సాత్త్వికము. దాననే పరమేశ్వరుఁడు సంతృప్తుండగును. వేఱొండు తెఱంగునఁ గాఁడు. ఈదానమునఁ గలుగుఫల మే

మనఁగా నాశాపాశము నశించుటయే యని తెలియందగును. ఇంతకన్న భగవత్ప్రాప్తిని జేయఁజాలున దేది?

ఈవిధముగాఁ దపోవ్రతదానములు మానవుఁడు పరమ గతినొంద సాధనభూతములై యున్నవి. కావుననే మహా మునులు వాని నాచరించి యితరులకు మార్గదర్శకులైరి. ఫలాభిసంధిరహితులై సంసారార్ణవమును దరించియు మహాత్ము లెట్టు లితరులను దరింపఁజేయుకోరికమై

"తీర్ణాస్స్వయం భీమమహార్ణవం జనా న హేతునాన్యానపి తారయంతః.
అయం స్వభావస్స్వత ఏవ యత్పరశ్రమాపనోద ప్రవణం మహాత్మనామ్
సుధాంశురేవస్స్వయమర్కకర్కశప్రభాభితప్తామవతి క్షితిం కిల."

అను ప్రమాణము ననుసరించి శాస్త్రోక్తములగు తపోవ్రతదానముల నాచరించుచు లోకులను జేయఁ బ్రోత్సహించుచున్నారు. ఫలాభిసంధిఁగోరి చేసినచో నవి విధివిహితములుగ నున్నను ఫలములనీఁజాలవు. కాఁబట్టి భగవదనుగ్రహపాత్రులు కాఁదగు వారు నిష్కామకర్మముల నాచరింపవలయును. ఇట్టిమార్గము లనేకములు గలవు. వానినెల్ల నిట గ్రంథవిస్తరభీతిచే వ్రాయ మానితిని.

ఇది భగవద్విశ్వాసమను రెండవసోపానము.

# భగవద్భక్తి.

మున్ను తెలుపఁబడినవిషయములకంటె నిది భేదమని భావింపరాదు. ఇదియుఁ దదంతర్భూతమే. భక్తిగలిగియే భగవంతుని బూర్వోక్తమార్గములలో దేని నే నవలంబించి ధ్యానింపవలయునని భావము. భక్తి యనఁగా నెట్టిదియో యించుక విచారింతును.

"భక్తిః = ఆరాధ్యత్వేన జ్ఞానమ్. ఆరాధ్యవిషయక రాగత్త్వం భక్తిత్వమ్." అని శాండిల్యసూత్రభాష్యమునఁ బ్రతిపాదింపఁబడినది.

భక్తి యనఁగా సేవ యని మేదినీకోశము తెల్పుచున్నది.

అనురాగవిశేషము, పూజ్యులయం దనురాగము భక్తి యని యుపదేశము.

"ఈశ్వరే పరమానురక్తిః. అథాతో భక్తిజిజ్ఞాసా సాపరానురక్తిరీశ్వరే. ఇతి శాండిల్యసూత్రమ్. ఉపాసనా. పరమేశ్వరవిషయే పరమప్రేమ. ఉపాస్యాకారాకారితచిత్తవృత్త్యావృత్తిరూపా పరిపక్వనిధిధ్యాసనాఖ్యా శ్రవణమననాభ్యాసఫలభూతా అనుర కి.

న హీష్టదేవాత్పరమస్తి కించిత్ ఇతి.

బుద్ధిపూర్వికా చిత్తవృత్తిః సా చ పరమప్రీత్యధీనా.

"నాథ! యోనిసహస్రేషు యేషు యేషు వ్రజామ్యహాం,

తేషు తేష్వచ్యుతా భక్తిరచ్యుతాస్తు సదా త్వయి. ౧౮

యా ప్రీతిరవివేకానాం విషయేష్వనపాయినీ,
త్వామనుస్మరతస్సా మే హృదయాన్మాపసర్పతు." ౧౯

విష్ణుపురాణే. ౧ అం. ౨ అధ్యా.

"హే అచ్యుత! త్వయి మే అచ్యుతా ఏకాంతికీ భ క్తిరస్తు. ఏకాంతభ క్తిః పరమప్రీత్యధీనేతి తాం ప్రీతిం ప్రార్థయతే. యేతి. యాదృశీ ప్రీతిర్విషయేషు ఆసక్తానాం సా తాదృశీ ప్రీతి ర్మే హృదయాత్ మాపసర్పతు మాపయాతు. హృదయే సదా తిష్ఠత్విత్యర్థః." అని శ్రీధరస్వామివ్యాఖ్య.

భ క్తివివరణము గరుడపురాణమునఁ గలదు.

"భజ ఇత్యేష వై ధాతుస్సేవాయాం పరికీ ర్తితః,
తస్మాత్సేవా బుధైః ప్రోక్తా భ క్తిస్సాధనభూయసీ." ౨

3౧ అధ్యా.

"అథ శ్రీమద్భ క్తిలక్షణం తృతీయస్కంధే శ్రీకాపిలేయే శ్రీభాగవతే
దేవానాం గుణలింగానామానుశ్రవికకర్మణాం,
సత్వ ఏవైకమనసో వృత్తిస్స్వాభావికీ తు యా. 3౨
అనిమిత్తా భాగవతీ భ క్తిస్సిద్ధేర్గరీయసీ,
జరయత్యాశు యా కోశం నిగీర్ణమనలో యథా." 33

౨౫ అధ్యా.

"అథ విశేషలక్షణాని. శ్రీగౌతమీయతంత్రే"
దేవతాయాశ్చ మంత్రే చ తథా మంత్రప్రదే గురౌ,
భ క్తిరష్టవిధా యస్య తస్య కృష్ణః ప్రసీదతి.
తద్భ క్తజనవాత్సల్యం పూజాయాం చానుమోదనమ్,
సుమనా అర్చయేన్నిత్యం తదర్థే దంభవర్జనమ్.
తత్కథాశ్రవణే రాగ స్తదర్థే చాంగవిక్రియా,

తదనుస్మరణం నిత్యం యస్తన్నామ్నోపజీవతి.
భక్తిరష్టవిధా హ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేఽపి వర్తతే,
స మునిస్సత్యవాదీ చ కీర్తిమాన్ స భవేన్నరః."

శ్రీభాగవతమున సప్తమస్కంధమునందుఁ బ్రహ్లాదవచనము.

"శ్రవణం కీర్తనం విష్ణోస్స్మరణం పాదసేవనం,
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్.
ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చేన్నవలక్షణా,
క్రియతే భగవత్యద్ధా తన్మన్యేఽధీతముత్తమమ్."

ఇట్లు వివిధపురాణతంత్రప్రముఖప్రమాణములయందు భక్తిలక్షణము చెప్పఁబడినది.

భగవంతునియందు నిరతిశయానురాగము భక్తి యనునదియే యిటఁగలసారము. అది యెనిమిదివిధములనియుఁ దొమ్మిదివిధములనియుఁ బదాఱువిధములనియుఁ జెప్పఁబడినది. అధికారిభేదమున నీవిభాగము న్యాయమే యని తోఁచెడిని. భగవంతునియందన్నింటికంటె నధికప్రేమము గలిగియుండుటయే యని భక్తిశబ్దమున కర్థము చెప్పినచో బాగుండును. ప్రేమింపఁదగినవస్తువులలో నుత్కృష్టము భగవచ్చరణారవిందద్వయ మనుట సర్వసమ్మతవిషయము. మ్లేచ్ఛులకుంగూడ నీభక్తిమార్గ మనుష్ఠేయమని చెప్పఁబడియెఁగదా. భగవన్నామానుకీర్తనము, తత్కథాశ్రవణాదు లెవ్వరికైనఁ జేయు నధికారము గలదు. ఇది తొలిసోపానమని మున్నే చెప్పితిని. ఇది మానసికము కావలయును. అదియే యుత్తమమని మానసికపూజ యనంబడునని వ్రాసితినిగదా. దాని కెల్ల రధికారులు గారు. అట్టి యోగాభ్యాసము కావలయును. యోగా

భ్యాసముకూడఁ గులభేదములకు లోఁబడదు. కాని తొలు దొలుతఁ బ్రాక్కర్మబలముమాత్రము కలిగినఁగాని దానియం దాసక్తిపొడమదు. బాహ్యపూజావిషయముననే వేదపఠనాధి కారముగలవా రెవ్వరను విచారమువచ్చును. భగవంతుని సేవిం చుటకు నేనే యధికారి నని చెప్పువాఁ డున్మత్తుఁ డనంబడును. ప్రక్రియాభేదము కలదు కాని భక్తిభేదము కానరాదు. తొలుత భక్తులలక్షణము లెవ్వి? అని విచారింపవలయును.

"జ్ఞానయోగేన మాం తస్మాద్యజేత పరమేశ్వరమ్,
అథ వా భక్తియోగేన వైరాగ్యేణ పరేణ తు. ౨౩
చేతసా బోధయుక్తేన పూజయేన్మాం సదా శుచిః,
సర్వకర్మాణి సంత్యజ్య భిక్షుర్నిష్పరిగ్రహః. ౨౪
ప్రాప్నోతి మమ సాయుజ్యం గుహ్యమేతన్మయోదితమ్,
అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ. ౨౫
నిర్మమో నిరహంకారో యో మద్భక్తస్స మే ప్రియః,
సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః. ౨౬
మయ్యర్పితమనోబుద్ధిర్యోగీ భక్తస్స మే ప్రియః,
యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః. ౨౭
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్సహి మే ప్రియః,
అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః. ౨౮
సర్వారంభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః,
తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్. ౨౯
అనికేతస్స్థిరమతిర్మద్భక్తో మాముపైష్యతి."

(కూర్మపురాణము ఉత్తరభాగము. ౧౧ అ.

(తఱచుగా నీశ్లోకములే గీతాశాస్త్రమునఁ గలవు.)

"వ్రతకర్మగుణజ్ఞానభోగజన్మాదిమత్స్వపి

శైవేష్వపి చ కృష్ణస్య భక్తాస్సంతి తథా తదా." (లింగపురాణము.)

## భ క్తభేదములు.

### ఉ త్తమభక్తులు.

"జ్ఞాత్వా జ్ఞాత్వాథ యే వై మాం యావాన్ యశ్చాస్మి యాదృశః,
భజంత్యనేన భావేన తే మే భ క్తతమా మతాః.

### మధ్యమభ క్తులు.

ఈశ్వరే తదధీనేషు బాలిశేషు ద్విషత్సు చ,
ప్రేమ మైత్రీ కృపోపేక్షా యః కరోతి స మధ్యమః.

### ప్రాకృతభక్తులు.

అర్చాయామేవ హరయే పూజాం యశ్శ్రద్ధయేహతే,
న తద్భక్తేషు చాన్యేషు స భ క్తః ప్రాకృతః స్మృతః."
(శ్రీ భాగవతము శ్రీ హరిభ క్తివిలాసము.)

ఇట్లు వ్రాయఁబూనిన నెంతయో గ్రంథమగును. దిఙ్మాత్ర మిట వ్రాసితిని. సర్వభూతదయ శాంతిలోనగుగుణములు భ క్తుని యం దుండవలయు ననియు, శత్రువునింగూడఁ బ్రేమింపవలయు ననియు, నెవరినిగాని దూషింపరా దనియు వీనిసారము.

భ క్తియు ఉపాసనము ను నీ రెండును జ్ఞానమున కం గములని కొందఱిమతము. "సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరి సమాప్యతే" అను గీతావచనమునే వా రనువదింతురు. కర్మ భ క్తి జ్ఞానములు ము క్తిసాధనములు. పూజ్యానురాగము భ క్తి యని పారాశర్యులు పల్కిరి. భగవత్కథారతి భ క్తి యని గర్గముని పలికెను. "సా కస్మైచిత్పరమా ప్రేమరూపా" అని నారదవాక్యము వినవచ్చెడిని. "సా పరానుర క్తిరీశ్వరే" అని శాండిల్యమతమని విదితమయ్యెడు. ప్రేమస్వరూప మెట్టిదనఁగా

''సమ్యఙ్మసృణితస్వాంతో మమత్వేతిశయాంకితః,
భావస్సవికసాంద్రాత్మా బుధైః ప్రేమా నిగద్యతే."

అని మధుసూదనసరస్వతి.

ఇట్లే పెక్కండ్రు పెక్కురీతుల భక్తిలక్షణములను దెలిపిరి. వాని నన్నింటిని సమరసము చేయుట నాపనిగాదు.

భగవంతునియందు నిరతిశయానన్యప్రీతియే భక్తి యనంబడును. ఈవిషయమున భగవద్గీతోపనిషత్తునందు భక్తి యోగమున శ్రీకృష్ణపరబ్రహ్మభావ మేమని యించుక పరికింతము.

"మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతాస్తేమే యుక్తతమా మతాః. ౨
యే త్వక్షరమనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్రగమచింత్యం చ కూటస్థమచలం ధ్రువమ్." 3

౧౨ అధ్యా.

అని భగవదుపదేశముగఁ గన్పట్టెడిని. నాశరహితునిగా నిట్టివాఁడని నిర్దేశింపఁదగనివానినిగా రూపరహితునిగా సర్వవ్యాపకునిగా మనస్సున నూహించి యిట్లుండునని నిర్ణయింపఁదరముకానివానినిగా నెవ్వరు మిగుల శ్రద్ధగలవారలై యుపాసింతురో వారు నాభక్తవర్యు లగుదురని సారము. ఇది యొక భక్తిభేదము. దీనింబట్టి మనము నిష్పక్షపాతబుద్ధి నాలోచించితిమేని సర్వదేవతాస్వరూపుఁ డొక్కఁడే యనుబుద్ధిగల్గుట ప్రధానమని తోఁపకమానదు. కాదన్న నిందుఁగల "అక్షరానిర్దేశావ్యక్తసర్వత్రగాచింత్యప్రముఖ"పదములు నిరర్థకములగు.

కుంఠమున నొక్కమూల నొకచలువరాలమండపమునఁ గూరుచున్నవాఁడనికాని, కైలాసమున నొక్కప్రాతచెట్టుక్రింద

లోకపాషాణముపై మహర్షులనడుమఁ గూరుచున్న వాఁడనికాని తలంపరాదనియు నది యల్పమతమనియుఁ బరాత్పరునిగా సర్వ నామవాచ్యునిగాఁ దలంపవలయుననియు నారాయణుఁడను పేరుమాత్రమే భగవంతునకుఁ బ్రియముకాదనియు, నేభక్తుఁ డేనామమునఁ దన్ను శ్రద్ధగలిగి స్మరించిన వానిభక్తి కాపరమ కరుణానిధి మెచ్చుననియు, పంగనామములుకాని బొగ్గునామ ముకాని బూడిదపూఁతగాని యామహనీయుని ప్రీతికిఁ గారణ ములుకావనియు నిందేవిగాని భగవంతునిచిహ్నములే కావ నియు, భక్తునినిర్మలమానసమే పరమేశ్వర ప్రీతికారణమనియు, నీరూపమునే ధ్యానింపవలయుఁగాని వేఱొకచిహ్నముగల వానిగాఁ దలంపరాదనునియమము కొందఱచేఁ గల్పితమనియు, నట్టివారికి భగవత్కరుణ యే నాఁటికిఁ గలుగదనియు సారమని గ్రహింపవలయును. ఏమతమునం దభిమానముకలవాఁ డామత ధర్మములవిడువక పూజించుట యనుచితమనరాదు. ఇతరమత ములయందుఁ గలధర్మముల నవలంబించువారలుకూడ వానిం బాటించుచు నాసర్వేశ్వరు నారాధించిన భక్తులు కాఁజాలరని మాత్రము పలుకరాదు. ఆభావముగలవారు స్వమతధర్మముల నాచరించుచున్నను వారిమనస్సు నిర్మలముకాదు కాన భగ వంతుఁడు వారిం గరుణింపఁడనుట సిద్ధాంతము.

కొందఱు దుర్విదగ్ధులు సర్వజ్ఞులంబోలి చరించుచుఁ గప టవేషధారులై పరమయోగుల తండ్రులవలె మాటలాడుచు భగవ___త్త్వమును బోధించుచు నీమతమే భగవత్సమ్మతమని వేఱొక్కమతము కాదని నొక్కిచెప్పుచు నర్థాభిలాషులై జగ ద్వంచకులై పామరులకు భక్తితత్త్వమును బోధించునట్లు నటింతురు. వారింగూర్చియే

"జటిలో ముండీ లుంఛితకేశః కాషాయాంబరబహుకృతవేషః,
పశ్యన్నపి చ న పశ్యతి మూఢో హ్యుదరనిమిత్తం బహుకృతవేషః."

అని చర్పటమంజరి బోధించెను.

ఇట్టివా రిప్పుడే కాదు. పూర్వముకూడ నున్నవారే కావుననే పెద్ద లనువదించిరి.

"అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరం,
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ." ౯

అని కృష్ణుం డుపదేశించెను.

అర్జునా! నాయందు స్థిరముగ మనస్సు నిలుపఁజాలవేని యభ్యాసయోగమున నన్నుఁ దలంపుము. ఆవల నన్నుఁ గాంతువు. ఇంతభ్యాసమనక "అభ్యాసయోగేన" అనుటచేత నొక విశేషముకలదని తలంపవలయును. అభ్యాసపూర్వకమగుయోగము. అది మనస్సమాధాన లక్షణముకలది అనునర్థముకలదని యెఱుంగవలయు. ఎవ్వారిమనస్సు భగవంతుఁడనగునాయందు స్థిరతంగాంచదో యట్టివారు తొలుతయోగము నభ్యసించి దాన మనస్సు స్థిరతంగాంచఁగా నావల నన్ను ధ్యానింపవలయు నని శ్రీకృష్ణునిభావము. అన్నింటికి యోగాభ్యాసము మూలభూతమని తేలుచున్నది. కనుకనే

"తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున." ౪౬
గీత. ౬ అధ్యా.

అని శ్రీహరి తెల్పెను. భక్తియోగమును దెల్పుచు నెల్లరకంటె భక్తయోగి శ్రేష్ఠుఁడని తెల్పెనా. ఏల తెలుపలేదు? బంధమోక్షములకు మనస్సే కారణము. అది నిర్మలము కావలయునన్న

యోగాభ్యాసమే ప్రధానము. ఎన్నిస్తోత్రములు పఠించినను మనస్సు సుస్థిరముగ భగవంతునియందు నిలువదేని యది యత్యల్పఫలదమగును. కాఁబట్టియే శ్రీకృష్ణపరమాత్మ తపస్వులకంటెను, జ్ఞానులకంటెను, కర్మఠులకంటెను యోగి శ్రేష్ఠుఁడని యుపదేశించెను. ఏప్రకరణమున నావిషయము ప్రధానమని చెప్పుట స్వభావమే యందు రేని దానింబోలెఁ దక్కినస్థలములలో వేఱొక్కదానిం జెప్పకుండుటయే పైభావమునకుఁ బరమాధారము. కావున యోగాభ్యాసమునఁగాని మనస్సుస్థిరతం గాంచదనియు నది సుస్థిరతం గాంచినఁగాని భక్తిగాని జ్ఞానముకాని ఫలింపదనియు సారము. ఇదియే భగవదభిప్రాయ మనుటకు "అభ్యాసయోగేన" అనుపద మాధారము. ఆయోగాభ్యాసముకూడ జ్ఞానపూర్వకము కావలయును. అజ్ఞానపూర్వకము కారాదు. ఈభావమును

"శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే,
ధ్యానాత్కర్మఫలత్యాగస్త్యాగాచ్ఛాంతిరనంతరమ్." ౧౨

అను నీభగవద్వాక్యమే దృఢపఱచుచున్నది. జ్ఞానముకలిగి (అనఁగాఁ దాఁజేయుకార్యమునకు సత్ఫల మిది యని యెఱింగి యనుట) అభ్యాసము చేయవలయును. దానికంటె జ్ఞానపూర్వక ధ్యాన ముత్తమము. జ్ఞానపూర్వకధ్యానమునకంటె శ్రమపడి చేసిన సత్కర్మఫలములను త్యజించు టధికము. దానికంటె నుపశమ ముత్తమము—అని భావము. ఇం దొక్కవిశేషము గ్రహింపఁదగినది కలదు. ధ్యానమునకంటెఁ గర్మఫలత్యాగ ముత్తమ మనుట యేల? ధ్యానముచేయవచ్చునుగాని యెన్నివిధములనో శ్రమంపడి చేసినసత్కర్మముల ఫలమును గోరక

యుండుట మహాకష్టము. అది కలిగినయెడల సకలశ్రేయస్సులు కలిగినట్లే. ఎన్ని వేదాంతములు బోధించినను త్యాగబుద్ధి కలుగుటరుదు. అది కలిగినచో భగవదనుగ్రహము చెంతనుండును. మఱియొక్క విశేషము కలదు. యోగముకాని భక్తికాని జ్ఞానసహితము కావలయును. మోఱకుభక్తి భగవంతుని మెప్పింపఁజాలదు. కొందఱు పామరుల వంచింపఁబూని యెన్నియోగాథలం గల్పించి మోఱకుభక్తి ముక్తి నొసంగిన దందురు. అది యేనాఁటికిని గానిమాట. ఎవ్వఁడే నట్టివాఁడు ముక్తుఁడైనయెడల నాతఁడు జ్ఞానియే యైయుండును. కాని మూర్ఖుఁడైయుండఁడు. 'జ్ఞానవిహీనస్సర్వమతేన ముక్తిం నభజతి జన్మశతేన' అన్న ప్రాచీనసూక్తి యున్నదికదా. జ్ఞానవిహీనుని మూర్ఖుఁడని తఱచుగాఁ బలుకుదురు. భగవంతుఁడు జ్ఞానస్వరూపుఁ డందురు. భగవద్విషయకజ్ఞానములేక ముక్తి దొరకుననుట పాటింపఁదగనిమాట. అది కేవలము జల్పితము. ధన మార్జింపఁగోరువారే యట్టిగాథలం గల్పింతురు. వానిని నమ్మి చెడరాదు. శాస్త్రపఠనమే జ్ఞానముకాదు. జ్ఞానధనుఁ డగుసద్గురువు శిష్యరక్షణాదృతిం గాంచువాఁడు ముక్తిమార్గముల నెఱింగించును. పూర్వకృతసుకృతము పరిపక్వమగునేని గురూపదిష్టమార్గము మనస్సున నాటి దృఢమూలమగును. కావుననే శ్రీభాగవతమున శ్రీకృష్ణమూర్తి యక్రూరునితో

తే పునంత్యురుకాలేన దర్శనాదేవ సాధవః,

అని తెలిపెను. ముక్తి యనునది సామాన్యజ్ఞానమున లభించునదియా?

"యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయం,

ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ. ౪౧
తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః,
ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత." ౪౨
గీత. ౪ అధ్యా.

ని జ్ఞానయోగమాహాత్మ్యమును శ్రీహరి యుపదేశించెను. ానము మోటుజ్ఞానమని సుజనజ్ఞానమనియు రెండుతెఱంగుల దు. అట్లు కనఁబడునని లోకజ్ఞానము. దానికే ప్రాకృతజ్ఞాన ునియుఁ బేరు. కావున ధనార్జనముకొఱకు వేషములువేసి ొనిన వంచకులమాటలకు లోఁబడక శాస్త్రజన్యజ్ఞానము. వైరాగ్యసంపదయుఁ గలిగి ధన మార్జింపఁదలంపుగొనని సద్గురు ను వెదకి కనుఁగొని తదుపదేశానుసారము ప్రవర్తింపవల యును. ఆయుపదేశము భూరిగభీరసంసారసాగరతరణోపాయ మును గనఁబఱచును.

జ్ఞానము భక్తికిని యోగమునకుఁ బ్రధానమని చెప్పఁ డియెఁగదా. భక్తి యోగముల రెండింటిలో నేది ప్రధానము? ను ప్రశ్నము వచ్చునేని

"అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ,
నిర్మమో నిరహంకారస్సమదుఃఖసుఖః క్షమీ. ౧౩
సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్తస్స మే ప్రియః." ౧౪
౧౨ అధ్యా.

ను నీగీతావాక్యములు బదులుచెప్పును. ఏమని? యోగము ధానమని. ఏల? భక్తియోగము నుపదేశించుచు భక్తుని ుణములను నిర్ణయించుచు శ్రీకృష్ణమూర్తి యీరీతి నుపదే

శించెను. భక్తునిలక్షణము లనేకము లుండవచ్చును. కాని వానియం దిందుఁ జేర్కొనఁబడినవి ప్రధానములగును.

తనకు బాధకములగు భూతములయందుఁగూడ ద్వేషము పూనరాదని యర్థము. భూతదయ ప్రధానగుణము భక్తున కని సారము. ఎల్లరకు మేలుచేయుకోర్కెయు నుండవలయునని భావము. కష్టపడువారిని గాంచినపుడు మనస్సు దయారసమునఁ గరఁగవలయును. అనఁగా సర్వభూతములకు నభయదాత కావలయు నని సారము. నాది యనుభావము లేకయుండందగును. తన కిది కలదన్న యహంకారరూప దుర్గుణము లేనివాఁడు కావలయును. సుఖదుఃఖములను సమానముగా ననుభవించువాఁడు కావలయును. నిందించినను గొట్టిన నోర్చుకొనువాఁడు కావలయును. ఎల్లతఱి సంతుష్టిగలిగి యోగము నభ్యసించుచు దాన సమాహితచిత్తము గలుగఁగా సంయత స్వభావుఁడై సుస్థిరమగు నధ్యవసాయముకలిగి భగవంతుని యందు మనోబుద్ధులను సమర్పింపవలయును. సంకల్పవికల్పాత్మకము మనస్సని, అధ్యవసాయలక్షణ బుద్ధియని పెద్దలయభిప్రాయము. ఇట్టి లక్షణములు కృత్యము లెవ్వనికిం గలవో వాఁడు భగవద్భక్తుఁడనియు, నాతఁడే భగవత్ప్రియుండనియు సారము. ఇందు "యతాత్మాదృఢనిశ్చయః" అను నీ రెండును యోగప్రధానములు. యోగాభ్యాసము లేకయున్న నివి రెండు నెవరికింగాని కుదురునవి కావు. అవి కుదిరినఁగాని భక్తుఁడుకాఁడు. కావున భక్తునకు యోగాభ్యాసము ప్రధానమని భగవంతునితాత్పర్యమని మనము నిర్ణయింపవలయును.

కొందఱు భక్తియున్నం జాలును. యోగ మభ్యసింప నక్కఱలేదు. వంగివంగి వందనము లర్పించినఁ జాలును. భ

ంతుఁడు కరుణించు నందురు. వారలను మించినవంచకులు నవలసియుండును. ఏల? భగవద్వాక్యమే వారికిఁ బ్రమా ముకాదు. రిక్తమాటలచే భగవత్కరుణ కలుగదు. కలిగినదే న్నచో దేవాలయములలో నిచ్చుప్రసాదమే యాకుక్షిం రులకు భగవత్కరుణ యగును. మనస్సు పరమాత్మయందుఁ మప్రేమాన్వితము కావలయునన్న యోగియై తన్మూలమున ంచలమనస్సుకలిగి భగవంతు నారాధింపవలయునే కాని వెలుమార్గమునఁ గాదు. ఇది శ్రీకృష్ణమూర్తి సిద్ధాంతము కాని శ్లోకరిదికాదు. ఈవిషయమునే మరల మరల గీతాశాస్త్రమున హరి తెలిపియున్నాఁడు. చూడుఁడు.

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః,
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్స చ మే ప్రియః. ౧౫
అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః,
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః. ౧౬.
యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి,
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః. ౧౭
సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః,
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః. ౧౮
తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్,
అనికేత స్థిరమతిర్భక్తిమాన్ మే ప్రియో నరః. ౧౯
యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే,
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః." ౨౦

౧౨ అధ్యా..

శ్లోకములభావమంతయుఁ బూర్వోక్తములగు పదుమూఁడవ నాల్గవశ్లోకములయందుఁ జరితాగమే. విననుశిష్యులకు పుశో

ధము కావలయునని మరల మరల శ్రీహరి యుపదేశించెను. తఱచుగానిందుఁ జేర్కొనఁబడినగుణములన్నియు మనస్స్థిరత్వమునం దాధారపడియున్నవి. అది యోగమూలము. పలుమాఱు లీభక్తిపద్ధతియందు యోగమునుగుఱించి భగవంతుఁడు ప్రస్తావించెను. కారణమేమి? భక్తుఁడు యోగి కావలయును. యోగమున జ్ఞానము లభించును. అవి రెండును భక్తుని గుదురునట్లు చేయును. అనఁగా యోగజ్ఞానములు లేనిభక్తి భుక్తి యనంబడును. అది యాత్మవంచకులకుఁ బనికివచ్చును. కాని వారికింగూడఁ దుదకు హానినే కలిగించును. అవి యెఱుంగుపాటి జ్ఞానములేక యితరులను మోసపుచ్చితిమికదా యని యుబ్బుచుందురు. గురువుల మనుకొనుచుందురు. తమకంటె మూర్ఖులగుకొందఱు శిష్యులుగానుండి తమ్ముం బొగడుచుండఁ దమగుట్టు కనుఁగొనఁ దరముకాదని యానందింతురు. సర్వజ్ఞులవలె నటింతురు. పండితులవలె నుపన్యసింతురు. యోగులవలె ముక్కుచెవులు వ్రేళ్లమూసి యోగ మిదియే యని కనఁబఱతురు. తమ్ముం గాంచి యెల్లరు యోగు లనుకొనవలయునని కోరుచుందురు. అట్టివారిం గనుంగొని మోసపోవక విధివిహితముగ యోగము నభ్యసించినవారును కరుణాళువులు నగువారికడ నభ్యసింపఁబూనవలయును. యోగియై జ్ఞానమును సంపాదించి పరమేశ్వరుని సర్వవ్యాపకునిగాఁ భావించి పరమప్రేమము నునిచి సేవింపవలయుననియే భగవంతునిభావమని మనము నిశ్చయించుకొనవలయును.

భగవంతు నారాధించువార లెట్టివారు? అని ప్రశ్నించుకొని శ్రీకృష్ణమూర్తియే

"చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ. ౧౬

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః. ౧౭
ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్,
ఆస్థితస్సహి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్. ౧౮
బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే,
వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః." ౧౯

గీత. ౭ అధ్యా.

అని జ్ఞానయోగమున నుపదేశించెను. "ఇందేకభక్తిర్విశిష్యతే" అని యున్నదికదా. "ఏకభక్తిః అన్యస్య భజనీయస్యాదర్శనాదతః సఏకభక్తిర్విశిష్యతే విశేషమాపద్యతే అతిరిచ్యతే. ఇత్యర్థః" అని భాష్యము. ఏకభక్తియగుజ్ఞాని పైనలువురలో నుత్తమోత్తముఁడని తేలెడిని. జ్ఞానిదృష్టికి సర్వము వాసుదేవమయముగనే కనఁబడును. అట్టిమహాత్మునకు నితరుఁడు సేవింపఁదగినవాఁ డుండఁడు. అనఁగా భగవత్తత్త్వముకాని దొక్కటియులేదని సారము. అట్టిభావము కలవారలకు భేదబుద్ధు లుండవు.

భక్తునికృత్యభేదములు.

యోగి యగు భక్తుఁడు భగవత్సేవచేయుమార్గము లనేకములు గలవని మున్నే చెప్పఁబడియెను. అందేవిప్రధానములని యించుక విచారింతము.

౧ భగవంతుని దివ్యచరిత్రములవినుట
౨ ఈశ్వరుని గీర్తించుట
3 విష్ణువును స్మరించుట
౪ భగవత్పాదముల సేవించుట
౫ దేవదేవుని నర్చించుట

౬. పరమాత్మకు నమస్కరించుట
౭ శ్రీహరికి దాస్యముసేయుట
౮ సఖ్యము నెఱపుట
౯ ఆత్మార్పణముచేయుట

అను నీతొమ్మిది భక్తిమార్గములు అని భాగవతమునఁ గలదు. ఇది సామాన్యనియమముగాని విశేషనియమముగాదు. పామరుల భక్తిమార్గమునఁ బ్రవర్తింపఁజేయఁగోరి యీవిధు లుపదేశించిరి. అంతియకాని విశేషవిధు లిందు లేవు. భగవద్గీతాశాస్త్రమున శ్రీకృష్ణమూర్తి యుపదేశించినమార్గములలో నొక్కటియు నిందు లేదు. పామరునకుఁ దొలుదొలుత నిట్టిసులభమార్గములనుపదేశింపకయున్న వాఁడు భక్తి నలవఱచుకొనఁజాలఁడు. సులభముగా నాచరింపఁ దగుమార్గముల నాతనికిం దెల్పి యవి యభ్యసించునట్లు చేసిన నాయలవాటున నతఁడంతకంటె నుత్కృష్టమార్గమునఁ బ్రవర్తింపఁగలఁడు. అట్లుగాక రవంతసేపు కథల విని నేను భక్తుఁడను. నాయింట వంటచేసిపెట్టి భగవంతుఁడు పోవును. అనుకొనుచుండినయెడల దానిచేఁ బరమేశ్వరుఁడానందింపఁడు. ఎప్పుడో పనిలేనియప్పుడు రెండుపాటలుపాడి నేను భక్తుఁడను. దేవుఁడు నాయింటఁ గావలి గాచువాఁడుగా నుండును అనుకొన్న చో నాభక్తుఁడు కోరినట్లు భృత్యుఁడనుగా నుందునని సర్వేశ్వరుఁడు తలంపఁడనుట నిక్కము. ఇట్టికథలు కొన్ని కలవుకాని యవియన్నియు సోమరిపోతులచేఁ గల్పింపఁబడినవి. స్థిరమనస్సుగలిగి నన్నారాధింపఁ జాలవేని యోగము నభ్యసింపుమని శ్రీకృష్ణపరమాత్మ భక్తియోగమున నుపదేశించియుండ దానికి విరుద్ధముగా నతిసులభముగా ననఁగా నెల్లరు చేయుచున్న మార్గములలో నొకటిగా నుండునట్టిపద్ధతిని

దెల్పి దీని నాచరించిన విష్ణుమూర్తి ప్రత్యక్షమై వరములిచ్చి యంతటితో మానక చంకఁబెట్టుకొని యెత్తికొనిపోయి వైకుంఠములో మొదటిద్వారముకడఁ జలువఱాతిపైఁ బడవేయునని యు, నాపాషాణము మృదువుగానుండుననియుఁ గాన నొప్పి తగులదనియుఁ గల్పించువారు సోమరిపోతులుగాక మఱెవ్వరగుదురు? ఈచెప్పినమార్గములఁ దేని నవలంబించినను భక్తుఁడగు నేని

"యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే. ౬
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి నచిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్." ౭

అను నీభక్తియోగమున భగవంతుఁడు విజయున కుపదేశించిన పద్ధతి నిరర్థకమగును. భగవద్వాక్యము నిరర్థకమైనచో భక్తి వలనిఫలముకూడ నట్టిదే యగును.

కొందఱు భక్తి యన్నింటిలో సుకరమైన దందురు. వారెంతయు వెఱ్ఱివా రనవలయును. ఎందుల కనఁగాఁ దాను జేసిన సత్కర్మములఫలముల నీశ్వరార్పణముచేయుట సులభమైనదనుట యెట్టి యవివేకము? అన్నింటికంటె భక్తియుఁ జక్కనది కాదు. కష్టసాధ్యమే. యోగులవలె గుహాలలో దాఁగియుండవలసినది లేదనియు వారందురు. అది మిగులఁ బొరపాటు. గుహాలలో నుండువారు యోగులుమాత్రము కారు. భక్తులే. మహాజ్ఞానసంపన్నులే.

"ధన్యానాం గిరికందరే నివసతాం జ్యోతిః పరం ధ్యాయతా

మానందాశ్రుకణాన్ పిబంతి శకునా నిశ్శంకమంకేశయాః,
అస్మాకం తు మనోరథోపరచితప్రాసాదవాపీతట,
క్రీడాకాననకేళికౌతుకజుషా మాయుః పరం క్షీయతే."

వైరాగ్యశతకము. ౧౦౫.

అని భర్తృహరి తేటపఱచెను. అట్టిమహాత్ములకుంగాక పరమేశ్వరునను గ్రహాము దేవాలయముల నలికి ముగ్గులు పెట్టుచుండువారికిం గలుగునా? వంగివంగి దండములు పెట్టుచుండినవారికిం గలుగునా? సర్వవిధముల రక్షకుఁడు భగవంతుఁడని నమ్మి ఫలముఁ గోరక సత్కర్మముల నాచరించుచు సర్వభూతదయాళువై భగవంతునే యెల్లవస్తువులయందుఁ గనుంగొనుచు భేదబుద్ధి లేకయుండువారలకుం గలుగును. ఇతరులకు భగవత్ప్రసాద మనఁగా దధ్యోదనాదికమే. వేఱెదియు లేదు. కొందఱు.

"హయాలంభం గవాలంభం సన్న్యాసం పలపైతృకం,
దేవరాచ్చ సుతోత్పత్తిః కలౌ పంచ వివర్జయేత్."

అనువాక్యము నుదాహరించి కలియుగమున సన్న్యాసము నిషిద్ధమందురు. పాపము! వారికి స్మృతులు తెలిసియున్నట్లు తోఁపదు. తెలిసినట్లు నటించుట వంచకులస్వభావము. చక్కఁగా స్మృతులు చదివిగాని పెద్దల నడిగి తెలిసికొనిగాని యున్నచో వారిట్లు వచింపఁజాలరు. తెలియనివిషయములను దెలిసినట్లు వ్రాయరాదు. వైదికమతస్థాపకులెల్ల సన్న్యాసులే. కుత్సింభరులగు సన్న్యాసులు లేరాయన్న నట్టివారు భక్తులును గలరు. దాసులు గలరు. పండితులు గలరు. అంతమాత్రమున నాపద్ధతినే దూషింపఁదగునా? కపటాత్ములగు భక్తులను గాంచి

క్తినే దూషింపవచ్చునా? తమకుఁ దెలియనివిషయములను దెలిసినట్లు వ్రాసి పాపముతెచ్చుకొనరాదు. యోగులంబోలి గుహాలలోనే కూరుచుండ నక్కఱలేదు. గుహాలలోఁ గూరు చున్నంతన యోగికాఁడు. దేవాలయములు దర్శించినంత నే ముక్తిరాదు. వారివారి ధ్యానమున కది సంబంధించియుండును. వృథజ్ఞానమునకును ముక్తికిని సంబంధము గలదు. అంతియకాని ప్రతచ్ఛత్రము పట్టుకొని గోవిందా యన్నంతమాత్రమున దొరకుభగవత్ప్రసాదము తున్నివృత్తికి నర్హమేమైయుండును. త్కర్మములు వ్యర్థములనియు జ్ఞానము వ్యర్థము ననువా యుండరు. ఉన్నచో వారిదృష్టికి భక్తియుఁ దృణప్రాయమే యైయుండును. కావున భక్తుఁ డనఁదగువాఁడు యోగాభ్యాస మున నిశ్చలాంతఃకరణుఁడై జ్ఞానియై యుండును. తక్కుతెఱం గైన నతఁడు జగద్వంచకుఁడు. ఆత్మవంచకుఁడుకూడ నగును.

మఱియుఁ గొందఱు కర్మము జ్ఞానము యోగము మొదలగువానిలో శీఘ్రకాలమున ఫలము నిచ్చునది భక్తియే కాని తక్కినవి కావందురు. అది వారియజ్ఞానమునే తెలుపు చున్నది. జ్ఞానయోగికానివాఁడు భక్తుఁడే కాఁడు. భ జ్ఞాన యోగశూన్యము కారాదు. అది భక్తి యనంబడదు.

"సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్తస్స మే ప్రియః."

(౧౨ భక్తియోగము. ౧౪ శ్లో.)

అను శ్రీకృష్ణోపదేశము పైభావమును దెలుపుచున్నది. యోగికానివాఁడు భక్తుఁడే కాఁడు. మనోజయము గాంచని వాఁడుభగవత్కరుణకుఁ బాత్రుఁడుకాఁడు. భక్తివేఱు, జ్ఞానము

వేఱు, యోగము వేఱు. ఇందు భక్తి శ్రేష్ఠము అనుకొనువారలసులు. వారికేదియుఁ దెలియదనుకొనుట పాపము కాదు. జ్ఞానము లేనివాఁడు భక్తుఁడు కాఁడు. యోగము జ్ఞానమును గల్గించును. అందులకే శ్రీవాసుదేవుఁడు యోగియందఱకంటె నధికుఁడని తెల్పెను. అది తెలియఁజాలక కొందఱు దేవానాంప్రియులు భక్తి సుకరమందురు. భక్తియుఁ గష్టతరమార్గమే కాని సామాన్యము కాదు. భక్తుఁ డెట్టివాఁడో భక్తి యన నేదియో గీతాశాస్త్రమునఁగల భక్తియోగాధ్యాయమునైనఁ బఠింపవలయును. పెద్దల నడిగి తెలిసికొనవలయు. అంతియ కాని తోఁచినట్లు పామరుల కుపదేశించి ద్రవ్యార్జనము చేయరాదు.

కొందఱు

"అథాశ్వలాయనో భగవంతం పరిమేష్ఠినం పరిసమేత్యోవాచ. అధీహి భగవన్ బ్రహ్మవిద్యాం వరిష్ఠాం సదా సద్భిస్సేవ్యమానాం నిగూఢాం యయాఽచిరాత్సర్వపాపం వ్యపోహ్య పరాత్పరం పురుషముపైతి విద్వాన్ తస్మై సహోవాచ పితామహశ్చ శ్రద్ధాభక్తి ధ్యానయోగాదవేహి".

అను కైవల్యోపనిషత్తునఁ గలమంత్రభాగము నుదహరించి భక్తి యన్నింటికంటె నుత్తమమని చెప్పుదురు. ఇదియే చిత్రము. పై దానికిఁ బిదప

"న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః,"

అనియుఁ గలదు. ఈమంత్రార్థ మేమనఁగా నోయాశ్వలాయనమునీ! నీవు శ్రద్ధయు భక్తియు ధ్యానము యోగము నను వీనిమూలమునఁ దెలిసికొనుము. భగవంతుని అని యర్థము. కర్మముచేతను బుత్త్రాదులచేతను ధనముచేతను ముక్తి సిద్ధింపదు. సన్న్యాస మొక్కటి దానిచేతనే విద్వాంసులు ముక్తిని బడయఁజాలుదురు. కర్మఫలత్యాగమే సన్న్యాసమని

ర్థము. ఇచ్చట శ్రద్ధచే భక్తికల్గుననియు భక్తిచే ధ్యానము
యు నవకాశముకలుగుననియు, ధ్యానముచేత యోగము
ంచుననియు విశేషార్థమెఱుంగునది. శ్రద్ధాభక్తిధ్యానముల
-టె యోగము చిత్తవృత్తి నిరోధకంబగుట దానినే సాధింప
లయునని సారము. ఈవిషయమును పాతంజలయోగ
-ాత్రము దృఢపఱచును. దీనితర్వాతిమంత్రము

"పరేణ నాకం నిహితం గుహాయాం బిభ్రాజదేతద్యతయో విశంతి,
వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థాస్సన్న్యాసయోగాద్యతయశ్శుద్ధసత్త్వాః"

ని యున్నది. ఈమంత్రములనుబట్టి యాలోచింపఁగా భక్తి
ంటె ధ్యానము, దానికంటె యోగము నుత్కృష్టములని
లుచున్నదియేకాని భక్తి యన్నింటికంటె నుత్కృష్టమని
కానరాదు. కైవల్యోపనిషత్తునందుఁగల యీమంత్రమును
ప్రమాణముగా నుదాహరించువారు శివునికన్న విష్ణు వెక్కువ
యని చెప్పరాదు. అందే

హృత్పుండరీకం విరజం విశుద్ధంవిచింత్యమధ్యే విశదం విశోకమ్,
అచింత్యమవ్యక్తమనంతరూపం శివం ప్రశాంతమమృతం బ్రహ్మయోనిం,
తథాదిమధ్యాంతవిహీనమేకం విభుం చిదానందమరూపమద్భుతమ్,
ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలకంఠం ప్రశాంతం
ధ్యాత్వా మునిర్గచ్ఛతి భూతయోనిం సమస్తసాక్షిం తమసః పరస్తాత్".

ని యున్నది. ఇందుఁ బార్వతీపతియే భగవంతుఁడని స్పష్ట
గుచున్నది. దీనిని వీరవైష్ణవు లంగీకరింపరు. కాని తమకుఁ
వలసినపుడు మంత్రము నుదాహరింతురు. వారి మొండిపట్టు
లనుగూర్చి మనము చింతింపవలయును. ఇట్లసంగతముగా
ంత్రములను జూపి భక్తి యుత్కృష్ట మనరాదు. భక్తి

లేకున్న జ్ఞానము, జ్ఞానములేకయున్న భ క్తి పనికిరావని యెఱుంగవలయును. యోగము మనస్సును బరిశుద్ధముచేయు నదిగాన నది ప్రధానమే. ఇవన్నియు నుండినంగాని భక్తుఁడు కాని యోగికాని జ్ఞానికాని కానేరఁడని తెలిసికొనుటయే యుత్తమము.

శ్రీశంకరాచార్యులుగారు "భజ గోవిందం భజ గోవిందం భజగోవిందమ్మూఢమతే," అనిబోధించిరి. మఱియునాపత్సమయమున "ల క్ష్మీనృసింహ మమ దేహి కరావలంబమ్" అని ప్రార్థించిరి. కావున వారికి హరియందే భక్తికలదని కొందఱు పలుకుదురు. శ్రీమచ్ఛంకరాచార్యులుగారి దృష్టియందీహరిహరులకు భేదమే కానరాదు. వీరిరువురు బ్రహ్మయుఁ బ్రకృతిపుత్త్రులని వారి భావము.గోవిందాదినామములు భగవత్పరములుగాని కొందఱు దేవానాంప్రియులనుకొనునట్లు వైకుంఠవాసియై త్రిమూర్తులలో నొక్కఁడని లెక్కింపఁబడు విష్ణుపరములుగావు. శివునకు నీపేరులు చెల్లును. శివప్రముఖనామములు పరమాత్మయగు విష్ణువునకుం జెల్లును. శ్రీశంకరాచార్యమతము ననుసరించి శివునికంటె విష్ణు వధికుఁడని వచింప నెవరికిని శక్యముకాదు. శిష్యుని యోగ్యతానుసారము గురువుపదేశించును. ఆయుపదేశమునుబట్టి యాగురువున కింతమాత్రమే తెలియును. మిక్కిలి తెలియదని భావించుట పొరపాటు. మఱియు జ్ఞానసహితమైనభక్తియే శంకరాభిమతముకాని యది వేఱనికాదు. కావున వారిమతమును గ్రహించి దీనింబట్టిచూచినను భక్తి యుత్తమమని యితరులకుఁ దెల్పుటనుచితము. ఇంతట నీ విషయమును వదలి మఱికొందఱుమతమున భక్తి యెట్టిదో పరికింతము.

"భక్తిప్రియా భావ్యమ్. భక్తిర్ద్వివిధా. ముఖ్యా గౌణీ చేతి. తత్రే
శ్వరవిషయకోఽనురాగాఖ్యచిత్తవృత్తివిశేషో ముఖ్యభక్తిః. తథా చ భక్తిమీ
మాంసాసూత్రమ్. సాపరానురక్తిరీశ్వరఇతి. అథాతో భక్తిజిజ్ఞాసేతి సూత్రో
పాత్తా భక్తిస్తత్పదార్థః. తస్యాః పరేతి విశేషణమ్. పరం ముఖ్యం భక్తి
విశేషముద్దిశ్యానురక్తిర్లక్షణత్వేన విధీయత ఇతి తదర్థః. అతఏవ పరేతి గౌణీం
వ్యావర్తయతీతి భాష్యం, గౌణ్యా తు సమాధిసిద్ధిరితి సూత్రే గౌణీ భక్తి
స్సేవారూపా కథితా. తథాచ గరుడపురాణే. భజ ఇత్యేష వై ధాతుస్సే
వాయాం పరికీర్తితః, తస్మాత్సేవా బుధైః ప్రోక్తా భక్తిస్సాధనభూయసీతి.
తద్భేదాః స్మరణకీర్తనాదయో బహవః. తేన. శ్లో. భక్తిరష్టవిధా హ్యేషా
యస్మిన్ మ్లేచ్ఛేఽపి వర్తతే, స విప్రేంద్రో యతిశ్శ్రీమాన్ స మునిస్స చ
పండితః. ఇత్యాదిత్యగరుడపురాణయోర్వచనమ్. భక్తిర్నవవిధా రాజన్ని
త్యాదిభాగవతవచనమ్, భక్తిర్దశవిధా జ్ఞేయా పాపారణ్యదవోపమేతి. దశ
విధత్వప్రతిపాదకం బృహన్నారదీయవచనమన్యచ్చైతాదృశమపయుక్త్యా
అనువాద ఏవ. ఈదృశో భక్తిపదార్థః. ప్రియో యస్యాస్సా తథాచ శివపు
రాణే. శ్లో. కృతకృత్యస్య తృప్తస్య మమ కిం క్రియతే నరైః, బహిర్వా
ప్యంతరేవాపి మయాభావో హి గృహ్యతఇతి. అత్ర భావశబ్దేనబాహ్యాసేవా
రూపాచేష్టాభ్యంతరో ఽభిప్రాయశ్చ గృహ్యతే." అని భాస్కరరాయలు.

"భక్తిగమ్యా—భక్త్యాసంరాధనేన గమ్యా ప్రత్యక్షా. తథాచ శ్రుతిః.
పరాం చఖాని వ్యతృణత్స్వయంభూతస్తస్మాత్పరాఙ్ పశ్యతి నాంతరాత్మన్
కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షదావృత్తచక్షురమృతత్వమిచ్ఛన్. ఇతి స్మృతి
రపి. యోగినస్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమితి. ఈశ్వరప్రణిధా
నాద్వేతి యోగసూత్రేప్యేవం. ప్రణిధానపదస్య భక్తిపరతయా రాజమా
ర్తండే వ్యాఖ్యానాత్. బ్రహ్మసూత్రమపి అపిసంరాధనే ప్రత్యక్షానుమానా
భ్యామితి. అవ్యక్తమపి బ్రహ్మభక్త్యా ప్రత్యక్షం భవతి. శ్రుతిస్మృతిభ్యాం
భావగమనాదితి తదర్థః. శ్లో. భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధో

ఽర్జున, జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతపేతి భగవద్వచన
మపి. అత్ర ప్రవేష్టుమిత్యనేన బ్రహ్మభావనాఖ్యో మోక్షఉచ్యతే. సోఽపి
భక్త్యైవ లభ్యత ఇత్యర్థః. తేన ప్రకృతే గమ్యపదం ప్రాప్యపరత్వేనాపి
వ్యాఖ్యేయం. బ్రహ్మసంస్థోఽమృతత్వమేతీతి శ్రుతౌనిష్ఠా పర్యాయభక్తివాచి
సంస్థాపదేన తథా ప్రతిపాదనాత్. అతఏవ భక్తిమీమాంసాయాం. తత్సంస్థ
స్యామృతత్వోపదేశాదితిసూత్రమ్. బ్రహ్మమీమాంసాయాం. తన్నిష్ఠస్య మో
క్షోపదేశాదితి సూత్రమ్. నిత్యాతంత్రేఽపి. భక్తిలక్షణకథనపూర్వకం తస్యా
ఖిలపురుషార్థప్రదత్వముక్తమ్. శ్లో. ఉక్తలక్షణసంపన్నే గురౌ తత్ప్రోక్తయో
స్తథా, విద్యానుష్ఠానయోః స్థైర్యం ధియస్సంశయనాశనం. తారకత్వాత్ప్రమ
త్తత్వే భక్తిరుక్తాఖిలార్థదా, యయా వినా నియతమిహాముత్ర చ దుఃఖి
తా. ఇతి. అథవా భక్తిః లక్షణా తయా గమ్యా బోధ్యా. విశిష్టశక్తికానాం
సత్యజ్ఞానాదిపదానాం నిర్ధర్మకత్వబ్రహ్మవాచకత్వాయోగాత్."

భాస్కరరాయలు.

ఈ భాష్యకర్త యభిప్రాయము ననుసరించి పరికించిన ముఖ్యభక్తి యని గౌణభక్తియని రెండువిధములనియు నందు భగవద్విషయకానురాగాఖ్యచిత్తవృత్తివిశేషము ముఖ్యభక్తి యనియు, సేవాదిరూపము గౌణభక్తియనియు స్పష్టమయ్యెడి. దేవాలయముల నాశ్రయించుట యిందు చేనను జేరదు. అ య్యవి కేవలపామరులకుఁగాఁ గల్పింపఁబడినవని మున్నె తెలిపి తినిగదా. కేవలాజ్ఞులు వేశ్యానృత్తములంజూడఁగోరియో, ఉత్స వమును జూడఁగోరియో, కామినీసందర్శనార్థమో, వస్తువులను గొనఁగోరియో, భోజనార్థమో, బంధుసమాగమము నాకాం క్షించియో వత్తురు. అందుఁ గొందఱు దేవతాభక్తిగలవా రుండకపోరు. వారిసంఖ్య యత్యల్పముగ నుండును. వారు కూడ నుత్సవవైభవదర్శనాభిలాషులేకాని "సర్వత్రగమచిం

త్యంచ" అని శ్రీకృష్ణమూర్తి యుపదేశించినట్లు భగవంతునారాధించువారు కారు. రథోత్సవమునాఁడు రథముపైనున్న యాలోహవిగ్రహమును జూచి యనఁగాఁ బూలహారములలో మునిఁగియుండి యాకారము తెలియరాకయున్నదాని నిట నుండుఁగదా యని యూహించి గోవిందా యని యరచి నంతనే

"రథస్థం కేశవం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే."

యను శ్లోకార్థమురీతి ముక్తిదొరకుచో నాముక్తి యే దుకాణమునందైన రొక్కమునకు దొరకునదే యగును. ఇట్టి శ్లోకములు నిరర్థకము లనరాదు. కాని యవి పామరులకు భగవంతునియందు భక్తికలుగఁజేయ వ్రాయఁబడినవేకాని ముక్తి మాత్ర మంతసులభముగా దొరకునది కాదు.

"ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః,
అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్." ౪౫

౬ అధ్యాయము.

అని గీతాశాస్త్రమున శ్రీకృష్ణమూర్తియే యుపదేశించెను. విలాసార్థముగనో మఱెందులకో పోయి దారురథముపైనున్న తామ్రప్రతిమను జూచినంతనే ముక్తి దొరకుననుశ్లోకము పెద్దలచే నెందులకుఁ జెప్పఁబడియెనో యించుక యోజించినఁ దెలియఁగలదు. వ్యర్థమాయన్నఁ గాదనవలయు. మఱెందులకనినఁ బామరులకు గంపంతయాశను గల్పించినఁగాని దైవమునకు మ్రొక్కఁడనియే. అట్టి ఫలస్తుతులం గాంచి ధీరులు మోసపోవరు. కావుననే "శ్రవణం కీర్తన" మ్మను భాగవత ప్రోక్త నవవిధభక్తి గౌణభక్తి యనవలయు. పైభాష్యమునను వ్రాయఁబడినది.

ఏయుపనిషత్తును బరికించినను భగవత్స్వరూపము తేజోమయమనియు భక్తులకొఱకు రూపకల్పన చేయఁబడుననియు, నెవ రేరూపము నాత్మ నిలిపి యాపరాత్పరుని ధ్యానించిన నారూపమున నామహాత్ముఁడు సాక్షాత్కరించి భక్తుని రక్షించు ననియు భక్తి యనునది జ్ఞానయోగసహితమే యనియు, జ్ఞానమునకంటె యోగమునకంటె భక్తి వేఱుకాదనియు, దాని నాశ్రయించి భగవంతు నుపాసింపవలయుననియు, విగ్రహపూజ తొలుదొలుత సాధనమగుననియు, నాపిదప విగ్రహపూజ నిరర్థకమగుననియు, హృదయకమలాంతర్వర్తిగా భగవంతుని భావించుటొప్పుననియు, నాపూజయే శ్రేష్ఠమనియు స్పష్టమగుచుండును.

కొందఱు ధ్యానాదులు భక్తి కంగములనియు, జ్ఞానమునకుఁ గావనియుఁ గావునఁ గేవలజ్ఞానమువలన మోక్షము లేదనియుఁ బల్కుదురు. వారలకు గీతాశాస్త్రము నాల్గవయధ్యాయమునఁగల

“యద్జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాండవ,
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి.” ౩౫

అను శ్రీకృష్ణవాక్యము తెలిసినట్లగపడదు. జ్ఞానము భగవత్స్వరూపము. అది లేకయే భక్తియు, నేయోగము ఫలింపదు.

శ్రుతి. “వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థాః”

అని తెలుపుచున్నది.

“తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః,

గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః." ౧౭
(గీత ౫ అధ్యా.)

అని గీతాశాస్త్రమున శ్రీహరియే తెల్పెను. ఇట్లుండఁగా జ్ఞానమునకంటె భక్తి యుత్కృష్టమనువారు పామరులుగాక మఱెవ్వరగుదురు?

"కురుతే గంగా సాగరగమనం వ్రతపరిపాలనమథవా దానం,
జ్ఞానవిహీనే సర్వమతేన ముక్తిర్న భజతి జన్మశతేన."

అని శంకరాచార్యశిష్యప్రతిపాదితము కలదు. శంకరమతమున జ్ఞానియైనచోఁ జండాలుఁడుకూడ ముక్తుఁడగుననియే.

"జాగ్రత్స్వప్నసుషుప్తిషు స్ఫుటితరా యా సంవిదుజ్జృంభతే,
యా బ్రహ్మాదిపిపీలికాంతతనుషు ప్రోతా జగత్సాక్షిణీ,
సైవాహం న చ దృశ్యవస్త్వితి దృఢప్రజ్ఞాపి యస్యాపి చే,
చ్చండాలోఽస్తు సతు ద్విజోఽస్తు గురురిత్యేషా మనీషా మమ."

అని మనీషాపంచకమున వెల్లడించిరి. కావున సాధనచతుష్టయ సంపత్తిగలవాఁడు సన్న్యాసిగాక మోక్షములే దనునది శాంకరమతమనియు, నట్లైనచో బ్రాహ్మణేతరులగతి యేమనియు, భక్తికి నాచండాలమందఱు నధికారులేయనియు వ్రాయువారికి శాంకరమతమన నేదియో తెలియదనవలసినదియే. భగవత్కారుణకుఁ బాత్రుఁడు బ్రాహ్మణుఁ డొక్కఁడే యనునీచుఁడుండఁడు. ఆవిషయమున శంకరాచార్యులకంటె ముందంజవేయఁదగినవా రుండరని తదుక్తమనీషాపంచకమే వేయిభంగులఁ బలుకుచున్నది.

"శ్రద్దధానశ్శుభాం విద్యామాదదీతావరాదపి,
అంత్యాదపి పరం ధర్మం స్త్రీరత్నం దుష్కులాదపి." ౨౩౮
మనుస్మృతి. ౨ అధ్యా.

వ్యా. "అంత్యశ్చాండాలస్తస్మాదపి జాతిస్మరాదేర్విహీనయోగప్రకర్షాత్ దుష్కృతశేషోపభోగార్థమవాప్తచాండాలజన్మతః పరం ధర్మం మోక్షోపాయమాత్మజ్ఞానమాదదీత. తథా అజ్ఞానమేవోపక్రమ్య మోక్షధర్మే ప్రాప్యజ్ఞానంబ్రాహ్మణాత్క్షత్రియాద్వైశ్యాచ్ఛూద్రాదపి నీచాదభీక్ష్ణం శ్రద్ధాతవ్యం శ్రద్ధధానేన నిత్యం." అని కుల్లూకభట్టు.

"స్త్రియో రత్నాన్యథో విద్యా ధర్మశ్శౌచం సుభాషితం,
వివిధాని చ శిల్పాని సమాదేయాని సర్వతః." ౨౪౦

మనుస్మృతి. ౨ అధ్యా.

మనుస్మృతియం దిట్లున్నది. పూర్వులు జ్ఞానము నెంత ప్రధానముగా గౌరవించిరో దీనిమూలమున స్పష్టమగును. శంకరాచార్యమతమున బ్రాహ్మణేతరులకు గతి లేదనుశంకయే కలుగదని యెఱుంగవలయు. సర్వసమత్వము శంకరాచార్యులనుజూచి యితరులు నేర్చుకొనవలసియే యున్నదనుట స్పష్టము. పై ప్రమాణములనుబట్టి యాలోచించిన జ్ఞానమునకంటె భక్తి యుత్కృష్టమనుమాట యేటఁ గలిసెను. భక్తితోఁ జేరక యున్న జ్ఞానయోగములు వ్యర్థములగునేకాని భక్తి యెట్లో భగవంతుని జేర్పఁగలదనువారి వాదము దుర్వాదమనియు స్పష్టమగును. జ్ఞానయోగములతోఁగూడని భక్తి నిరర్థకమగును. విశేషించి భుక్తియే యనంబడును.

కొందఱు గీతాదులయందుఁ దమకు వలసినభాగములను మాత్రముగ్రహించి ముందువెనుకల దానికింగల సంబంధమును దెలుపక తమవాదము దృఢపఱచుకొందురు. అది మిగులఁ బొరపాటు. ప్రకరణమునుగూడఁ బరికించి యేది ప్రధానమని సిద్ధాంతముచేయఁబడినదని యాలోచింపవలయును. గీతాశాస్త్రమునందుఁ గర్మసిద్ధాంతమే ప్రధానముగాఁ దెలుపఁబడినది. భక్తి

యోగజ్ఞానములు లేకయున్నచోఁ గర్మము సత్ఫలము నీయఁ జాలదనియుఁ దెలెడిని. త్రిమూర్తులందు నీకిష్టమైనవాని నారాధింపుమని శ్రీహరి తెలుపలేదు. త్రిమూర్తులను బుట్టించినవాఁ డెవ్వఁడో, ఎవ్వానియిచ్ఛయే ప్రకృతియై నిమేషమాత్రమున కలబ్రహ్మాండములఁ బుట్టించునో యట్టి పరాత్పరు నారాధింప వలయుననియే తెలిపెను.

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా. ౬౧
తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత,
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్. ౬౨
ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా,
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు. ౬౩
సర్వగుహ్యతమం భూయశ్శృణు మే పరమం వచః,
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్." ౬౪

దీనిసారమేమి? సర్వభూతముల హృదయస్థానమున నెలకొని యున్నవాఁడు. సర్వభూతముల నాడించుచున్నవాఁడు. కావున నామహాత్మునే యాశ్రయింపుము. సర్వవిధముల నాతనినే యాశ్రయింపుము. దాన నీకు నుత్తమశాంతిపదములు లభింపఁ గలవు. అర్జునా అతిరహస్యవిషయముల నుపదేశించితిని. (కర్మ జ్ఞానాదిమార్గముల నని భావము.) వానినెల్లఁ జక్కఁగా విమర్శించి యేమార్గముత్తమమని తోఁచునో యామార్గమున నన్నారాధింపుము. అర్జునా! నీవు సఖుఁడవని యతిరహస్యమును జెప్పెదను. అదినీకు హితమైనది. ఏదనఁగా

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే." ౬౫

సర్వప్రకారములఁ బరాత్పరుఁడ నగు నన్నే యాశ్రయింపుము. అట్లు చేసితివేని నన్నే పొందుదువు. ఇది సత్యము. అనియే దీనిసారము.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః." ౬౬

ఇదియే పరమేశ్వరుఁ డర్జునునకు నుపదేశించిన సారతమవిషయము. సర్వధర్మములను బరిత్యజించి నన్నొక్కనినే శరణమొందుము. సర్వపాపములను దొలఁగునట్లుచేసి మోక్ష మొసంగుదునని ప్రాతీతికార్థము దీనినే ప్రధానముగాఁ జేసికొని యెవ్వరెవ్వరికి దోఁచినట్టు లర్థము చెప్పుదురు. శ్రౌతస్మార్తరూప ధర్మముల నన్నింటిని వదలి నన్నే శరణుపొందుమని కృష్ణుఁ డుపదేశించె నందురు. వీరు కర్మత్యాగులు. వీరు గ్రహించిన యర్థము భగవదభిప్రాయవిరుద్ధము. గీతాశాస్త్రమునందు ఫలాభిసంధిరహితముగా సత్కర్మముల నాచరింపుమని బోధించెను గదా.

"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి.
యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే."

గీత ౨

వేదోక్తము లగుకర్మముల మాని నన్నాశ్రయింపుమని కృష్ణుఁడు చెప్పఁడు. స్వోక్తివ్యాఘాతదోషమునకుఁ బాల్పడగునా? సర్వజ్ఞుఁడుకదా.

"యుంజన్నేవం సదాత్మానం యోగం నియతమానసః,
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి.

సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯
సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే." ౩౧

౬ అధ్యా.

అను యోగానుష్ఠానమునఁగాని నన్నుఁ గాంచఁజాలఁడన్న యుపదేశముకూడఁ బైయర్థమువలనఁ జెడును.

"ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారైస్త్రిభిర్నరః,
ఆచరత్యాత్మనః శ్రేయస్తతో యాతి పరాం గతిం. ౨౨
యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్. ౨౩
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి." ౨౪

౧౬ అధ్యా.

అన్న శాస్త్రప్రమాణముకూడ నిష్ఫలమగును. సర్వధర్మములు మాని నన్నే భజింపుమనువాక్యమునం దెంతయో గంభీరార్థము కలదు. నీవు శాస్త్రసిద్ధములగు కర్మముల నాచరించుచు వానిఫలముల నాకే యర్పించుచుఁ జక్కని యోగము నభ్యసించి సమాహితాంతఃకరణుఁడవై సర్వేశ్వరుఁడనై సకలబ్రహ్మాండము నందుఁ బూజ్యుఁడ నొక్కఁడనే యై ప్రకృత్యతీతుఁడనై త్రిమూర్తులకుంగూడ నారాధ్యుఁడనై యెల్లప్రాణులహృదయ భాగముననుండి వారివారికర్మములకనువగురీతి వారిం ద్రిప్పుచు నుందునని యెఱింగి నన్ను సేవింపుమా యని సారతరార్థము. ఇట్లు నీవు నన్నెఱింగి యాశ్రయించితివేని యుద్ధమునఁ గలుగఁ బోవు సకలపాపములనుండి నిన్నుద్ధరింతును. సంగరాంగణ

మున నేయక్రమములు చేయుదునో నాకేగతికలుగునో యని దుఃఖింపకుము. నాయాజ్ఞ ననుసరించి వర్తింపుము. నిన్నుద్ధరింతును. అనియే శ్రీకృష్ణపరమాత్మ యర్జునునకు నుపదేశించెను. అంతియగాని కన్నతల్లిదండ్రులకు సేవచేయమాని వారి నవ్వలికి నీడ్చి యహావ. వము పోషింతునని ప్రతినయొనర్చి విధివిహితముగాఁ బెండ్లియాడిన సాధ్వీకిఁ దిలోదకము లొసంగి యీతని వలనఁ దరింతుమని యాశించియున్న పితృదేవతలఁ బాఱఁదోలి శ్రాద్ధాదివేద ప్రతిపాదితకర్మముల నేటఁగలిపి యేమిపనిలేనపుడు కృష్ణా యని పలుకువారలను శ్రీహరి పాపలోకమునఁ బడఁద్రోయకమానఁడు. అలసులు ధనార్జనపరులు నగువంచకులు తోఁచిన ట్లర్థము చెప్పఁబూనుదురు. దాన వారల కిహపరముల మేలు కలుగఁబోదు.

కొందఱు దీనినే చరమశ్లోకమందురు. సర్వమునందు పరాత్పరునిఁజూడఁగలవా రన్నికర్మముల మానినను మానవచ్చునేమో, అట్టి మహామునులు సమస్తమును మఱచి ప్రహ్లాదునివలె హరితో మాటలాడుచు శ్రీకృష్ణునితో నాడుకొనుచునుందురేని వార లిద్దానిని జరమశ్లోకమన్న బాధలేదేమో కాని యంద ఱిద్దాని నమ్మి కర్మములఁ ద్యజించినచోఁ బతితులగుట వాస్తవము. ఒక్కధర్మము సర్వప్రాణులకు వర్తింపదు. ఎల్లర కొక్కవిషయమే రుచింపదు. "భిన్నరుచిర్హి లోకః" అనుట యందఱెఱింగినదియేకదా. కావున వారివారి యోగ్యత ననుసరించి యేవిషయముగాని యుపదేశింపవలయును. కాని "కలిపికొట్టరా కస్తురిరంగా" అన్నట్లు చరమశ్లోకమని పలుకరాదు. ఆస్థితియందుండువారలకునితరుల యుపదేశమే యక్కఱయుండదు. పెద్దలయుపదేశముననేకదా యాస్థితిని వారుందురు.

కావున భ_క్తివిషయమున నందఱు సమానులే యనరాదు. భేదము కలదు. ఆవిషయమిచ్చట వ్రాయకమాన వలనుపడదు.

భ_క్తి యనునది దేవాలయము నలుకుట మొదలగు కార్యములమూలమున నిలుచు ననరాదు. భగవంతునియందుఁ బరమానురాగము నునుచుటకనేకమార్గము లున్నవి కొందఱు మంత్రముల నుపదేశవిధిని బరిగ్రహించి యుపాసింపవచ్చును. భక్తుఁడుగాకున్న నది ఫలింపనే ఫలింపదు. ఆత్మారాముని హృదయారవిందమున నిలిపి పూజింపవచ్చును. మానసికపూజ యని దానికిఁబేరు. యోగియై యుండినఁగాని మనస్సు చంచలముగాక సుస్థిరముగా నిలువదు. అది నిలిచిననే యేపూజయు ఫలించుట. లేకున్న నిష్ఫలమే. యోగసిద్ధిం గాంచి జ్ఞానియై సర్వస్థలముల నాపరాత్పరునే చూడవచ్చును. దానికిని భ_క్తి ముఖ్యమే. భక్తునకు జ్ఞానము యోగము ముఖ్యములు. అవి కలిగిననే భ_క్తియనంబడును. బాహ్యపూజ చేయవచ్చును. విగ్రహార్చన మగుట నది యత్యల్పఫలమగును. కొంతకాలము పూజించి యాయాకారము హృద్గతముఁగఁ జేసికొనవలయును. ఆవల నీబాహ్యపూజ యక్కఱలేదు. ఇట్లే భ_క్తి యనేకవిధముల భగవంతు నారాధించుమార్గములుగా నుండును. సకల తపస్సులు, యజ్ఞములు, వ్రతములు దానములు లోనగునవి భక్తునికార్యములే. భ_క్తి యేవిధముగానైనఁ గనఁబఱుపవచ్చును. గాని యది నిష్కల్మషముగాఁ జి_త్తముండిననే ఫలించును. నటనరూపమైన నిరర్థకమగును.

ఉపాసనముకూడ భ_క్తియం దంతర్భూతమే యని తెలిపితినిగదా. అనఁగా నుపాసనమూలమున నభీష్టదైవమునందు

భక్తి కుదురునని భావము. "మననాత్త్రాయత ఇతి మంత్రమ్" అని దానివ్యుత్పత్తి చెప్పఁబడినది. మననముచేయుటవలనఁ గాపాడునుగాన మంత్రమనుపేరు వచ్చినది. అది సామాన్యము కాదు. మననముచేయుటకు సమాహితాంతఃకరణము గావలయును. అదియుండుటకు యోగముతప్ప వేఱొక్కమార్గము కానరాదు ఎన్నివిధములుగా భక్తి నటించిన నది కుదురదు. అది కుదిరినఁగాని యేభక్తియు నేమంత్రము ఫలింపదు. కావున యోగము ముఖ్యమనుట నిర్వివాదాంశము. యోగ మభ్యసించుచు నంతఃకరణశుద్ధిని సంపాదించి సద్గురూపదిష్టమంత్రమును భక్తియుక్తి జపింపవలయును. జపకాలమున నభీష్టదేవతాకారూపము హృదయపీఠమున నిలిచి యుండవలయును. దానిం గాంచుచుఁ దదభీష్టబీజసంపుటితమంత్రమును జపించుచు నుండినఁగాని యది ఫలింపదు. ఇంతకంటెఁ గష్టమగు కార్యము కలదా ఇన్ని కుదిరినను భక్తియుఁ దోడ్పడవలయును. దీనికే తపస్సనియుఁ బేరు.

కొందఱు భక్తి శ్రేష్ఠమనియు నాభక్తియందు వందనమొకభాగమనియు నది తొమ్మిదివిధములనియుఁ దెల్పుచు నమశ్శబ్దము లేనిమంత్రమే లేదనియు, నమశ్శబ్దము లేనిది మంత్రమనిపించుకొనదనియుఁ గావున భక్తిగలవారలకే మంత్రము ఫలించు నందరు. ఈమాటలయం దొక్కటిమాత్రము నిశ్చయము. భక్తిలేనిదే మంత్రము ఫలించుననుట యసత్యమే. తుదకు దేవాలయము నలికినను భక్తిగలిగిననే యది యల్పఫలమైన నిచ్చును. ప్రసాదముకొఱకుఁ జేసిన నదియు ఫలింపదు. ఇందుఁ గల యపూర్వసత్య మేమనఁగా నమశ్శబ్దములేనిచో మంత్రమే కాదనుమాటయే యని యెఱుంగవలయు. శైవవైష్ణవశాక్త

గాణాపత్య కాపాలికసౌరములని సాధారణముగా నాలువిధ ములుగా మంత్రము లుండును. స్కాందాదిమంత్రములు కలవు గాని యవియన్నియు వీనిలో నంతర్భూతములగును. అన్ని మంత్రములలో నమశ్శబ్దము కలదనియు, నమశ్శబ్దము లేకయున్న మంత్రమే కాదనియుఁజెప్పుట సర్వవిధముల నసంగత ప్రసంగము. మంత్రములన నేమో తెలియక తెలిసినట్లు నటించువారిమాట లిట్టివే. తమకుఁ దెలియనివిషయమునఁ బ్రవేశింపక యూర కుండుట మేలుకదా. పాపము! వారి కట్టివే మంత్రము లొకటి రెండు తెలిసియున్నవి కాఁబోలు. అన్నియు నిట్టివే యని పొర పడియుందురు. ప్రణవములేక నమశ్శబ్దములేక యెన్నియో మంత్రములు కలవు. అవి కలవియే చాల కొంచెముగా నున్నవి. ఈయుపదేశమునుబట్టి యట్టివారి కుపాసనమన నెట్టిదో తెలియ దనియు మంత్రగ్రంథములన నేవియో తెలియదనియుఁ బోడ కట్టెడిని. ఇట్టివారే గురువులైనపు డింక వారిశిష్యుల కెంత పాండిత్య ముండునో చెప్పఁదరముగాదు. అట్టివా రూరక భగవన్నామము మహామహిమాంచితమని చెప్పుకొనరాదా. లోకము నేల వంచింపఁ బ్రయత్నింపవలయును? అః వారు భగవద్భక్తి లేశమునుగూడ నెఱుంగరచుట పాపముగాదు. వారిమాటలను నమ్మి మోసపోవక శాస్త్రజ్ఞులగువారికడ నుప దేశము పొందవలయును.

"అనేకగురవస్సంతి శిష్యవిత్తాపహారకాః,
ఏకఏవ గురుర్జ్ఞేయః శిష్యహృత్తాపహారకః."

అను సూక్తిననుసరించి ధనార్జనాసక్తుఁడు గాక దీక్షాపద్ధతుల నెఱింగి భక్తుఁడై యుండుగురువును వెదకికొని వారికడ నుప

దేశమును గ్రహింపవలయును. ఆమంత్రములే ఫలించును. గురువనఁగా

"ఆచినోతిహి శాస్త్రార్థ మాచారే స్థాపయంతి చ,
స్వయమాచరతే యస్తు తమాచార్యం ప్రచక్షతే."

అనుప్రాచీనసూక్తి కనంబడియెడిని.

గురుశిష్యపరీక్షాపద్ధతి.

"అనర్హే మంత్రవిజ్ఞానం న తిష్ఠతి కదాచన,
తస్మాత్పరీక్ష్య వక్తవ్యమన్యథా నిష్ఫలం భవేత్.
యస్స్నేహాద్భయలోభాద్వైరయోగ్యం యది దీక్షయేత్,
దేవతాశాపమాప్నోతి కృతం చ నిష్ఫలం భవేత్.
జ్ఞానేన క్రియయా వాపి గురుశ్శిష్యం పరీక్షయేత్,
సంవత్సరం తదర్ధం వా తదర్ధం వా ప్రయత్నతః.
శిష్యోఽపి లక్షణైరేతైః కుర్యాద్గురుపరీక్షణం,
ఆనందాద్యైర్జపైస్స్తోత్రైర్ధ్యానహోమార్చనాదిషు,
జ్ఞానోపదేశసామర్థ్యం మంత్రశుద్ధిమపీశ్వరి.
బోధకత్వం చ విజ్ఞాయ శిష్యో భూయాన్నచాన్యథా."

పురశ్చరణప్రదీపిక.

"శ్రీగురుః పరమేశాని! శుద్ధవేషో మనోహరః,
సర్వలక్షణసంపన్న స్సర్వావయవశోభితః,
అగ్రగణ్యో గభీరశ్చ పాత్రాపాత్రవిశేషవిత్,
శివవిష్ణుసమస్సాధుర్న్నచ దర్శనదోషకః,
నిత్యే నైమిత్తికే కామ్యే రతః కర్మణ్యనిందితే,
యదృచ్ఛాలాభసంతుష్టో గుణదోషవిభేదకః,
ఇత్యాదిలక్షణోపేతశ్శ్రీగురుః కథితః ప్రియే." కులార్ణవము.

"నాస్తికాన్ భిన్నమర్యాదాన్ కృతఘ్నాన్ వేదనిందకాన్,
మంత్రాక్షరోపదేశే తు దూరతః పరివర్జయేత్. నారదతంత్రము.
నదేయమర్థలుబ్ధాయ పిశునాయాస్థిరాయ చ,
భక్తిశ్రద్ధావిహీనాయ శుశ్రూషావిముఖాయ చ." సనత్కుమారసంహిత.

ఇట్లు సద్గురులక్షణములు సచ్ఛిష్యలక్షణములు చెప్పఁబడినవి. "శివవిష్ణుసమస్సాధుః" అని గురులక్షణములలోఁ గలదు. ఎవ్వానికి శివకేశవులయందు భేదబుద్ధియుండునో యాతఁడు మంత్రోపదేష్ట కాఁదగఁడని పై ప్రమాణము బోధించెడిని. గురువునకే యట్టిభేదబుద్ధి గల్గిన నిఁక శిష్యున కది వేయి మడుంగు లెక్కుడుగ నగును. కావున "సమదర్శనః" అన్న లక్షణముల కనుకూలుఁడుగా గురువుండవలయునని యెఱుంగ వలయు.

కొందఱు హరిహరులలో నొక్కరియందే భక్తిగలిగ యుండవలయుఁగాని యిరువురయం దునుపరా దందురు. భక్తుఁడు పతివ్రతవంటివాఁ డందురు. నాకందఱు సమానులని నిజమైనభక్తుఁడు చెప్పఁజాలఁ డందురు. అట్లు చెప్ప శక్యము కాదందురు. ఏవేవో కుయుక్తులు పన్నుదురు. శంకరాచార్యులు విష్ణుభక్తినే బోధించె నందురు. పాపము? వారికి హరిహరులే పూజ్యులుకాని యితరులుకారని తోఁచినట్లు కనుపట్టెడిని. ఈ విషయము నించుక వివరింతము.

"అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే,
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః. ౮
అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః,
అహమాదిశ్చ మధ్యం చ భూతానామంత ఏవ చ." ౨౦
గీత ౧౦ అధ్యా.

అని శ్రీకృష్ణమూర్తి బోధించెను. సర్వమును బుట్టించువాఁడను నేను. నావలననే పాలననాశనములు జరగుచున్నవి. అని యెవరు నన్ను భావించుచు భజింతురో వారే బుధు లనంబడుదురనిగదా తాత్పర్యము. దీనింబట్టి బుద్ధిబలము నాశ్రయముగా నాలోచించిన నీసృ స్థితిలయకర్తలు నావలన నిర్మింపఁబడినవారనియే స్పష్టమయ్యెడిని. ఇపుడు విజయునకు బోధించు శ్రీకృష్ణమూర్తి యెవ్వఁడు? ప్రకృత్యతీతుఁడగు పరతత్త్వము. మన మూహించు బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు నీపరమాత్మకు నడుమఁ బ్రకృతి యున్నది. అది భగవంతునిచ్ఛాశక్తి. అనఁగా నాపరమేశ్వరుఁడు సృష్టి కావలయునని తలంచును. అంతలోనే సకలబ్రహ్మాండము లేర్పడును.

"త్రిభిర్గుణమయైర్భావై రేభిస్సర్వమిదం జగత్,
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్. ౧౩
దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే." ౧౪
గీత ౭ అధ్యా.

సత్త్వరజస్తమోగుణప్రధానులుగా విష్ణు బ్రహ్మ మహేశ్వరు లుందురు. త్రిగుణములను నీ మూఁడింటిచేతనే లోకమెల్ల మోహితమై యున్నది. కావున నీత్రిగుణముల నతిక్రమించి నాశరహితుఁడనై యున్న నన్నెఱుంగఁజాలరు. త్రిగుణమయియు నాస్వభావభూతయు నగునామాయ యెవ్వారికే నతిక్రమింపఁ దరముగానిది. నన్ను సేవించువారలే యీమాయను దరింతురు. అనఁగా నాప్రకృతిచే బద్ధులుకాక నాకడఁ జేరుదురు. త్రిగుణస్వరూపిణి విష్ణుమాయ. త్రిగుణములే త్రిమూర్తులు. అనఁగా నొక్కొక్కగుణము ప్రధానముగా నుండువారు.

దీనిభావమేమి? పరమాత్మ యొక్కఁడే. అద్వితీయుఁ డనంబ డును. ఆమహాత్మునియిచ్ఛయే ప్రకృతి. ఆప్రకృతియే త్రిమూర్తు లకుఁదల్లి. ప్రకృత్యతీతుఁ డాపరమాత్మయొక్కఁడే. తక్కినవా రందఱు ప్రకృతిశక్తికి లోఁబడియుండువారు, అని గీతా భావము.

ఇపుడు శ్రీకృష్ణుఁడు తాను బరతత్త్వమని తెలుపు చున్నాఁడు కాని హరిహరులలో నొక్కఁడనని తెలుపుటలేదు. ఇట్టులుండఁ బ్రకృతినిర్మితులగు హరిహరులలో నొక్కనియందే భక్తియునుపఁదగునన్న వాదము నిస్సారమనక విడువఁదగునా? అల్పజ్ఞులవాద మిదియే.

"ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్" అనియుం,

"రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్." అనియుం,

"అహమేవాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః."

అనియు విభూతియోగ మనఁబడు పదియవయధ్యాయమున శ్రీకృష్ణుఁడు తెల్పెను. దేవతలలో విష్ణువునని, రుద్రగణములో శంకరుఁడనని, కర్మముల విధించువారలలో ధాత నని శ్రీ కృష్ణుఁడు తెల్పెను. ఆయాతెగలలోఁ బ్రధానులగువారెల్ల నేనేయనికదా భావము. దేవతలలో విష్ణువు ముఖ్యుఁడు శ్రీ కృష్ణమూర్తియే సర్వవ్యాపకుఁడగు పరమాత్మ యని సారము. ఈ చెప్పినవారుకాక తక్కుంగలవారందఱు నీవుకావా యని యర్జునుఁడు ప్రశ్నించునేమో యని యూహించి

"యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున,
న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్. ౩౯
అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున,
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్." ౪౨

అని సమాధానము చెప్పెను. సర్వము నాస్వరూపమనుటచేత నొకరూపము నాకుఁగలదని యెన్నరాదనియు, సర్వరూపములు నావే యనియు, నేభక్తుఁడేరూపమున ధ్యానించిననారూపమున సాక్షాత్కరింతుననియు, శ్రీకృష్ణునభిప్రాయము. భక్తి యను పదగినవారు హరిహరులుమాత్రమే కారు. భక్తాభీష్టరూపము గల పరమాత్మ సర్వరూపములు పూజ్యములే. హరిహరరూపములుమాత్ర మాపరమాత్మవియేకదా! వారి నారాధించినను భేదబుద్ధి పనికిరాదు భక్తి యొకరిపై నుండవలయుఁగాని యిర్వురపై నుండ రాదనువారివాదము నిస్సారము. ఒక్కరే యిరువురు. ఇరువురు నొక్కరే. ఇట్టి వెన్నియోనామములు లా పరాత్పరునకుఁ గలవు. భక్తుఁడు తా మదినిల్పిన రూపము నామము చిహ్నములు నెట్టివైనను దద్రూపమున నలరు పరాత్పరుని ధ్యానింతు ననుకొన్నయెడల భేదబుద్ధియే యుండదు. మతవైషమ్యముల కవకాశమే లేదు. పతివ్రత తనభర్తనుంబోలె నెల్లరఁబురుషులఁ బ్రేమింపఁదగునా యనుప్రశ్నము నీచమైనది. భక్తుఁడు పతివ్రతతో సమానుఁ డనుటయుఁ బొసఁగదు. భక్తుఁడు తనయిష్టదైవమును దండ్రిగా భావించును. సాధ్వి భర్తను దండ్రివలె భావించునా? సాధ్వి భగవంతుఁడగు నారాయణమూర్తిని ధ్యానించుచో నాప్రాణేశా! యనునా? ఓతండ్రీయని భావించునా. భక్తునకుఁ బతివ్రతకు సాటిచెప్పుట యెంతమాత్రము పొసఁగదు. 'ఏకో దేవః కేశవోవా శివోవా' యన్నసూక్తి కేమియర్థమని ప్రశ్నింపవచ్చును. శివకేశవులు వేఱువేఱుగా నుందురని భావింపక యీరెండురూపములలో నీయిచ్ఛవచ్చురూపము నొక్కదానినే తలంపుమనియు నవియే రెండురూపములుగా నయ్యెనని తలంపుమనియు భావము.

ంకరుఁడు చక్రపాణి యనితలంచినచో బాధలేదు. త్రిపుర
హాలపాణి యని ధ్యానించినను బ్రాణముపోదు.

"కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః."

ని శ్రీకృష్ణమూర్తి విశ్వరూపసందర్శనకాలమునఁ బలికెను.
ఏకాలమున నేకార్యము చేయవలయునో యాకాలమున నా
రూపమును దాల్తుననికదా దీనిభావము. ఇట్టులుండ హరిహరు
లలో నుత్తమాధమభేదము లెట్లు గలుగును? ఇవి వంచకుల
మాటలుగాని వేఱుకావు.

"స బ్రహ్మ స శివస్సహరిస్సేంద్రస్సోఽక్షరః పరమస్స్వరాట్."

అనుశ్రుతి కర్థమేమి?

"స బ్రహ్మ సశివస్సేంద్రస్సోఽక్షరః పరమస్స్వరాట్,
స ఏవ విష్ణుస్సప్రాణస్స కాలోఽగ్నిస్స చంద్రమాః." కైవల్యోపనిషత్తు.

ఈశ్రుతి కర్థమేమి?

"మహేశ్వరే వా జగతామధీశ్వరే జనార్దనే వా జగదంతరాత్మని,
తయోర్న భేదప్రతిపత్తిరస్తి మే తథాపి భక్తిస్తరుణేందుశేఖరే."

అని భర్తృహరి చెప్పఁగదా. ఇరువు రొక్కరే యన్నభావము
గల భర్తృహరికింగూడ భక్తి శంకరునందేకదా కుదిరెనని
ప్రశ్నింపరాదు. అది దాని కర్థముకాదు. బాలచంద్రుఁడు శిరో
భూషణముగాఁ గలరూపమును నే ధ్యానింతుననియే భర్తృ
హరిభావము. ఇరువు రొక్కరే యని నాభావ మనియెను.
భర్తృహరి యారూపమును ధ్యానించువాఁడు. నా కారూ
పము ధ్యానార్హ మనెను. దీనిచేత శంకరునియందే భక్తి
యెక్కుడనియు విష్ణువునందు లేదనియుఁ గాదు. భక్తునిప్రేమ

మునకుఁ బాత్రమగురూపమే సర్వనామవాచ్యము. భక్తుని నిర్మలమగునాత్మయం దీవిషయమే యుండవలయును. లేనిచో నాభక్తి స్థిరతఁగాంచి సత్ఫలము నీయఁజాలదు. విశేషించి వంచకుల కిది స్వభావమగు.

"నాస్థా ధర్మే న వసునిచయే నైవ కామోపభోగే
యద్యద్భవ్యం భవతు భగవన్ పూర్వకర్మానురూపమ్,
ఏతత్ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాంతరేఽపి
త్వత్పాదాంభోరుహయుగగతా నిశ్చలా భక్తిరస్తు."

అని కులశేఖరాళ్వారు రంగనాయకులఁ బ్రార్థించెను. ఈరంగనాథుఁడు సర్వాంతర్యామియు నచింత్యమహిమాన్వితుఁడగు భగవంతుఁడా? శ్రీరంగములోనున్న విగ్రహమా?భగవంతుఁడే యైనచో శివరూపమున ధ్యానించినను విష్ణురూపమున ధ్యానించినను నింకేరూపమున ధ్యానించినను ఫలము నిచ్చును. శివరూపుఁడు కాఁడని భేదబుద్ధిం బూని ప్రార్థించినయెడల విముఖుఁడగునుగాని సుముఖుఁడు కానేరఁడు.

"విహాయ కోదండశరౌ ముహూర్తం
గృహాణ పాణౌ మణిచారువేణుమ్,
మాయూరబర్హం చ నిజోత్తమాంగే
సీతాపతే త్వాం ప్రణమామి పశ్చాత్."

శ్రీకృష్ణకర్ణామృతము. ఆశ్వా.

అని లీలాశుకులు పలికిరి. ఈమహాభక్తునకు శ్రీరామచంద్రునిపై నీర్ష్యకలదా? ఏల యిట్లు పలికెను? దీనిసారమేమని గ్రహింపవలయు. లీలాశుకులకు రామకృష్ణాదిరూపములయం దన్నింటియందు భక్తి కలదు. అతఁడు సర్వదా

ధ్యానించురూపము వేణుగోపాలమూర్తిది. దానిని మాని యొక్కరూపమున ధ్యానింపనేల? భగవంతుఁడు ప్రత్యక్షుఁడై భక్తమానసకల్పితమూర్తిగాఁ గోచరింపక రామమూర్తిగా నేల గోచరించును? ఇది కల్పితకథ. లోకులకు లీలాశుకు నుపదేశించిన దేమనఁగా నేరూపము భక్తున కిష్టమగునో దాని ధ్యానింపవలయుననియే కాని నాకు రామునికంటెఁ గృష్ణుఁడధిక ప్రేమాస్పదుఁడని కాదు. భగవంతునకు రూపము కల్పించుట ధ్యానాగము. అది సర్వజనుల కొక్కరీతి నుండదు. వారివారి యిచ్ఛాధీనముగ నుండును. ఆరూప మొక్కఁడుమాత్రమే భగవంతున కిష్టమగునా? కానే కాదు. సర్వరూపముల నుండువాఁడుకదా పరమాత్మ యనఁబడు. కొందఱు

"విష్ణోరేకైకనామైవ సర్వదేవాధికం మతమ్,
తాదృఙ్నామసహస్రేణ రామనామసమం మతమ్."

ను మొదలగుశ్లోకముల నుదాహరించి విష్ణునామపారాయణమే ముఖ్యమనియుఁ దక్కినశివాదినామము లల్పఫలదము లనియు నుపన్యసింతురు. మనము ఫలస్తుతులం గాంచి యిది యుత్తమమని నిర్ణయించుట మిగులఁ బొరపాటు. ఇట్టివాదములచేఁ గాలము వ్యర్థము చేయరాదు. ఇట్టి యుపన్యాసముల మూలమున దేవతాంతరద్వేషము గలుగును. అల్పాయుస్సు గలిగిన యీమానవశరీరముచేత సాధుమతసమ్మతముగాఁ గాలము గడుపవలయుఁగాని తుచ్ఛవాదములమూలమునఁ గడుపరాదు. ఈవిషయమును మహానుభావుఁడగు భర్తృహరి.

"ఆయుర్వర్షశతం నృణాం పరిమితం రాత్రౌ తదర్ధం గతం,
తస్యార్ధస్య పరస్య చార్ధమపరం బాలత్వవృద్ధత్వయోః,

శేషం వ్యాధివియోగదుఃఖసహితం సేవాదిభిర్నీయతే,
జీవే వారితరంగచంచలతరే. సౌఖ్యం కుతః ప్రాణినామ్." ౧౦౬
వైరాగ్యశతకము.

అను శ్లోకముమూలమునఁ దేటపడుచెను. ఈదేవునకంటె నాదేవుఁ డెక్కుఁడు. వానికంటె వీఁడెక్కుఁడు, అను నీ దుర్వాదములచేఁ గాలము గడుపుచుండ నిఁక మానవుఁడు తరించునుపాయ మరయు టెప్పుడు? తన మొండిపట్టును నిలుపఁ బెట్టుకొనఁ బ్రయత్నించుచు నాయుస్సు నశింపఁజేసికొను చుండువాఁ డెప్పుడు సమదర్శనుం డగుటకుఁ బ్రయత్నము చేయును? ఎన్నిజన్మములకైన నట్టియవకాశ మొదవ దనవల యును. శివకేశవభేదవాద మేకాలమునఁ బుట్టెనో కాని మత ధర్మములతత్త్వ మానాఁటినుండి నశించుచున్నవి. పురాణములు లోనగువానిలో నిట్టిభేదమున కవకాశము కలదా యన్న నించుకంతయు లేదు. ముందు మహాత్త్వమును దెలుపు ఫల స్తుతులంగూర్చి యించుక వ్రాసి పిదపఁ బైవిషయముంగూర్చి విచారింతును.

"శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే,
సహస్రనామతత్తుల్యం రామనామ వరాననే."

అని శివుఁడు తెల్పెననియు, శ్రీరామ రామ రామ యను నది సహస్రనామములతో సమమని చెప్పుటయేగాక మోక్షా ర్థులకు నిదియే యుపదేశించుచున్నాఁడనియుఁ గొందఱు పలుకు దురు. శ్రీరామనామము పరమపావనమనుట నిర్వివాదాంశము. ఇట్లే భగవన్నామములన్నియుఁ బరమపావనములే. రామ నామముతప్ప శివాదినామములు పరమపావనములు కావనికాని

వాదులు రామునికంటెఁ దక్కువవారనిగాని పలుకరాదు. అది మహాపాపకార్యము. శివుఁడు రామనామ ముత్తమమని ప్పినమాట ప్రమాణముగా నంగీకరించువారు విష్ణువు పరవుని భగవంతుఁడుగా భావించి పూజించె నని చెప్పినమాట నేల రసావహింపరో తెలియఁజాలకున్నాఁడను. సహస్రనామ పారాయణము మాని రామా యన్నఁ జాలుననియా దాని భావము. సహస్రనామపారాయణముచేయ శక్తులుగానిచోఁ త్తుల్య మనుభక్తి గలిగి రామా యని నైనఁబలుకుదురనియే దానిభావము.

"కోటయో బ్రహ్మహత్యానామగమ్యాగమకోటయః,
సద్యః ప్రళయమాయాంతి మహాదేవేతి కీర్తనాత్."

అనుదానింబట్టి యెన్నియో బ్రహ్మహత్య లొనరించి యొక్కసారి మహాదేవ యన్నచో నాపాపములు విశేషించి యగమ్యాగమనపాపకోటులు నశించు ననవలసినదే? మంచి యుపదేశ మిది. బళ! ఇట్టియుపదేశములు చేసినశిష్యులు పెక్కండ్రు కావచ్చును. దీనిభావ మేమనఁగా భగవన్నామము మహాఫలదమనియుఁ దెలియక యెన్నియోపాపములు చేసి యుందును. స్వామీ శ్రీమన్నారాయణా! మహాదేవా వాని నడంపుమా యని ప్రార్థించి పశ్చాత్తప్తుఁడు కావలయుననియు, నట్టిభక్తునిఁ బరమకరుణామూర్తియగు దాశరథి యనుగ్రహించుననియు మనము గ్రహింపవలయును. అంతియకాని రేయింబవలు మహాపాపములచేసి యొక్కసారి రామా యని కాని మహాదేవ యనికాని యుచ్చరించి నాపాపములు తొలఁగినవని మరలఁ బాపములు చేయసాగినచో నీనామ మిసుమంతయుఁ

బాపములఁ బోకార్పఁబూనదనుట నిశ్చయము. పామరుల కి ట్లుపదేశింప రాదు. ఫలస్తుతులుగదా యివి.

"ఇతి నామ్నాం సహస్రాణి షణ్ముఖస్య చ నారద,
యః పఠేచ్ఛృణుయాద్వాపి భక్తియుక్తేన చేతసా,
స సద్యో ముచ్యతే పాపైర్మనోవాక్కాయసంభవైః."

అని కలదు. సకలపాపములు తొలఁగునని యిందును గలదు. ఇట్టిఫలస్తుతులు తెలిపి యెన్ని పాపములుచేసినను ఒక్కసారి యీకుమారసహస్రనామస్తోత్రమును బారాయణము చేయుము. నీపాపములు తూలునని బోధింపరాదు. అట్లు బోధించుట యెట్టిదనగా.

టిబెట్టనఁబడు దేశముకలదు. అందుండువారు బౌద్ధులు. అందుఁ గొందఱు గంగావతరణమహాస్థలమునకు యాత్రార్థ మరుదెంతురు. బదరీకేదారమునకు వత్తురు. కేదారనాథునిం గౌఁగిలించుకొని స్వామీ! చేసినపాపము లన్నింటిని నీవే గ్రహింపుము. నే నింకఁ జేయఁబోవుపాపములను గ్రహింపుము. చేయనున్న మహాపాపముల గ్రహింపుము. నాకేపాపములు లేకయుండఁజేయుము. అని ప్రార్థింతురు. ఈప్రార్థనమును బదరీకేదారనాథుఁడు గాని బదరీనారాయణమూర్తి గాని యంగీకరించునా? పాపములఁ దొలఁగించునా? తాను బాపములఁ యఁబోవుదునని పలుకఁగానే వాని యందు భగవంతుఁడు కరుణ నునుచునా? ఈప్రార్థన మెట్టిఫలవంతమో "మహాదేవేతి కీర్తనాత్" అనునదియు నట్టిదే. మఱియుఁ జూతము.

"కృష్ణాశ్రయా హరిహరౌ కలౌ ప్రఖ్యాపయద్విభుః,

## ఉ త్త మ మా ర్గ ము.



ఇదం పఠతి భక్త్యా యశ్శృణోతి చ సమాహితః,
స్వసిద్ధ్యై ప్రార్థయంత్యేవం తీర్థక్షేత్రాదిదేవతాః,
ప్రాయశ్చిత్తాన్యశేషాణి నాలం యాని వ్యపోహితుమ్,
తానిపాపాని నశ్యంతి సకృదస్య ప్రశంసనాత్,

... ... ... ...

ఇదం నామసహస్రం యః పఠత్యేతచ్ఛృణోతి చ,
శివలింగసహస్రస్య స ప్రతిష్ఠాఫలం లభేత్.

... ... ... ...

కిమిదం బహునాశంసన్మానవో మోదనిర్భరః,
బ్రహ్మానందమవాప్యాంతే కృష్ణసాయుజ్యమాప్నుయాత్."

అను నీశ్లోకములు శ్రీకృష్ణసహస్రనామస్తోత్రాంతమునఁ గలవు. స్మృతులు విధించిన ప్రాయశ్చిత్తములు పోఁగొట్టఁజాలని మహాపాపములనుగూడ నీసహస్రనామస్తోత్ర మొక్కసారి పారాయణము చేసినఁ బోఁగొట్టుననికదా దీనిభావము.

"నామసంకీర్తనం ముక్త్వా నృణాం నాన్యత్పరాయణం,
తాకికాద్వచనాన్ముఖ్యం విష్ణునామానుకీర్తనమ్,
విష్ణునామసహస్రాచ్చ శివనామైకముత్తమమ్,
శివనామసహస్రాచ్చ దేవ్యా నామైకముత్తమమ్,
దేవీనామసహస్రాణి కోటిశస్సంతి కుంభజ,
తేషు ముఖ్యం దశవిధం నామసాహస్రముచ్యతే.

... ... ... ...

విష్ణునామపరాః కేచిచ్ఛివనామపరాః పరే,
న కశ్చిదపి లోకేషు లలితానామతత్పరః,
యేనాన్యదేవతానామకీర్తనం జన్మకోటిషు,
తస్యైవ భవతి శ్రద్ధా శ్రీదేవీనామకీర్తనే,

చరమే జన్మని యథా శ్రీవిద్యోపాసకో భవేత్."

అని లలితాసహస్రనామస్తోత్రోత్తరభాగమునఁ గలదు. ఇట్లే వ్రాయఁబూనిన నెంతయో గ్రంథమగును. ఇందేది యుత్తమ మని ప్రశ్నింపరాదు. ఏదేవతయం దెవ్వరికి భక్తి కుదురునో యాతఁ డాదేవతారూపమునఁ బరాత్పరు నారాధింపవలయు ననుటయే సారము. ఇందుఁ గనఁబఱచినఫలస్తుతులు పామరులకు భక్తి నొదవించుటకే చెప్పఁబడినవని యెఱుంగవలయును. ఏలయనఁగా ఫలాభిసంధిరహితముగానే భగవంతు నారాధింప వలయుననికదా గీతాశాస్త్ర ముపదేశించును.

"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి. ౪౭
యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే." ౪౮
గీత. ౨ అధ్యా.

"తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః." ౧౯
గీత. 3 అధ్యా.

ఈప్రమాణములంబట్టి నెట్టన విమర్శింపఁగా భగవత్ప్రీతికరముగా సత్కర్మముల నాచరింపవలయునేకాని వానినుండి ఫలములను గోరరాదనియే సారము తేలెడిని. విశేషించి స్థిరబుద్ధి గలిగి కర్మముల నాచరింపవలయును. స్థిరబుద్ధి యోగనిరతిచేఁ గలుగును. కావునఁ దొలుత యోగము నభ్యసించి స్థిరబుద్ధి యలవడఁగా నవల ఫలమునుగోరక సత్కర్మముల నొనరించి పరమాత్మప్రీతిఁ గోరవలయుననియు సిద్ధాంతము పొడకట్టును.

ఇన్నింటితో భ క్తికి సంబంధము కలదు. భ క్తి యే మూ ర్తియందుండునో యామూ ర్తిని వదలరాదు. పరాత్పరుఁడామూ ర్తిని ధరించినట్లే భావింపవలయు. "భావనామాత్ర సంతుష్టహృదయః పరమేశ్వరః" అనుమాటను మఱువరాదు. ఫలస్తుతులంబఱించి యందుఁజెప్పఁబడినఫలముల నందఁగోరి యా దేవు నారాధింపరాదు. ఫలస్తుతులు విశేషించి పామరులకు భగవంతునందు భ క్తి కలిగింపఁ జెప్పఁబడినవి. ఉపదేశింపఁబూను వా రట్టిశ్లోకములం జెప్పిచెప్పి యాశఁబుట్టింపరాదు. తుద కాఫలము గలుగకపోవఁగా వారు భగవంతు నారాధించిన లాభములేదని తలంతురు. ఏపారాయణముచేసినను ప్రా క్తన కర్మానుసారములగుఫలములే కలుగును. మిక్కిలి లభింపవు. లభించువానికై ప్రయత్నింప నేలయని యడుగరాదు. ఆకర్మమే మానవుని గార్యముచేయఁ బురికొల్పును. కావునఁ గర్మమే పరబ్రహ్మమని పెద్దలందురు.

"కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవం,
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్." ౧౫
3 అధ్యా.

అని భగవంతుఁ డర్జునునకుం దెల్పెను. ఇంక నీవిషయమై ప్రమాణములఁ జూపఁబూనక విమర్శింపఁబూనుదము.

శ్రీరామనామమే ము క్తిసాధనమని తన్మహాత్మ్యమునందును, శ్రీకృష్ణనామమే ము క్తిప్రదమని తచ్చరిత్రమునందును, సుబ్రహ్మణ్యనామమే పరమపురుషార్థప్రదమని తన్మహా త్మ్యము నందును, శివనామమే మోక్షకారణమని తచ్చరితమునందును, దేవీనామమే సకలపురుషార్థదానదక్షమని తన్మాహాత్మ్యము

నందును గనుపట్టెడిని. ఇట్లే యేదేవతామహిమమును బరిశీలిం చినం గనుపట్టును. వీనితాత్పర్య మేమని పరికింపవలయును. ఇవన్నియు సమానములే. ఇన్నిరూపముల నుండున దొక్క తత్త్వమే. కటకకుండలాదులలో నున్నసువర్ణము సమాన మూల్యముగ నున్నయట్లు భక్తుఁ డేరూపమున వినుతించినను సమాహితచిత్తము గలిగియుండునేని తద్వినుతి భగవంతుని సంతోషింపఁజేయును. సమాహితచిత్తము లేకయున్న నేదో యొకయల్పఫలము కలుగును. శివుఁడు రామనామము నుప దేశించెనన్న సత్యమే. శ్రీమహావిష్ణువు శివనామమును జపిం చుచు నితరుల కుపదేశించెనన్న నదియు సత్యమే. అది యెట్లు? అని ప్రశ్నింపరాదు. ఈరెండునామములుకూడ నొక్కనివే అక్షరభేదమేకాని వేఱుగాదు. కాన శివభక్తులు విష్ణుభక్తులును దరింతురు. కాని యితరదేవతాదూషణము చేయకుండిననే ఫలముగలుగునుగాని యీదుష్కార్యము చేయుచుండిన నించు కంతయు ఫలము గలుగదనుట సత్యము.

"న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః,
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః." ౧౫
౭ అధ్యా.

అని శ్రీకృష్ణమూర్తి గీతాశాస్త్రమునఁ దెలిపెను.

భీష్మః.—

అశక్తో౽హం గుణాన్వక్తుం మహాదేవస్య ధీమతః,
యోహి సర్వగతో దేవో న చ సర్వత్ర దృశ్యతే. 3

బ్రహ్మవిష్ణుసురేశానాం స్రష్టా చ ప్రభురేవ చ,
బ్రహ్మాదయః పిశాచాంతా యం హి దేవా ఉపాసతే. ౪

ప్రకృతీనాం పరత్వేన పురుషస్య చ యః పరః,

చింత్యతే యో యోగవిద్భిః ఋషిభి స్తత్త్వదర్శిభిః. ౫
అక్షరం పరమం బ్రహ్మ అసచ్చ సదసచ్చ యః,
ప్రకృతిం పురుషం చైవ క్షోభయిత్వా స్వతేజసా. ౬
బ్రహ్మాణమసృజత్తస్మా ద్దేవదేవః ప్రజాపతిః,
కో హి శక్తో భవం జ్ఞాతుం మద్విధః పరమేశ్వరం. ౭
ఋతే నారాయణాత్పుత్ర శంఖచక్రగదాధరాత్,
రుద్రభక్త్యా తు కృష్ణేన జగద్వ్యాప్తం మహాత్మనా.
తం ప్రసాద్య తదా దేవం బదర్యాం కిల భారత."
"వాసుదేవః.—
న గతిః కర్మణాం శక్యా వేత్తుమీశస్య తత్త్వతః,
హిరణ్యగర్భప్రముఖా దేవాస్సేంద్రా మహర్షయః,
న విదుర్యస్య భవనమాదిత్యాస్సూక్ష్మదర్శినః,
స కథం నరమాత్రేణ శక్యో జ్ఞాతుం సతాం గతిః. ౨౩
తస్యాహమసురఘ్నస్య కాంశ్చిద్భగవతో గుణాన్,
భవతాం కీర్తయిష్యామి వ్రతేశాయ యథాతథమ్." ౨౪

శ్రీమహాభారతము. అనుశాసనికపర్వము. ౧౪ అధ్యాయము.

శివుఁడు "శ్రీరామరామరామేతి" యనుశ్లోకమును పార్వతికి నుపదేశించినట్లే మహాభారతమున శ్రీకృష్ణమూర్తియే ధర్మరాజునకు శంకరుమహిమమును దెల్పుచు మానవమాత్రుఁడనగు నేను శివమాహాత్మ్యమును వర్ణింపఁగలనా యనియె. దీనిచేత శివుఁడే శ్రీకృష్ణునికంటె నధికుఁడనికాని, పార్వతికి శివుఁడు రామనామోపదేశము చేయుటంజేసి శివునికంటె రాముఁ డధికుఁడనికాని పలుక రాదు. ఈరెండుతత్త్వము లొకతత్త్వమునుండియే కలిగినవి. భక్తానుగ్రహరూపములు గలవియే. ఈరెండు నొకతత్త్వమున నంతర్భూతము లగునవియే.

ఇట్టులుండఁగా శివవిష్ణుభేదవాదుల కవకాశ మెట్లుకలదో తోఁపకున్నది. ప్రొద్దుపుచ్చుటకై యీదుర్వాదముల నల్పబుద్ధులు కల్పించుకొందురని తోఁచెడిని. భక్తు లిట్టిదుర్వాదములం జొరనీయక బుద్ధిని మరలించుకొని యిష్టదైవ మేదియైన మనఃపీఠమున నిలుపుకొని దృఢభక్తిగలిగి సర్వేశ్వరునిగా నారాధింపవలయును. అంతియకాని యొక్కొక్కరూపమునందు నౌత్కృష్ట్యముగలదనియు నొక్కొక్కరూపమునందు నైచ్యముగలదనియుఁ బలుకుచు నితరమతములఁ దూలనాడుచు నుండరాదు. వారికి భగవంతునికరుణ కలుగదు. కావున

శ్రుతి. "సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
సంపశ్యన్ బ్రహ్మ పరమం యాతి నాన్యేన హేతునా. ౯
ఆత్మానమరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిం,
జ్ఞాననిర్మథనాభ్యాసాత్పాశం దహతి పండితః. ౧౦
సఏవమాయాపరిమోహితాత్మా శరీరమాస్థాయ కరోతి సర్వమ్,
స్త్ర్యన్నపానాదివిచిత్రభోగైస్సఏవ జాగ్రత్పరితృప్తిమేతి. ౧౧
స్వప్నే తు జీవస్సుఖదుఃఖభోక్తా స్వమాయయా కల్పితవిశ్వలోకే,
సుషుప్తికాలే సకలే విలీనే తమోభిభూతస్సుఖరూపమేతి. ౧౨
పునశ్చ జన్మాంతరకర్మయోగా త్సఏవ జీవస్స్వపితి ప్రబుద్ధః,
పురత్రయే క్రీడతి యశ్చ జీవ స్తతస్తు జాతం సకలం విచిత్రమ్. ౧౩
ఆధారమానందమఖండబోధం యస్మిన్ లయంయాతి పురత్రయంచ.
ఏతస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణి చ,
ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీవిశ్వస్యధారిణీ. ౧౪
యత్పరం బ్రహ్మ సర్వాత్మా విశ్వస్యాయతనం మహత్,
సూక్ష్మాత్సూక్ష్మతరం నిత్యం తత్త్వమేవ త్వమేవ తత్." ౧౫

కైవల్యోపనిషత్

"నిద్రాభయసరీసృపం హింసాదితరంగం తృష్ణావర్తం
దారపంకం సంసారవార్ధిం తర్తుం సూక్ష్మమార్గమవలంబ్య
సత్త్వాదిగుణానతిక్రమ్య తారకమవలోకయేత్.
భ్రూమధ్యే సచ్చిదానందతేజఃకూటరూపకం తారకం
బ్రహ్మ తదుపాయంలక్ష్యత్రయావలోకనమ్."

మండలబ్రాహ్మణోపనిషత్తు.

ఇట్లుపనిషత్తులు పరమేశ్వరస్వరూపమును దన్మహిమమును దానినిధ్యానించుపద్ధతిని దెలుపుచున్నవి.

"కవిం పురాణమనుశాసితారమణోరణీయాంసమనుస్మరేద్యః,
సర్వస్య ధాతారమచింత్యరూపమాదిత్యవర్ణం తమసః పరస్తాత్.
ప్రయాణకాలే మనసాఽచలేన భక్త్యా యుక్తో యోగబలేన చైవ,
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్సతం పరం పురుషముపైతిదివ్యమ్.౧౦
యదక్షరం వేదవిదో వదంతి విశంతి యద్యతయో వీతరాగాః,
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే."
(గీత. ౮ అధ్యా.)

అను శ్రీకృష్ణపరబ్రహ్మము గీతోపనిషత్తునందు ధ్యానలక్షణమును దెలిపెను. ఉపనిషత్తులందుఁగాని గీతోపనిషత్తునందుఁగాని భగవల్లక్షణములు విశేషించి చెప్పఁబడి యవన్నియు మానసికపూజ కర్హములుగనే యున్నవి. విగ్రహపూజ కను రూపముగా లేవని యెఱుంగవలయును. సర్వగతుఁడగుపరమాత్మ నాటబొమ్మగా భక్తుఁడిచ్ఛాధీనవిగ్రహముగా మార్చి యామూర్తిని గన్నులారఁ గాంచుచు నాడుకొనును. అట్టిభక్తునకు భగవంతునిరూప మెట్టిదో తెలిసియే యుండును. భగవన్నామామృతమును బానముచేయుచుఁ బరదైవము తేజో

రూపమును గన్నులకఱవుదీఱఁగాంచుచు మహానందసాగరమున నోలలాడుసాధుచిత్తునకు శివకేశవాదిభేదములు గోచరింపవనుట సత్యము. అతఁడు సర్వమూపరమేశ్వరస్వరూపముగా భావించును. అట్టిభక్తులకు దేవాలయములుగాని విగ్రహారాధనములు గాని యిష్టములు కాఁజాలవు. దానియందాసక్తిగలవారలు పామరులనియే వారు భావింతురు. విశేషించి వారి నుద్ధరింపఁ బాటుపడుదురు. భక్తులకు ముఖ్యముగా యోగాభ్యాసము చేయు నలవాటుండవలయును. ధ్యానమున కది మిగులసాయపడును. "మనస్సు చంచలమైనది. దాని నెట్లు నిలుపవలయును" అను నర్జునుని ప్రశ్నమునకు భగవంతుఁడు బదులిడుచు "యోగాభ్యాసవైరాగ్యములే దాని నిలుపునవి" అని యుపదేశించెను. పాషాణాదులఁ బూజించుచు నది మోక్షసాధనమని భ్రమపడరాదు. ధ్యానము విశేషించి చేయఁగా మనోగతుని నెల్లతావులఁజూచునదియే ఫలముగాఁ బొడకట్టును. అట్టి ఫలముగలుగనిచో నాధ్యానము చాలదని యెఱుంగవలయును. మరలమరల నిట్లే చేయుచు సేవస్తువుం గాంచినను భగవద్రూపముగాఁ గనునట్టిపద్ధతికి రావలయును. అదియే భక్తికి ఫలము. అట్లుగాక మ్రొక్కినతాతికే మ్రొక్కుచుఁ గట్టినదేవాలయముల నెల్లం జూచుచు వింజామరల వీచుచుఁ బ్రసాదము నారగించుచు భగవత్ప్రసాదము మధురమని తలంచుచు నుండిన నెన్నిజన్మములకైన నతఁడు తరింపఁజాలఁడు. భగవంతుని నామము మధురముగా నెప్పుడు మనస్సునకుఁ దోఁచునో యది దైవప్రసాదముగాని జీతమునకై పూజించువాఁడు సిద్ధముచేసిన యన్నము భగవత్ప్రసాదముకాదు. దీనికి ఫలము క్షున్నివృత్తియే. నిజమగు భగవత్ప్రసాదమునకు ఫల మాశానివృత్తియే.

ఈవిషయమున భక్తుఁడు మిగుల జాగరూకుఁడై యుండవల యును. నామధారు లెందఱో నిష్ఫలప్రయత్నముల నొనరింపఁ బురికొల్పుదురు. మంత్రముల నుపదేశింతురు. ఏవేవో కథలను బోధింతురు. ఏవేవో పాటలు పాడుదురు. భక్తులచరిత్రముల నిట్టివానినే యుపన్యసింతురు. పాండురంగస్వామి మంగలి వేషమున భక్తున కొక్కనికి క్షౌరముచేసిపోయెననియు, తల్లి లేనిపిల్లకుఁ బాలిచ్చెననియు నిట్టి వెన్నియో గాథలఁ దెలుపు దురు. ఆకథ లబద్ధములనిమాత్రము మనము భావింపరాదు.

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్."

అని భగవంతుఁడు చెప్పియేయున్నాఁడు. "సతతయుక్తానామ్" అనఁగా సర్వకాలము నాయందే మనస్సునిలిపియుండు యోగు లకని యర్థము. అట్టిభక్తుల కఖిలవిధముల సాయపడియే యుండును. కాని మన మట్టివారము కావలయు. విగ్రహార్చన మున నాస్థితి రానేరదు. ధ్యానమునఁనే ఆస్థితి గలుగును. కావున నీపాషాణపూజనముమాని తేజోరూపుఁడగు సర్వేశ్వ రుని ధ్యానింపవలయును. ఇదియే భక్తునికృత్యము. దాన నా యతఁడు సంగరహితుఁడై పరమేశ్వరునికృపకుఁ బాత్రుఁ డగును

## రిక్తవాదములు.

కొందఱు తమకున్నమతాభిమానమును గనఁబఱచు నెపమున నితరమతస్థుల కుపాస్యులగు దేవతల దూఱుదురు. దానఁ దమమతాభిమానము వెల్లడియగునని వారిభావ మేమో. కాని యవి వ్యర్థప్రయత్నము. దానఁ దమకు మేలు

లేకపోవుటయేగాక కీడుకూడఁ గలుగును. ఒక్కనియమమునే యవలంబింపవలయును. కాని యెప్పటి కేదితోఁచునో యప్పటి కది మాటలాడరాదు. శివుఁడు కొనియాడినందున శ్రీరాముఁడు సర్వోత్తముఁడని భావించినపుడు విష్ణువు కొనియాడిన శివుఁ నుత్తమోత్తముఁడని యేల భావింపరాదు? అట్లు భావించు వారి నాక్షేపించుటకుఁ గల హేతువేది? పురాణములయం దెన్ని తావులనో యట్లు కనఁబడుచుండ వానిని బాటింపక తమమాటనే సార్థకము చేయఁబూనుట కేమి న్యాయము గలదు? తమ మతము శ్రేష్ఠమని తమకుఁ దోఁచినట్లే యొరులకుం దోఁచునని యేల భావింపరాదు? అట్లు భావింపనివారిని భక్తు లనరాదు. భగవత్తత్త్వసహస్రాంశమును వారికిఁ దెలియ దనవలయును గదా. ఇట్లు వివిధవిధముల వాదించుటచే మనస్సు పంకిలమై దుర్వాద మొనరింపఁ బ్రయత్నించును. తదనుగుణము లగు యుక్తులనే నెమకుచుండును. పరవాదములయందలి సత్యము నరయఁజాలక స్వవాదము సత్యమని భావించును. ఒక్క చేయి యెంతసేపాడించిన నది చప్పుడు కానేరదని యట్టివారి మనస్సు గుఱుతింపఁజాలదు. కావున నట్టి దుష్కార్యముల నొనరించి తమసద్గతిని బోఁగొట్టుకొనరాదు. అట్టివాదములు చాలకాలము నిలువఁజాలవు. సత్యమెందుఁగలదో యామతమే నిలుచును ఆధారము లేనిలతవలె నట్టిమతము పరవాదప్రచండ వాతసంస్పర్శమునఁ బడిపోవును.

కావున భక్తుఁడు తనయభీష్టదైవమును భగవంతునిగా నమ్మి తద్భిన్న మీప్రపంచమున లేదని నిశ్చయించి బాహ్యపూజలు మాని నిశ్చలచిత్తమును యోగాభ్యాసమున నలవరించుకొని ధ్యానముచేయుచు నింద్రియనిగ్రహమున బద్ధాదరుఁడై

యుండవలయుననుట సారతమవిషయము. పూజ యనున దొక పాషాణవిగ్రహమునఁ జేయఁదగునని యెందును గానరాదు. ఉద్ధవునకు శ్రీకృష్ణమూర్తి యీవిషయమును దెలుపుచు

"యద్యదిష్టతమం లోకే యచ్చాపి ప్రియమాత్మనః,
తత్తన్ని వేదయేన్మహ్యం తదానంత్యాయ కల్పతే. ౪౦
సూర్యోఽగ్ని ర్బ్రాహ్మణో గావో వైష్ణవః ఖం మరుజ్జలం,
భూరాత్మా సర్వభూతాని భద్ర, పూజాపదాని మే. ౪౧
సూర్యే తు విద్యయా త్రయ్యా హవిషాగ్నౌ యజేత మాం,
ఆతిథ్యేన తు విప్రాగ్ర్యే గోష్వంగ యవసాదినా. ౪౨
వైష్ణవే బంధుసత్కృత్యా హృది ఖే ధ్యాననిష్ఠయా,
వాయౌ ముఖ్యధియా తోయే ద్రవ్యైస్తోయపురస్కృతైః. ౪౩
స్థండిలే మంత్రహృదయైర్భోగైరాత్మానమాత్మని,
క్షేత్రజ్ఞం సర్వభూతేషు సమత్వేన యజేత మాం. ౪౪
ధిష్ణ్యేష్వేతేషు మద్రూపం శంఖచక్రగదాంబుజైః,
యుక్తం చతుర్భుజం శాంతం ధ్యాయన్నర్చేత్సమాహితః. ౪౫
ఇష్టాపూర్తేన మామేవ యో యజేత సమాహితః,
లభతే మయి సద్భక్తిం మత్స్మృతిస్సాధుసేవయా. ౪౬
ప్రాయేణ భక్తియోగేన సత్సంగేన వినోద్ధవ,
నోపాయో విద్యతే సమ్యక్ప్రాయణం హి సతామహం." ౪౭
(శ్రీ భాగవతము. ౧౧ స్కం. ౧౧ అధ్యా.)

సూర్యుఁడు, అగ్ని, బ్రాహ్మణుఁడు, గోవులు, విష్ణుభక్తుఁడు, ఆకాశము, వాయువు, నీరము, భూమి, ఆత్మ సర్వభూతంబు లనునివి మదీయపూజాస్థానంబులు. సౌరసూక్తము ఉపస్థానాదులచే సూర్యునియందును, వేదపూత పురోడాశముచే నగ్ని హోత్రునియందును, ఆతిథ్యముచే బ్రాహ్మణునందును, గడ్డి

మొదలగువాని నిచ్చుటచేత గోవులందును, బంధుమర్యాదచే విష్ణుభక్తుని యందును, ధ్యాననిష్ఠచేత హృదయాకాశ మందును, ప్రాణదృష్టిచే వాయువునందును, తర్పణాదులచే జలమునందును, రహస్యమంత్రన్యాసములచేత భూస్థండిలము నందును, భోగములచే నాత్మయందును, సమత్వముచే సర్వ భూతములయందు, శంఖచక్రగదాపద్మములచేతఁ బ్రకాశించు నాలుగుభుజములుగల నన్ను సమాహితచిత్తుండై ధ్యానించి పూజింపవలయును. సమాహితచిత్తముగలిగి యిష్టాపూర్తముల నన్నే యారాధింపవలయును. ఇట్లుచేయువాఁడు నాభక్తిగలిగి దానిమహిమముచేత సాధువుల సేవించు భాగ్యమును నావిష యమైన జ్ఞానంబును బొందును. దీని సార మేమి?

భగవంతున కొక్కరూపమే యనునియమము లేదనియు నెందెందు సత్యము పరోపకారము మొదలగుసద్గుణము లుం డునో యవియన్నియు నుపాస్యము లగురూపములనియు నెవ్వరి కేరూపమున నిష్టనుండునో యారూపముననే యాసర్వేశ్వరు నుపాసింపవచ్చుననియు నాయారాధనముకూడ నొక్కవిధముగా నుండు నను నియమము లేదనియు, భక్తిగలిగి యెట్లు పూజించినను బరాత్పరుఁడు సంప్రీతుఁడగుననియు, నారాధించునపు డారూపమున సర్వేశ్వరుఁ డవతరించు నని తలంచుచుఁ బూజింపవలయుననియుఁ, దాఁబూజించు రూపమే శ్రేష్ఠముకాని యితరులు తనవలెనే పూజించుచుండు రూపము శ్రేష్ఠముకాదని భావింపరాదనియు, నట్లు భావించు వారలను సర్వేశ్వరుఁడు సర్వసాక్షి కరుణానీరధి ప్రేమింపఁ డనియు గ్రహింపవలయును. మఱియు నెవ్వరెవ్వరి కేయే పదార్థము లిష్టములగునో భక్తిమీఱ వాని నాదైవమునకు

సమర్పించిన భగవంతుఁడు తృప్తినొందుననియు, ద్రవ్యము లేదనికాని అమూల్యపదార్థములనే యీశ్వరుఁడు కోరుననికాని తలంచి విచారింపఁబనిలేదనియు, శ్రమపడి పదార్థముల సేకరింప నక్కఱలేదనియు భక్తినే శ్రమించి సంపాదించినఁ జాలుననియుఁ గలిగినపదార్థములలో నుత్తమములని తోఁచిన వానిని సమర్పింపవలయుననియుఁ దనకక్కఱలేనివాని నర్పించిన నతఁడు లుబ్ధుఁడగునుగాన నాతనిపూజ యీశ్వరుఁ డంగీకరింపఁడనియు,

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః." ౨౬
గీత. ౯ అధ్యా.

అను నుపదేశమున భగవంతుఁడే స్పష్టీకరించెననియు గ్రహింపవలయును. ఈయుపదేశమునుబట్టి మఱియొకరహస్యము మనము తెలిసికొనవచ్చును.

"యద్యద్విభూతిమత్సర్వం శ్రీమదూర్జితమేవ వా,
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్. ౪౧
అథవా బహునైతేన కిం జ్ఞానేన తవార్జున,
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్." ౪౨
(గీత. ౧౦ అధ్యా.)

అని శ్రీకృష్ణమూర్తి యర్జునున కుపదేశించెను. అందే "జ్యోతిషాం రవిరంశుమాన్" అనియుఁ దెలిపెను. తేజోగోళములలో సూర్యగోళ ముత్కృష్టము.

"తేజసాం గోళకస్సూర్యో గ్రహర్క్షాణ్యంబుగోళకాః."
(ఖగోళాధ్యాయము.)

అని జ్యోతిశ్శాస్త్ర మనువదించెడిని. భగవంతుని దేజోరూపునిగ యోగులు ధ్యానింతురు. కావుననే యుద్ధవునకు నర్చారూపములలో "సూర్యోఽగ్నిః" అని తొలుతనే భగవంతుఁడు బోధించెను. "సూర్యేతు విద్యయా త్రయ్యా" అని పూజావిధానమును బోధించెను. వేదమంత్రములచేత సూర్యమండలాంతర్వర్తి యగు తేజోరూపమును భగవంతునిగా నిశ్చయించి పూజింపవలయు ననఁగాఁ దాత్పర్యమేమి? బాహ్యపూజయందుత్తీర్ణులయినవారు జ్యోతిర్మండలమును వేదమంత్రములచే వినుతింపవలయుననియు, నామండలమును భగవద్రూపము విశేషించి ప్రకాశింపఁజేయుచుండుటంబట్టి యందుఁగలపరమేశ్వరుకళ యత్యధికమనియు దానిని జక్కఁగా నారాధించుటయే యుత్తమమనియు నట్టివారు ధన్యులనియుఁ దాత్పర్యము.

"ధ్యేయస్సదాసవితృమండలమధ్యవర్తీ నారాయణస్సరసిజాసనసన్నివిష్టః"

అని పెద్దలు పల్కిరి.

"యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున,
న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్." 39
౧౦ అధ్యా.

అని పరమాత్మ యర్జునున కుపదేశించెనుగదా. ఇది యొక యారాధనవిశేషము. అగ్నియందుఁ బవిత్రతమపదార్థముల హోమము జేయు టొకయారాధనభేదము. జ్ఞానియగువిప్రునకు నాతిథ్య మొసఁగుటయు నొకయారాధనమే. అనఁగా నాతనియందుఁ గలభగవత్కళ నిర్మలముగాఁ బ్రకాశించును. తన యింటికే తెంచినభూసురప్రవరుని విధివిహితవిధానమునఁ నర్చించి తనకున్నంతలో నుత్తమపదార్థములఁ దృప్తిచేయుటయు, నారా

ధనమనఁగా నాతని భగవత్స్వరూపునిగా భావించి యారాధింప వలయుననియూ, వేఱుభావనచే నర్పించిన లాభమత్యల్పమనియు సారము. ఇన్ని భేదములుగా భగవదారాధన మొప్పుచున్నది. ఇట్లు చెప్పుటచేఁ దేలినసార మేది?

సమాహితచిత్తమున నేరూపమునుగాని దనకుఁ దృష్టిగా నున్నదానినే యాసర్వేశ్వరుఁడని భావించి యర్చింపవలయును. పుష్పములచేఁ బూజించుటయే యారాధనము కాదు. నిర్మలచిత్తమున ధ్యానించుట యందు ముఖ్యము. నిర్మలచిత్తము లేక చేసినది వ్యర్థమనరాదుకాని యత్యల్పఫలద మనవలయును. ఈవిషయమున నొకవిశేషము కలదు.

"యోషాతిరూపసంపన్నా గర్వితా మదశాలినీ,
మమ రూపైవ సా జ్ఞేయా పుష్పేనాపి న తాడయేత్."

అని మహాకాళి యాదేశించెను.

"యద్యద్విభూతిమత్సర్వం శ్రీమదూర్జితమేవవా,
కీర్తిశ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా."

అని శ్రీకృష్ణమూర్తి పలికినభావమే యిదియు నని దేవానాంప్రియు లెఱుంగరు. అట్టి కాంతారూపమును దిలకించి జగన్మాతగా భావించినపు డద్దానికంటె జితేంద్రియత్వమున కుదాహరణమేది! జగన్మోహనరూపమును జక్కఁగాఁ జూచినపు డిందు భగవత్కళ యీరీతిగా నున్నదని భావించి దాని నారాధించుట పూజావిశేషము కాదనువారు మొండిపట్టుదలగలవారనుటకంటె మంచిమాట కానరాదు. మతాభిమానమున నొండె, మతతత్త్వానభిజ్ఞతనొండె వారట్లందురు. కాని యితరమతములయందుఁ గలసారమేదని విమర్శించినఁగాని స్వమత

తత్త్వము తెలియఁబోదు. అట్లు విమర్శింపక మొండివాదము చేయువారినే మోఱకులందురు. ప్రాజ్ఞులు వారియాక్షేపముల లెక్కఁగొనరాదు వారింగూర్చి కరుణాంతరంగులు కావల యును. కాని వారిమతమును మార్పఁ బ్రయత్నింపరాదు. ఏలన

"న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసంగినామ్,
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరన్." ౨౬
3 అధ్యా.

ఆత్మజ్ఞానసంపన్నుఁడు కర్మాసక్తిగల మూఢులబుద్ధిని మరలింప రాదు. తనకు ఫలములం దపేక్ష లేకున్నను దాఁ గర్మములను జేయుచు వారిచేతను జేయింపవలయు. అను భగవద్గీతోక్తి కలదుకదా. దానిని దలఁదాల్పవలయును. పై విధముగా ధ్యానించువారికి భగవంతుఁడే యన్నిరూపములయందుఁ గానంబడును. అది ధ్యానఫలమని భగవంతుఁడు "సర్వత్ర సమదర్శనః" అన్నమాటచేఁ దెలిపెను. ఎప్పుడు భగవత్కళను సంభావించి ధ్యానింప నేర్చుకొనునో యామానవుఁ డప్పుడు పరమతముల దూషింపఁడు దూషింపవలయునన్న యూహయే యాతనికిం గలుగదు. ఇప్పట్టున శాక్తసమ్మతమగు భగవదారా ధనము నించుక తెలిపెదను.

## శాక్తులభక్తి.

మనోనిగ్రహమునకు శాక్తమతధర్మమును మించినది లేదు. దానితత్త్వ మేదియనియైన విమర్శింపఁబూననిబాలిశులు దాని నాక్షేపింతురు. సురాపానము మాంసభక్షణము శాక్తమని వారి భావము. అట్టిదోషముల నొనరించువారెల్లమతములయందును

గలరు. వారింబట్టి తన్మతమును దూషింపరాదు. దూషించుట పాపము నార్జించుహేతు వగును. భక్తునకు జితేంద్రియత్వము ప్రధానము. అది మాటలచే దేటపడునదికాదు. ప్రవృత్తిపై నది యాధారపడియుండును. అనుభవవేద్యము కావలయునని దీనిసారము. మనోదార్ఢ్యము సుందరవస్తుదర్శనాభావసమయమున నెల్లరకు నుండును. మనోహరములగు వస్తువులఁ గాంచినపు డదియుండునా లేదా యని విమర్శించుకొనవలయును. ఎవరికి వారే విమర్శకులు. అంతియకాని యితరులు విమర్శింపఁజాలరు. బాహ్యచిహ్నములంబట్టి విమర్శించి తెలిసికొన్న నదియెల్లరయం దొక్కరీతిగా నుండదుగాన నా విమర్శము కేవల సత్యసమ్మతమన రాదు. వేదాంతశాస్త్రము చదివి యితరులకు నీషణత్రయము వదలవలయునని బోధించువారు పెక్కండ్రు కలరు. కానియందు ధనమందుఁగల యాశవదలినవా రెందఱుందురు? లక్షసంఖ్యలో నొక్కఁడుమాత్ర మేయుండును. ద్రవ్యరాశిం గాంచినపుడు గ్రహింపవలయు ననునూహ కలుగక యుండిన నతఁడే తత్త్వవేత్త. ఆయూహ కలుగలేదని యితరు లెఱుంగుట కష్టము. కొందఱు వంచకులు దురాశకు లోఁబడనట్లు నటింతురు. కావునఁ దనమేలునకుఁ దానే కర్త. కీడునకుంగూడ నట్లే.

భక్తుఁడు ప్రకృతి నొకస్త్రీవ్యక్తిగా భావించి యుపాసించునపుడు శాక్తుఁ డనఁబడును. పురుషవ్యక్తిగా భావించి యారాధించునపుడు శైవవైష్ణవాదిభేదములలో నొక్కదానికిం జేరినవాఁ డనంబడును. పరతత్త్వమునకు స్త్రీపున్నపుంసక విభేదములు కల్పితములు. ఆతత్త్వమునకు రూపభేదకల్పనయు యథార్థముకాదు. ధ్యానసాధ్యము కావలయునని భక్తుఁడ స్పష్ట

రూపమును గల్పించుకొనును. కల్పించుకొన్న యారూపము నందు స్త్రీపున్నపుంసకభేదములంబట్టి తారతమ్యము కలదనుట కవకాశమేc గలదా. లేనియవకాశమును గల్పించుకొని దూషించుటకంటె వెఱ్ఱిపని యేముండును?

పురుషవ్యక్తిని గాంచునపుడు జగన్మోహనాకారముగ నదియున్నను మనస్సు చలించుటకుc బూరుషుల కవకాశమే లేదు. మనస్థైర్యము పరీక్షింపcగోరుభక్తుcడు దానిc జెకలించు వ్యక్తిని గాంచవలయును. భగవంతుని యాకృతి యొకానొక సుందరకాంతామణిగాc గల్పించుకొని దానిని ధ్యానించుచు నట్టివ్యక్తి చక్షుర్గోచరము పలుసారులగుచుండcగా దాని నుపాస్యదేవతగా నెవ్వcడు భావించునో ప్రమాదము నొందక యుండునో వాcడు జితేంద్రియుc డనంబడును. అట్టి జితేంద్రియత్వపరీక్షార్థమే భక్తుcడు ప్రాగుక్తశ్లోకానుసారిరూపమును బ్రార్థించి పిలుచుకొనివచ్చి పరదేవీబుద్ధితో విధిప్రకారము పూజింపవలయును. ఆపూజాకాలమున నేమాత్రము మనస్సు చలించిన నాశమే కలుగునని విధి శాసించెడిని. అట్టితఱి నా సుందరవ్యక్తి నారాధించి మహాకాళిగనో, లలితాంబగనో మఱియొకనామముగలదేవిగనో విశ్వసించి దృఢభక్తి నారాధించిన నద్దానికంటె సముచితమార్గ మేదియుండును? కావు ననే కన్యాపూజయు సువాసినీపూజయు శాక్తమతమునc జెప్పcబడినవి. చక్రరాజార్చనము లేక కన్యకాపూజయు, లేక సువాసినీపూజయు సమానములే కాని చక్రరాజార్చనము చేయుచు నీపూజలను జేయవలయుననుట సంప్రదాయ సిద్ధము.

"బ్రాహ్మణో మదిరాం దత్వా బ్రాహ్మణ్యాదేవ హీయతే."

అని కాళికావచనముకలదు. సర్వభేదముల చేతను సురాపానము విప్రునకు నిషిద్ధము. కావున నిషిద్ధమగుసురను నాకు నివేదించిన బ్రాహ్మణుఁడు పతితుఁడగును. అని కాళదేవియే పలికెను. అనఁగా శాక్తతంత్రములు సర్వజాతులకు ననుకూలించును. విశేషించి విప్రులకు శుభాగమపంచకము సదాచారముల బోధించుటకే చెప్పఁబడినది. అందు వేదోక్తపద్ధతులే నిర్ణయింపఁబడినవి. స్మృత్యుక్తధర్మములకు విరుద్ధములగుధర్మములు చెప్పఁబడ లేదు. వేదాధికారము లేనివారలకుఁ దంత్రములు చెప్పఁబడినవి. మాంసభక్షకులకు మాంసము భగవతికి నివేదింపవలయునని బోధించునవియే తంత్రములు. విశేషించి యవి వేదాధికారవిహీనులకు వలయుధర్మములనే బోధించును. కావున శాక్తధర్మముల దూషించువారు తద్గ్రంథములఁ బరిశీలింపనివారనియే యెఱుంగవలయును. ఈవిషయము శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యకృతసౌందర్యలహరియందు

"చతుష్షష్ట్యా తంత్రైస్సకలమతి సంధాయభువనం
స్థిత స్తత్తత్సిద్ధి ప్రసవపరతంత్రైః పశుపతిః,
పున స్త్వన్నిర్బంధా దఖిలపురుషార్థైకఘటనా
స్వతంత్రం తే తంత్రం క్షితితల మవాతీతరదిదం." 31

తా. "ఓపరదేవీ! ఈశ్వరుఁడు సకలప్రపంచమును, ఆయాసిద్ధుల నొసంగుటయందు శక్తిగలయఱువదినాలుగు తంత్రములను రచించి యూరకుండెను. మరల నీవు బలవంతముగా నడుగుటచేత ధర్మార్థకామమోక్షము లనఁబడు నాల్గు పురుషార్థములను గల్గఁజేయుటయందు సామర్థ్యముగల నీయా

రాధనవిశేషములను దెలుపుసిద్ధాంతమును భూమిపై నవతరింపఁ జేసెను." అను నీశ్లోకవ్యాఖ్యానావసరమునఁ బండితేంద్రుఁడు శుభాగమపంచకస్వరూపము చక్కఁగా వెల్లడించెను. ఇట్టివిషయముల నెఱుంగక యాక్షేపించువారల కన్నిమతములు ధర్మవిద్ధములుగనే తోఁచును. ఎన్నియో పురాణములు కలవు. స్మృతులుగలవు. కాని వానిని జక్కఁగా నన్వయించుకొని సమదృష్టిగలవాఁ డగుట దుర్లభము.

"అమంత్రమక్షరం నాస్తి నాస్తి మూలమనౌషధం,
అయోగ్యః పురుషో నాస్తి యోజకస్తత్ర దుర్లభః." (శుక్రనీతి.)

అన్నయట్లు సకలగ్రంథములభావ మేదియని నిష్పక్షపాతమతిఁ బరిశీలించువారే యరుదుగ నుందురు. అట్టివారల కీభేదవాదములు సరిపడవు. వారు సారమునే గ్రహింతురు.

విశేషించి శాక్తమతమున యోగవిద్య ప్రధానము. త్రిపురాసారసముచ్చయమున ననేకసులభోపాయములు యోగాభ్యాసమున సూచింపఁబడినవి. శంకరభగవత్పాదులు సౌందర్యలహరియందు సమయమతమునే బోధించిరి. సమయమతమున బాహ్యపూజాదులు లేవు. షట్చక్రముల నాయాయివిధములఁ బరాంబ నారాధించుటయే. అదియు యోగప్రధానముకాక తప్పదు.

"సుధాధారాసారైశ్చరణయుగళాంతర్విగళితైః
ప్రపంచం సించంతీ పునరపి రసామ్నాయమహసః,
అవాప్య స్వాం భూమిం భుజగనిభ * మధ్యుష్టవలయం
స్వమాత్మానం కృత్వా స్వపిషి కులకుండే కుహరిణి. ౧౧

* అధ్యుష్టవలయం = అధిష్ఠితకుండలీనామక విశేషం అనివ్యాఖ్యా.

అత్రేదమనుసంధేయమ్, శిరస్థ్సితచంద్రమండలం సర్వయోగినాం సిద్ధం, తత్తు సమయినాం మతే శ్రీచక్రమేవ. అతశ్చ శిరస్థిత సహస్రకమలాంతర్గత శ్రీచక్రాత్మక శశిబింబమధ్యస్థితాయా భగవత్యాశ్చరణకమల నిర్గతజలైః సుధామయైః స్సాధకస్య సకలం శరీరం సంప్లావ్య పునర్భుజగ రూపేణాధారకుండలం ప్రవిశ్య సుషుమ్నామవష్టభ్య సా భగవతీ స్వపితీతి. వామకేశ్వరతంత్రే."

"భుజంగాకారరూపేణ మూలాధారసమాశ్రితా,
శక్తిః కుండలినీనామ బిసతంతునిభా శుభా.
మూలకందం ఫణాగ్రేణ దష్ట్వా కమలకందవత్,
ముఖేన పుచ్ఛం సంగృహ్య బ్రహ్మరంధ్రం సమన్వితా.
పద్మాసనగతస్స్వస్థో గుదమాకుంచ్య సాధకః,
వాయుమూర్ధ్వగతం కుర్వన్ కుంభకావిష్టమానసః,
వాయ్వాఘాతవశాదగ్నిస్స్వాధిష్ఠానగతో జ్వలన్.
జ్వలనాఘాతపవనాఘాతైరున్నిద్రితోఽహిరాట్,
రుద్రగ్రంథిం తతో భిత్వా విష్ణుగ్రంథిం భినత్త్యథ,
బ్రహ్మగ్రంథిం చ భిత్త్వైవ కమలాని భినత్తి షట్,
సహస్రకమలే శక్తిః శివేన సహ మోదతే,
సాదావస్థాపరాజ్ఞేయా సైవ నిర్వృతికారణమ్." ఇతి.

శ్రుతిరపి భగవత్యాశ్చరణాంబుజసుధాధారా-సారైః ప్రపంచసేచనం ప్రతిపాదయతి తథాహి.

"లోకస్య ద్వారమర్చిమత్పవిత్రం
జ్యోతిష్మద్భ్రాజమానం మహస్వత్,

అమృతస్య ధారా బహుధా దోహమానం
చరణం నో లోకే సుధితాం దధాతు.

అస్యార్థః లోకస్య నివాసస్థానస్య సాయుజ్యస్య వాసార్ష్ట్యాదేర్వా బ్రహ్మ లోకాదేర్వా ద్వారం తత్ప్రాపకమిత్యర్థః. అర్చిమత్ అర్చీంషి మయూఖా అస్య సంతీత్యర్చిమత్. అర్చిష్మదిత్యర్థః. ఛాందసస్సకారలోపః. మయూఖాః కిరణాః పవిత్రం స్వయమతిశుద్ధమ్. అస్య శుద్ధిహేతుశ్చ, జ్యోతిష్మద్భ్రాజమానం మహాస్వత్, ఇత్యామ్రేడనం, అర్చిష్మత్త్వంతు తథ్యమిత్యర్థః. యద్వా త్రిఖండం మాతృకాచక్రం సోమసూర్యానలాత్మకమితి వక్ష్యతే. అర్చిష్మదిత్యనేన బైందవాని షట్త్రింశదుత్తరశతం జ్యోతీంషి వినిర్దిశ్యంతే. మహాస్వదిత్యనేన భానవీయాః షోడశోత్తరశతం మహాంసి కిరణాస్సంగృహ్యంతే, ఏతచ్చ క్షితౌ షట్పంచాశదితి శ్లోకవ్యాఖ్యానావసరే నిపుణతరముపపాదయిష్యామః. అమృతస్య ధారాః సుధాప్రవాహాన్, బహుధా బహుప్రకారేణ సప్తతిసహస్రనాడీమార్గేషు దోహమానం కిరత్ చంద్రమండలసుధాగతసుధారసప్రవాహాన్ స్వనిర్ణేజనపవిత్రితాన్ వర్షదిత్యర్థః. తచ్చరణం చరణశబ్దోనపుంసకః. పదంత్రిష్వచరణోఽస్త్రియామిత్యభిధానాత్. నః అస్మాన్ సాధకాన్ లోకే ప్రపంచేసుధితాన్ దధాతు, తృప్తాన్ కరోతు. యద్వా సంజాతబుద్ధిప్రకాశాన్ సుధియః కృత్వా దధాతు. పుష్ణాతు. నన్వయం మంత్రః క్వచిదిష్టిషు యాజ్యత్వేనామ్నాతం, మంత్రాణాం సమవేతార్థప్రకాశనశీలత్వాత్ చరణాయస్వాహేత్యర్థోపహితశబ్దస్యైవ దేవతాత్వాత్ త్వదుక్తవ్యాఖ్యా న సంగచ్ఛత ఇతిచేత్ ఉచ్యతే, అత్రాహుర్భగవత్పాదాః సి మన్నం పరిత్యజ్య భిక్షామటతి దుర్మతిరితి. అయమాశయః, వేదస్య సకర్తృకత్వే సిద్ధే ఫలదానసమర్థత్వేన సర్వవిద్వదభిమతం వృద్ధవ్యవహారావగతశక్తికం లోకస్య ద్వారమిత్యాదివిశేషవిశిష్టత్వార్హం భగవత్యాశ్చరణమేవ చరణాయ స్వాహేత్యత్ర చరణశబ్దేనాభిధీయత ఇతి."

అని లొల్ల లక్ష్మీధరదేశికులు.

అభీష్ట దేవతాధ్యానమున యోగము ప్రధానమనియు బాహ్య పూజకంటె మానసికపూజ యుత్తమమనియు స్పష్టమయ్యెను. కేవలశాస్త్రసిద్ధముకాక శ్రుతిప్రమాణసిద్ధమనియు సంస్పష్టము. శాక్తము దుర్మతమను నీచవాదము దీనిచేఁ బలాయితము. భగవత్త్వమనిర్వాచ్యము కావున నాతత్త్వము సగుణముగా నుపాసించుటయే ముక్తికారణము. ప్రాసాద నిశ్రేణికాన్యాయానుసారము సగుణనిర్గుణోపాసనము లుండునని యెఱుంగుట బుద్ధిమంతులలక్షణము. కావుననే

"నాస్తి సాంఖ్యసమం జ్ఞానం నాస్తి యోగసమం బలమ్."

అని సాంఖ్యప్రవచనభాష్యమున విజ్ఞానభిక్షువు చెప్పెను. తస్మాద్యోగీ భవార్జున" అని శ్రీ కృష్ణమూర్తి యుపదేశించెను.

శాక్తమునకు యోగశాస్త్రమునకు సంబంధమే లేదని కొందఱందురు. యోగాభ్యాసము లేక భగవత్యారాధనము చేయ వలనుపడదని యెఱుంగవలయు.

"లంబోదరం చ కథయామి గురూపదిష్ట
మారాధనక్రమమహం కులనాయికాయాః. ౨
సంయోజ్య జీవమథ దుర్గమమధ్యనాడీ
మార్గేణ పుష్కరనివిష్టశివే సుసూక్ష్మే,
హంసేన దేహమమరేంద్రపురోగ
సార్ధేందునా భసితసాద్విదధీత మంత్రీ. ౪

౧ పటలము.

ఇహ రేచకపూరకౌ విహాయ స్థిరధీః కుంభకమేవ కేవలం యః,
సతతం కురుతే మనోజవత్వం లభతే వీతజరామయస్సమర్త్యః. ౩౨
న హి తస్య సుదుర్లభం త్రిలోక్యా మిహ యః కేవలకుంభకే నిమగ్నః,
అణిమాదిగుణాష్టకం కరస్థం నను తస్యైవ నిరస్తమృత్యుభీతేః. ౩౩

బహుధా కథితైర్మహేశ కిమేభి
ర్ద్వికచంచ్వా తు సమీరణస్య పానాత్,
జరసా సహ నాశమాశు యాతి
ప్రబలం మృత్యుకృతం భయం నరాణాం. ౪౦
జిహ్వాం కృత్వా ఽనాకులస్తాలుమూలే
దంతైర్దంతాన్ గాఢమాపీడయిత్వా,
మందం మందం యః పిబేద్గంధవాహం
సాధైః పూరైస్స్వకమంతస్స్పృశద్భిః. ౪౧
షణ్మాసాభ్యాసేన రోగైరశేషైః
పాపేభ్యోఽసౌ ముచ్యతే సాధకేంద్రః,
అబ్దాదేకాద్విశ్రసాం మృత్యుదూతీం
జిత్వా భూమౌ దీర్ఘకాలం స జీవేత్. ౪౨
వర్షత్రయాభ్యాసవశాదతీత మనాగతం వేత్త్యలినీలకేశః,
విషం న దేహే క్రమతే తదీయే దష్టోఽపి ఘోరైరపిపన్నగేంద్రైః."౪౩

౩ పటలము.

అని త్రిపురాసారసముచ్చయమున యోగాభ్యాస పద్ధతులు బహుప్రకారములుగాఁ జెప్పఁబడినవి. ఈవిషయమునే శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులు సౌందర్యలహరియందు

"మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహం
స్థితం స్వాధిష్ఠానే హృది మరుతమాకాశముపరి,
మనోఽపి భ్రూమధ్యే సకలమపి భిత్వా కులపథం
సహస్రారే పద్మే సహరహసి పత్యా విహరసి." ౯

అనుశ్లోకమునఁ దేటపఱచెను. పూజ యనఁగా మానసికపూజయేగాని బాహ్యపూజ యుత్తమఫలదము గాదని దీనిసారము. మానసికపూజ యనఁగాఁ గేవలధ్యానమే యగునని తెలియం

దగు. ఆపూజకు సేవస్తువు లక్కఱలేదు. ఇష్టదేవతారూప మును హృదయకమలమునందు నిల్పి యేకాగ్రదృష్టి నవలోకించుచు మహానందము ననుభవించుటయే యని తెలియందగు. ఈయుదాహరణములనుబట్టి శాస్త్రమనఁగా నెట్టిదో తెలిసికొని, దాని నవలంబింపఁ దలంపుగలవా రభ్యసింపవచ్చును. మత తత్త్వము నెఱుంగక దానిఁ దూలనాడుట మహాపాపకార్య మని తెలిసికొనుటయే యుత్తముల లక్షణము.

మఱికొన్ని ఫలస్తుతులను భక్తులయభిప్రాయభేదములం బరికింపందగు.

"అద్వైతవిద్యాధ్యయనం శంకరస్య చ సేవనం,
అవిముక్తపురే వాసో నాల్పస్య తపసః ఫలం,
శాస్త్రం శారీరమీమాంసా దేవస్తు పరమేశ్వరః.
ఆచార్యాశ్శంకరాచార్యాస్సంతు మే జన్మజన్మని." అనియుం,
"ఇహ యత్క్రియతే కర్మ తత్పరత్రోపభుజ్యతే,
సిక్తమూలస్య వృక్షస్య ఫలం శాఖాసు దృశ్యతే.
అద్య శ్వో వా మరిష్యంతి విచరిష్యంతి కౌరవే,
హరిం యది స్మరిష్యంతి తరిష్యంతి భవార్ణవమ్." అనియుం,
"కామాద్గోప్యో భయాత్కంసో ద్వేషాచ్చైద్యాదయో నృపాః,
సంబంధాద్వృష్ణయస్స్నేహాద్యూయం భక్త్యా వయం ప్రభో.
ధ్యాయేన్నారాయణం దేవం స్నానాదిషు చ కర్మసు,
ప్రాయశ్చిత్తం హి సర్వస్య దుష్కృతస్యేతి వై శ్రుతిః.
ఆలోడ్య సర్వశాస్త్రాణి విచార్య చ పునః పునః,
ఇదమేకం సునిష్పన్నం ధ్యేయో నారాయణ స్సదా." అనియుం,
పృథ్వీ రేణురణుః పయాంసి కణికాః ఫల్గుస్స్ఫులింగోఽనల
స్తేజో నిశ్వసనం మరుత్తనుతరం రంధ్రం సుసూక్ష్మం నభః,

క్షుద్రా రుద్రపితామహప్రభృతయః కీటాస్సమస్తాస్సురాః,
దృష్టే యత్ర సతావకో విజయతే భూమావధూతావధిః." అనియు,
జ్ఞానతోఽజ్ఞానతో వాపి వాసుదేవస్య కీర్తనాత్,
తత్సర్వం విలయం యాతి తోయస్థం లవణం యథా." అనియు,
వనే చరామో వసు చాహరామో నదీం తరామో నభయం స్మరామః,
ఇతీరయంతోఽపి వనే కిరాతాః ముక్తిం గతా రామపదానుషంగాత్."
అనియు, ఇంక నిట్టి వెన్నియో ఫలస్తుతులు గలప్రమాణములు కానంబడును.

"శృణుధ్వం పాండవాస్సర్వే వ్రతానాముత్తమం వ్రతమ్,
రహస్యం సర్వపాపఘ్నం పుత్త్రపౌత్త్రప్రవర్ధనం,
వ్రతం సాంబశివేనైవ స్కందస్యోద్బోధితం పురా."

వినాయకవ్రతము.

"శృణుధ్వం మునయస్సర్వే వ్రతానాముత్తమం వ్రతం,
దుర్గా లక్ష్మీ మహాదేవీపూజనం నామ నామతః."

సరస్వతీవ్రతము.

"వ్రతానాముత్తమం నామ సర్వసౌభాగ్యకారణం,
సర్వసంపత్కరం శీఘ్రం పుత్త్రపౌత్త్రప్రవర్ధనమ్."

వరలక్ష్మీవ్రతము.

ఇట్లే వ్రతకల్పమున నన్నివ్రతములకు ఫలస్తుతులు కలవు. ఇందేది ప్రమాణము? ఏదియప్రమాణము? శంకరుఁడే యారాధ్యుఁడని కొన్నియు, వాసుదేవుఁడే యారాధ్యుఁడని కొన్నియు, అందును శ్రీకృష్ణుఁడే యుపాస్యుఁడని కొన్నియు, శ్రీరాముఁడే యుపాస్యుఁడని కొన్నియుఁ బ్రమాణము లగపడును. వ్రతము లన్నింటియందు నుత్తమ మిదియే యని చెప్పఁబడినది. "ఇదియే ప్రమాణము. వేఱొకటికాదు" అని పలుకరాదు.

అట్లు పల్కినచో నింకొక్కడివియన్నియు నప్రమాణములే యనును. ముకుందమాలయందు.

"క్షుద్రా రుద్రపితామహప్రభృతయః,"

అనుశ్లోకమున్నది. కులశేఖరాళ్వారు శంకరుని బ్రహ్మను క్షుద్రులనిరి. క్షుద్రశబ్దము నీచార్థముకాకున్న నల్పులను నర్థమిచ్చును. మతాభినివేశముననే యిట్లనుట. వారిభావమున శ్రీకృష్ణమూర్తియే పరదైవమనియుఁ దక్కుంగలవారు తద్భక్తులో తత్సేవకులో యనియు నైయుండును. ఇట్లే శంకరభక్తుఁడొకఁడు

"నీచా విష్ణువిరించినాకపతయః,"

అన్నచో నెట్లుండునో! భక్తులమానసములు నిర్మలములుగా నుండవలయు.

"సర్వభూతేషు యః పశ్యేద్భగవద్భావమాత్మనః,
భూతాని భగవత్యాత్మన్యేష భాగవతోత్తమః.
ఈశ్వరే తదధీనేషు బాలిశేషు ద్విషత్సు చ,
ప్రేమమైత్రీకృపోపేక్షా యః కరోతి స మధ్యమః.
అర్చాయామేవ తు హరేః పూజాం యశ్శ్రద్ధయేహతే,
న తద్భక్తేషు చాన్యేషు స భక్తః ప్రాకృతస్స్మృతః."

భాగవతము.

"త్వయా యదభయం దత్తం తద్దత్తమభయం మయా,
మత్తో విభిన్నమాత్మానం ద్రష్టుమర్హాసి శంకర,
యోఽహం సత్వం జగచ్చేదం సదేవాసురమానుషం,
అవిద్యామోహితాత్మానః పురుషా భిన్నదృష్టయః."

విష్ణుపురాణము.

"అహం త్వం సర్వగో దేవ త్వమేవాహం జనార్దన,
ఆవయోరంతరం నాస్తి శబ్దైరర్థైర్జగత్పతే.
నామాని తవ గోవింద యాని లోకే మహాంతి చ,
తాన్యేవ మమ నామాని నాత్ర కార్యా విచారణా." హరివంశము.

ఇట్లు బహువిధ ప్రమాణములు కానవచ్చుచున్నవి. వీనింబట్టిచూడఁగా సర్వభూతములందు భగవంతుని సమానదృష్టిం జూచువారే భక్తులనఁబడుదురు. అదిలేనిచో భక్తాధము లనఁబడుదురనియుఁ దేలెడిని. పురాణాదులఁ బరికించినను శివకేశవుల కభేదమే కనుపట్టెడు. కులశేఖరాళ్వారు లోనగువారు భక్తులలో నేకక్ష్యకుఁ జేర్పఁదగుదురో సాధువులే యూహింపఁగలరు.

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯
యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి. ౩౦
సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే. ౩౧
ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున,
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః." ౩౨

గీత. ౬ అధ్యాయము.

అను నీగీతాశాస్త్రముకూడఁ బై సిద్ధాంతమునే దృఢపఱుచుచున్నది. ఏమానవుఁడు భగవత్తత్త్వమును సర్వభూతములయందు సమానముగాఁ జూడఁజాలఁడో

"విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పండితాస్సమదర్శినః. ౧౮

ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః,
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః." ౧౯
గీత ౫ అధ్యా.

అను గీతాశాస్త్రము ననుసరించి యాలోచింపఁగా నామాన వుఁడు భక్తశ్రేణియందు లెక్కింపఁదగఁడు. భక్తియుండినట్లు కొందఱు నటింతురుగాని వారిమనస్సు దేవతలయందే ద్వేష మూనినచోట సమదర్శనత్వమున కర్హ్యముకాదు. కావున భగవ ద్వాక్యము ననుసరించి యోజించినను వారు భక్తాగ్రేసరులు కాఁజాలరు. "స భక్తః ప్రాకృతః స్మృతః" అన్న ప్రమాణము నను సరించి ప్రాకృతభక్తులనందగుదురు. మతాభిమానమున్న నుండ వచ్చునుగాని మతాంతరదూషణము చేయరాదు. విష్ణుభక్తి యుండవచ్చునుగాని శివదూషణము పనికిరాదు. విష్ణుపురాణ హరివంశములే యీభావమును స్పష్టపఱచుచున్నవి. శంక రునం దింత ద్వేషముఁగలవారు సర్వభూతములయం దాభగవ త్కళను సమానముగాఁ జూడఁగలరనుట గగనకుసుమము గదా. ఇఁక నుపనిషత్తుల నించుక పరికింతము.

"నారాయణాద్బ్రహ్మా జాయతే, నారాయణాద్రుద్రోజాయతే, నారా యణాదింద్రో జాయతే, నారాయణాత్ప్రజాపతిః ప్రజాయతే, నారాయణా ద్ద్వాదశాదిత్యారుద్రావసవస్సర్వాణిచ ఛందాంసి, నారాయణాదేవ సముత్ప ద్యంతే, నారాయణేప్రవర్తంతే, నారాయణేప్రలీయంతే. ఓమ్ అథనిత్యో నారాయణః, బ్రహ్మానారాయణః, శివశ్చ నారాయణః, శక్రశ్చనారాయ ణః, ద్యావాపృథివ్యౌచ నారాయణః, కాలశ్చనారాయణః, అథశ్చనారా యణః, అంతర్బహిశ్చనారాయణః, నారాయణఏవేదగ్ంసర్వం, యద్భూతం యచ్చభవ్యం, నిష్కళో నిరంజనో నిర్వికల్పో నిరాఖ్యాత శ్శుద్ధోదేవ

ఏకో నారాయణః, నద్వితీయోఽస్తి కశ్చిత్, యఏవంవేద, సవిష్ణురేవ భవతి సవిష్ణురేవ భవతి." (నారాయణోపనిషత్తు.)

"తదాదిమధ్యాంతవిహీనమేకం విభుం చిదానందమరూపమద్భుతం, ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలకంఠం ప్రశాంతం, ధ్యాత్వా మునిర్గచ్ఛతి భూతయోనిం సమస్తసాక్షిం తమసః పరస్తాత్. స బ్రహ్మా సశివస్సేంద్రస్సోఽక్షరః పరమస్స్వరాట్, సఏవ విష్ణుస్స ప్రాణస్స కాలోఽగ్నిస్సచంద్రమాః. ౭. సఏవ సర్వం యద్భూతం యచ్చ భవ్యం సనాతనం, జ్ఞాత్వా తం మృత్యుమత్యేతి నాన్యః పంథా విముక్తయే. ౮."

(కైవల్యోపనిషత్తు.)

నారాయణోపనిషత్తు నారాయణమూర్తియే సర్వమునని తెలుపుచున్నది. కైవల్యోపనిషత్తు శంకరుఁడే సర్వము నని తెలుపుచున్నది. ఇందేది ప్రమాణము? ఏది యప్రమాణము? రెండును బ్రమాణములా? రెండునుగావా? ఎట్లు సమాధానము చెప్పవలయును? అను ప్రశ్నము యుక్తమే.

ఈపురాణములు నుపనిషత్తులు నన్నియుఁ బ్రమాణములే. ఇందు బ్రమాణముకాని దొక్కయక్షరమైన లేదు. పరస్పరవిరుద్ధములగు విషయము లిందు లేవు. ఆలోచించువారి మనోదోషముననే యివి పరస్పరవిరుద్ధములుగఁ దోఁచును. కావున నాదోషము తొలఁగుటకుపాయ మొక్కఁడు కలదు. భగవంతుఁడు భక్తానుగ్రహార్థము వారివారికర్మముననుసరించి యనేకరూపములుకలవాఁడుగఁ దోఁచును. అందొక్కొక్కరి కొక్కొకరూపమునందుఁ బ్రీతి యుదయించును. వారు తద్రూపమును సంభావించి పూజింతురు. కనుకనే పురాణము లొక్కొక్కటియు నొక్కొక్క దేవతనే పరమాత్మగాఁ దెలుపును. పురాణ మేమనఁగా నేవా రేదేవత నారాధించిన నాదేవతా

రూపము కల్పితముగానఁ దద్రూపమున సాక్షాత్కరించిన భగవంతునిగా భావింపవలయు ననియును, ఇట్లే యాయాయి భక్తుల కర్చారూపమున నాసర్వేశ్వరుఁ డగపడుననియు, సర. రూపములు సర్వనామములు లాపరబ్రహ్మమునకుఁ జెల్లుననియు, నిందేమాత్రము తారతమ్యముగా భావింపరాదనియు, నేదేవ తారూపమును దూషించిన నాభగవంతునే దూషించినట్లగు ననియు, నంతకంటె దుష్కార్యము లేదనియు సారము. ఉపనిష త్తులు పురాణములు లోనగునవియన్నియు నీయాశయమునే వెల్లడించుచున్నవి. వ్రతకల్పములుకూడ నేవ్రతమును దెలుపు చున్న నావ్రతమే యుత్తమమని బోధించుట పైభావమును దెలుపుటకొఱ ఇట్లు సకలవిధప్రమాణము లాపరమేశ్వరుని మహత్త్వమును వేలువేలుగాఁ దెలుపుచున్నవి. అంతియకాని యీదేవతకంటె నాదేవత యుత్తమమని బోధించి భగవద్భక్త మగు సమదర్శనత్వమును జెడఁగొట్టఁబూనలేదు. ఇదియే యిం దుఁగలసారము. ఈసారమును మదినిల్పినచో నిట్టి భేదబుద్ధికిఁ గాని మతాంతరదూషణమునకుఁగాని యవకాశ మించుకంత యులేదు. కొందఱు దుర్మతాభిమానమున నోటికివచ్చినట్లు పరమతమును దూఱుచు నంతతో నూఱకుండక దేవతల నాక్షేపింతురు. సర్వజ్ఞులవలె వేదార్థ మిది యని బోధింతురు. కాని వారి కించుకంతయుఁ బరతత్త్వజ్ఞానము లేదనవచ్చును.

ఒక్కభక్తుఁడు రంగనాథుని బరమాత్మ యనును. ఇంకొ క్కఁడు శ్రీకృష్ణుఁడే పరమేశ్వరుఁ డనును. వేఱొక్కఁడు సీతా రాముఁడే భగవంతుఁడని గంతులువేయును. మఱియు నొక్కఁ డుశంకరుఁడే పరదైవమని నాట్యముచేయును. ఇంకనొక్కండు త్రిపురసుందరియే పరమేశ్వరి, త్రిలోకజనని, త్రిమూర్తులకుఁ

దల్లి యని పలికి పరవశత్వము నొందును. ఇట్లే యొందఱో యెన్నియో పేరులఁ దెలుపుదురు. తమరు చెప్పినపేరు గలదైవ మును దప్ప నింకొక్కపేరునఁ బిల్వఁబడు నాపరదైవమునే ప్రేమింపరు. తక్కుంగలవారెల్ల నింతకంటెఁ దక్కువయని వారితాత్పర్యమై యుండనోపు.

చరామః ఆహారామః తరామః స్మరామః. అనుమొద లగుపదముల వేఱొక్కయర్థమునఁ బ్రయోగించి బోయలు అందుఁ గలరామః అనుపదము నుచ్చరించినందునఁ గలిగిన పుణ్యమున ముక్తిని బొంది రనఁగా నర్థమేమి? ముక్తి యంత సులభమైనచో నెల్లరకు లభింపవచ్చును. గీతాశాస్త్రమున శ్రీకృష్ణభగవంతుఁడు.

"మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః." ౨
౧౨ అధ్యా.

"మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్మదాశ్రయః,
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు. ౧
మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే,
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః." ౨
౭ అధ్యా.

"మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః." ౮
౧౨ అధ్యా.

"మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః,
భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయం." ౧౩
౯ అధ్యా.

"మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే,

సగుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే." ౨౬
౧౪ అధ్యా.

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్." ౨౨
౯ అధ్యా.

అను నీ యుపదేశములమూలమున నయుక్తులై నన్నే ఱింగి దృఢభక్తిగలిగి నన్నే స్మరింపవలయునని బోధించెను. మాటలసందడిలో వచ్చినయక్షరములకూర్పు భగవన్నామము కాఁగా దాని నెఱుంగక దురుద్దేశముగా నుచ్చరించియుఁ దన్నామమహిమమున వారుత్తమజన్మమునుగూడ నొందక తటాలున నెగిరి ము ` నమును బట్టుకొని వ్రేలాడుదురనుట యసంగతప్రసంగముగాక మతేమగును? ఈశ్లోక మప్రమాణ మాయన్నఁ గాదు. ఇట్టి శ్లోకములు పామరులకు భగవన్నామ మును స్మరించుటకు నాసక్తికలుగఁజేయ నేర్పడినవి. అంతియ కాని వ్యర్థములుకావు. ఇవియే సత్యములగుచో మహర్షులు శ్రమించి తపస్సు చేయ నక్కఱలేదు. ఉపవాసాదు లక్కఱ లేదు. హాయిగా భుజించి తాంబూలమువేసికొనుచు నొక్క సారి నారాయణా యనికాని, రామా యనికాని కృష్ణా యని కాని మహాదేవాయనికాని యుచ్చరించిన సకలపాపములు తొ లఁగిపోవుటయేకాక మంచివిమానముకనఁబడఁగా నందుఁగూరు చుండిన యుత్తరక్షణమున ముక్తిపదము చేరవచ్చును. సకలసు ఖము లందమరును. ఇంతసులభోపాయము కనఁబడుచుండఁగా మహర్షులు విశేషశ్రమసాధ్యమగు తపస్సేల చేసిరో తెలియ కున్నది. లోకముల డాంబికులర్థార్జనతత్పరు లిట్టిశ్లోకములనేర్చు కొని పామరులకు బోధింతురు. ధారలకుటుంబపోషణార్థ

మివి యేర్పడినవని కొందఱందురు. కాని పామరుల నుద్ధరింపనే యివి యేర్పడినవి. వీనిచే క్రమక్రమముగా భక్తి దృఢపడును. తొలుదొలుతఁ బామరులు ఫలము నాశించువారు. తన్మూలమునఁ బ్రాకృతకర్మము మంచిదైన భక్తి కుదురును. దాన భగవత్సేవ చేయునూహ విశేషించి కలుగును. క్రమముగా సత్కర్మానుష్ఠానము చేసి వారు తరింతురు. ఈవిషయము నీక్రింద నుదాహరింపఁబడు శ్రీకృష్ణోపదేశము దృఢపఱచుచున్నది.

"మయ్యర్పితాత్మనస్సభ్య నిరపేక్షస్య సర్వతః,
మయాత్మనా సుఖం యత్తత్కుతః స్యాద్విషయాత్మనాం. ౧౨
అకించనస్య దాంతస్య శాంతస్య సమచేతసః,
మయా సంతుష్టమనసస్సర్వాస్సుఖమయా దిశః. ౧౩
న పారమేష్ఠ్యం న మహేంద్రధిష్ణ్యం న సార్వభౌమం న రసాధిపత్యం,
న యోగసిద్ధీరపునర్భవం వా మయ్యర్పితాత్మేచ్ఛతి మద్వినాన్యత్. ౧౪
న తథా మే ప్రియతమ ఆత్మయోనిర్న సంశయః,
న చ సంకర్షణో న శ్రీర్నైవాత్మా చ యథా భవాన్. ౧౫
నిరపేక్షం మునిం శాంతం నిర్వైరం సమదర్శనం,
అనువ్రజామ్యహం నిత్యం పూయేయేత్యంఘ్రిరేణుభిః. ౧౬
నిష్కించనామయ్యనురక్తచేతసశ్శాంతా మహాంతోఽఖిలజీవవత్సలాః,
కామైరనాల ధియో జుషంతి యత్తే నైరపేక్ష్యం న విదుస్సుఖంమమ.
బాధ్యమానోఽపి మద్భక్తో విషయైరజితేంద్రియః,
ప్రాయః ప్రగల్భయా భక్త్యా విషయైర్నాభిభూయతే." ౧౮

శ్రీభాగవతము. ౧౧ స్కం. ౧౪ అధ్యా.

ఇందొక్కవిశేషముకూడఁ గలదు. విషయాపేక్షలేక మననము చేయు నలవాటుగలిగి యోర్పుగలిగి వైర మనునదిలేక సమదర్శనుఁడగువాఁడు భక్తుఁడని స్పష్టమయ్యెడు. అనఁగా భక్తుఁడు

జ్ఞానియై జితేంద్రియుఁడు కావలయుననియు సమముగా నెల్ల భూతములయందు భగవంతునిఁజూచువాఁడు కావలయుననియు నట్లుకాకున్న నాభక్తి నిరర్థకమనియు సారము.

కొందఱు భక్తి కెల్లవార లర్హులే. ఆరాధన మొక్క విధమే యందురు. అది పొరపాటని యీశ్రీకృష్ణవాక్యము తెలిపెడిని.

"ఇతి మాం యస్స్వధర్మేణ భజన్నిత్యమనన్యభాక్,
సర్వభూతేషు మద్భావో మద్భక్తిం విందతే చిరాత్. ४४
భక్త్యోద్ధవానపాయిన్యా సర్వభూతమహేశ్వరమ్,
సర్వోత్పత్త్యప్యయం బ్రహ్మకారణం మోపయాతి సః. ४५
ఇతి స్వధర్మనిర్ణిక్తసత్త్వో విజ్ఞాతమద్గతిః,
జ్ఞానవిజ్ఞానసంపన్నో నచిరాత్సముపైతి మామ్. ४६
వర్ణాశ్రమవతాం ధర్మ ఏష ఆచారలక్షణః,
స ఏవ మద్భక్తియుతో నిశ్శ్రేయసకరః పరః. ४७
ఏతత్తేఽభిహితం సాధో భవాన్ పృచ్ఛతి యచ్చ మామ్,
యథా స్వధర్మసంయుక్తో భక్తో మాం సమియాత్పరమ్." ४८
(౧౧ స్కం. ౧౮ అధ్యా.)

ఈభాగవతవచనములఁబట్టి యాలోచింపఁగా భక్తిమార్గము సులభము కాదనియు జితేంద్రియముపైనను, సర్వభూతసమదర్శనత్వముపైన నాధారపడియున్నదనియు, సత్కర్మానుష్ఠానము లేక యది సాధ్యపడదనియు నెఱుంగనగు.

భక్తియోగమున కర్హులెవరు?

కొందఱు భక్తిమార్గము సులభమైనదనియు దాని కెల్లరు నర్హులనియు నందురు. అది చాలఁబొరపాటు. శ్రీభాగవతము ౧౧ స్కంధమున నిరువదవయధ్యాయమునందు

"యోగాస్త్రయో మయా ప్రోక్తా నృణాం శ్రేయోవిధిత్సయా,
జ్ఞానం కర్మ చ భక్తిశ్చ నోపాయోఽన్యోఽస్తి కుత్రచిత్. ౬
నిర్విణ్ణానాం జ్ఞానయోగో న్యాసినా మిహ కర్మసు,
తేష్వనిర్విణ్ణచిత్తానాం కర్మయోగస్తు కామినామ్. ౭
యదృచ్ఛయా మత్కథాదౌ జాతశ్రద్ధస్తు యః పుమాన్,
ననిర్విణ్ణో నాతిసక్తో భక్తియోగోఽస్య సిద్ధిదః. ౮
తావత్కర్మాణి కుర్వీత ననిర్విద్యేత యావతా,
మత్కథాశ్రవణాదౌ వా శ్రద్ధా యావన్న జాయతే. ౯
స్వధర్మస్థో యజన్యజ్ఞై రనాశీః కామ ఉద్ధవ,
న యాతి స్వర్గనరకౌ యద్యన్యన్న సమాచరేత్. ౧౦
అస్మిఁల్లోకే వర్తమానః స్వధర్మస్థోఽనఘశ్శుచిః,
జ్ఞానం విశుద్ధమాప్నోతి మద్భక్తిం వా యదృచ్ఛయా ౧౧

... ... ... ...

యదారంభేషు నిర్విణ్ణో విరక్తస్సంయతేంద్రియః,
అభ్యాసేనాత్మనో యోగీ ధారయే దచలం మనః. ౧౮
ధార్యమాణం మనో యర్హి భ్రామ్యదాశ్వనవస్థితం,
అతంద్రితోఽనురోధేన మార్గేణాత్మవశం నయేత్. ౧౯
మనోగతిం నవిసృజే జ్జితప్రాణో జితేంద్రియః,
సత్త్వసంపన్నయా బుద్ధ్యా మన ఆత్మవశం నయేత్. ౨౦
ఏష వై పరమో యోగో మనసస్సంగ్రహస్స్మృతః,
హృదయజ్ఞత్వ మన్విచ్ఛన్ దమ్యస్యేవార్వతో ముహుః. ౨౧
సాం న సర్వభావానాం ప్రతిలోమానులోమతః,
భవాప్యయావనుధ్యాయే న్మనో యావత్ప్రసీదతి. ౨౨
నిర్విణ్ణస్య విరక్తస్య పురుషస్యోక్తవేదినః,
మనస్త్యజతి దౌరాత్మ్యం చింతితస్యానుచింతయా. ౨౩

యమాదిభి ర్యోగపథై రాన్వీక్షక్యా చ విద్యయా,
మమార్చోపాసనాభిర్వా నాన్యైర్యోగ్యం స్మరే న్మనః. ౨౪
యది కుర్యా త్ప్రమాదేన యోగీ కర్మ విగర్హితం,
యోగేనైవ దహేదంహో నాన్య త్తత్ర కదాచన." ౨౫

అని భగవంతుఁ డుద్ధవున కుపదేశించెను. ఈకృష్ణోపదేశము నుండి కొన్నివిశేషములు గ్రహింపవలయును. స్వధర్మనిరతుఁడై యారాధింపవలయును. ఫలములనుగోరి నన్నారాధింపరాదు. ఇట్లు చేసినఁ బరిశుద్ధజ్ఞానమును నాయందు భక్తిని బడయఁగల్గును. నిర్జితేంద్రియుఁడై విరక్తుఁడై యోగాభ్యాసమున మనస్సును జాంచల్యరహితముగా నొనరింపవలయును. యోగాభ్యాసమార్గముతప్ప మనస్సు నిశ్చంచలముగ నుండునట్లు చేయ మార్గాంతరములేదు. మనోనిగ్రహమే పరమయోగము. మహదాదితత్త్వవివేకము సాంఖ్యశాస్త్రము ననుసరించి నిశ్చయించిననే మనస్సు ప్రసన్నంబగును. అను నీమొదలగునవియే విశేషములు.

## జ్ఞానకర్మభక్తియోగాధికారులు.

ఉద్ధవా! జ్ఞానయోగము కర్మయోగము భక్తియోగము నను నీమూఁడే పరమపదము నొందుమార్గములని తొలుతఁ జెప్పితిని. అం దెద్దాని కెట్టివా రర్హులో వివరించెదను. ఎవ్వారు కర్మము లొనరించి నిర్వేదంబునొంది సర్వసంగపరిత్యాగులగుదురో వారికి జ్ఞానయోగ మ్మనుష్ఠేయంబగు. కర్మనిర్వేదము నొందక ఫలముల నెవ్వారుగోరి సత్కర్మముల నాచరింతురో వారికిఁ గర్మయోగ మనుష్ఠేయంబగు. కర్మనిర్వేదమునొందక, కర్మఫలములందత్యంతాసక్తిలేక యాదృచ్ఛికంబుగా నాకథాది

విషయములపై శ్రద్ధగలవా రెవ్వరో వారికి భక్తియోగం బాచరణార్హ్వంబగు. కర్మ నిర్వేదముగాని నాకథాదుల నాలకింప శ్రద్ధగాని కలుగునంతదనుకఁ గర్మము లాచరింపఁదగినవియేకాని వాని వదలరాదు అని బోధించెను.

ఈయుపదేశముంబట్టి యోజింపఁగా భక్తియోగమున కెల్ల రర్హులన్న మాట యేటఁగలిసినది. భక్తి యనునది యెల్లరకు లభింపదు. ఏయంగడిలోను మూల్యమెంతయో యిచ్చి కొనుదమన్న దొరకదు. పూర్వపుణ్యమునకు ఫలముగా నది కలుగును. అట్టిపుణ్యము నెల్లరు చేసియుందురనుట పొరపాటు. కొందఱేయుందురు. ఈమూఁడుమార్గములు సమానములు. అన్యోన్యాశ్రయములు. భక్తిజ్ఞానములులేక కర్మ మాచరించిన నది పరప్రతారణార్థమగును. కావున భక్తిమార్గము సులభమనుట యనుచితము. ముఖ్యముగా నాపరమేశ్వరునందుఁ బరమానురాగము కుదురవలయును. అది సామాన్యమనుటకంటె నసంగతప్రసంగము వేఱుగ నేదియుండును? లోకమునఁ బ్రేమింపఁదగినవస్తువు లెన్నియో యుండును. వానిని మాని సర్వేశ్వరునియం దాపరమానురాగము నిలుచునట్లుచేయుట సామాన్య మనరాదు. అదియే సకలపుణ్యఫలము. సకలయోగాభ్యాసములఫలము. కనఁబడినపాషాణమునకు మ్రొక్కుచు దుష్కర్మముల నాచరించువారు భక్తులు కానేకారు. భక్తిమనస్సునఁ గుదిరినచో దుష్కర్మములఁగాని ఫలముంగోరియే సత్కర్మములఁగాని యాచరింపఁడు. వానిహృదయపీఠమున రాధాకృష్ణమూర్తి సర్వదా పొడకట్టుచునే యుండును. ఆప్రతిపూరుషులఁ గాంచుచు నాభక్తుఁడు ప్రపంచమును మఱచును. ఆనందమునఁ బ్రపంచమంతయు నొసంగినను

దుచ్ఛృతమముగా నాతఁడు భావించును. కావున వైరాగ్యము భక్తునకుఁ బ్రధానము. అదిలేక భక్తుఁడగుట సాధ్యము కాదు.

## భక్తునికర్మములు. 1.

కొందఱు భక్తునకుఁ గర్మములే లేవందురు. దేవాలయములకి మ్రొగ్గులు పెట్టుచు వంగివంగి దండములు పెట్టినఁ జాలునందురు. ఈవిషయమున శ్రీకృష్ణపరమాత్మ యెట్లు బోధించెనో యించుక విమర్శింతును. ఉద్ధవుఁడు పరమభక్తుఁడు. విశేషించి లోకోపకారకములగు ప్రశ్నముల భగవంతునే యడుగువాఁడు. సులభమార్గములనెల్లఁ దెలిసికొని వానిని విస్తరింపఁ దలంచువాఁడు. అట్టియుద్ధవుఁడు భక్తియోగసారము నెఱుంగఁగోరఁ బరమకారుణికుఁడగు శ్రీహరి యిట్లు దెలిపెను. ఈఘట్టమున శ్రీభాగవతమునందు నేకాదశస్కంధమున

"గృహీతమూర్తిత్రయఈశ్వరేశ్వరో జగాద సప్రేమమనోహరస్మితః." 2
అధ్యా. 29.

అని యున్నది. బ్రహ్మ విష్ణు శివాకారములనుఁ గైకొన్నవాఁడని కదా దానియర్థము. ఓహో! విష్ణువే యధికుఁడు శివుఁడు తద్భక్తుఁడు. అన్నవాద మెగిరిపోయెను. ఈమూవురు వేఱొక పరమాత్మయంశములని తేలెను. దీనింబట్టియైన భగవంతుఁడు త్రిమూర్తులుగా నైనవాఁడు కలఁడని యెఱింగిన మేలు. దాననితరదేవతాదూషణదుష్కర్మము తొలఁగును. ఇట్టి త్రిమూర్తులొక్కొక్కబ్రహ్మాండమునకుం గలరనియు ననేకకోటిబ్రహ్మాండము లున్నవని యాత్రిమూర్తులసంఖ్యయుఁ దెలియ శక్యము కాదనియు నెఱుంగుట బుద్ధిమల్లక్షణము.

"హంత తే వర్ణయిష్యామి మమ ధర్మాన్ సుమంగళాన్,
యాన్ శ్రద్ధయాచరన్మర్త్యో మృత్యుం జయతి దుర్జయమ్. ౮
కుర్యాత్సర్వాణి కర్మాణి మదర్థం శనకైస్స్మరన్,
మయ్యర్పితమనశ్చిత్తో మద్ధర్మాత్మమనోరతిః. ౯
దేశాన్ పుణ్యాన్ శ్రయేన్నిత్యం మద్భక్తైస్సాధుభిశ్శ్రితాన్,
దేవాసురమనుష్యేషు మద్భక్తాచరితాని చ. ౧౦
పృథక్సత్రేణ వా మహ్యం పర్వయాత్రా మహోత్సవాన్,
కారయేద్గీతనృత్తాద్యై ర్మహారాజవిభూతిభిః. ౧౧
మామేవ సర్వభూతేషు బహిరంతరపావృతం,
ఈక్షేతాత్మని చాత్మానం యథా ఖమమలాశయః. ౧౨
ఇతి సర్వాణి భూతాని మద్భావేన మహామతే,
స భాజయన్మన్యమానో జ్ఞానం కేవలమాశ్రితః. ౧౩
బ్రాహ్మణే పుల్కసే స్తేనే బ్రహ్మణ్యేర్కేస్ఫులింగకే,
అక్రూరే క్రూరకే చైవ సమదృక్పండితో మతః. ౧౪
నరేష్వభీక్ష్ణం మద్భావం పుంసో భావయతోచిరాత్,
స్ప సూయా తిరస్కారా స్సాహంకారా వియంతిహి. ౧౫
విసృజ్య స్మయమానాన్ స్వాన్ దృశంవ్రీడాంచ దైహికీం,
ప్రణమేద్దండవద్భూమా వాశ్వచండాలగోఖరం. ౧౬
ఈశ్వరో జీవకళయా ప్రవిష్టో భగవానితి,
యావత్సర్వేషు భూతేషు మద్భావో నోపజాయతే,
తావదేవ ముపాసీత వాఙ్మనః కాయవృత్తిభిః. ౧౭
సర్వం బ్రహ్మాత్మకం తస్య విద్యయాత్మమనీషయా,
పరిపశ్యన్నుపరమేత్సర్వతో ముక్తబంధనః. ౧౮
అయం హి సర్వకల్పానాం సధ్రీచీనో మతో మమ,
మద్భావస్సర్వభూతేషు మనోవాక్కాయవృత్తిభిః. ౧౯

నహ్యాం గోప క్ర మే ధ్వంసో మద్ధర్మస్యోద్ధవాణ్వపి,
మయా వ్యవసితస్సమ్య జ్నిర్గుణత్వాదనాశిషః. ౨౦

యో యో మయి పరే ధర్మః కల్ప్యతే నిష్ఫలాయ చేత్,
తదాయాసో నిర ర్థస్స్యాద్భయాదేరివ సత్తమః. ౨౧

ఏషా బుద్ధిమతాం బుద్ధిస్సా మనీషా మనీషిణాం,
యత్సత్యమనృతేనేహ మర్త్యేనాప్నోతి మామృతమ్." ౨౨

శ్రీ భాగవతము. ౧౧ స్క-౧. ౨౯ అధ్యా.

ఉద్ధవా! పరమశుభకరములగు నాధర్మములను వివరించెదను. నాధర్మములను శ్రద్ధతో నవలంబించువారు దుస్తర రసాగరమును దరింతురు. నన్నే స్మరించుచు నాపై వా.. స్సు చి త్తము నునిచి నాధర్మములయం దాత్మనిరతిగలిగి నాకొఱకు సర్వకర్మముల నాచరించుచుండవలయు. నాయందు భక్తిగలసాధువు లుండుపుణ్యస్థలములను సేవింపందగు. దేవదానవమానవులలో నాభక్తు లెవ్వారుగలరో వా రాచరించుకర్మములఁ దెలిసికొని వాని ననుష్ఠింపవలయు. ఒకఁడుగాని పెక్కండ్రుగాని నృత్తగీతాదుల నాయెదుట నాచరింపందగు. పాపములేనిమనస్సుగలిగి సర్వభూతములయందుఁ దనయందు లోపల వెలుపల నాకాశమువలె నావరణములేక వ్యాపించియున్న నన్నుఁ జూచుచుండవలయును. ఇదియే జ్ఞానదృ . ఆదృ . చే నెల్లభూతములను నన్నుగా భావించి పూజించుచు బ్రాహ్మణునందుఁ జండాలునియందు బ్రాహ్మణద్రవ్యముల నపహరించిన మహాపాపాత్మునందు బ్రాహ్మణునకు నుపకృతిసల్పిన పుణ్యాత్ముని యందు సూర్యునందు మిణుఁగురునందు సర్వభూతహితునియందును సర్వద్రోహియందును సమదృ . గలిగియుండువాఁడే పండితుఁడు ఎవ్వరు నాభావమును భక్తిశ్రద్ధలను గలిగియుం

దురో వారి కసూయాదిదుర్గుణము లుండవు. తాఁజేయుభగవత్కార్యమున కసూయపడి తన్ను నవ్వుచున్న బంధువులను శరీరాభిమానము ల ను బోవిడిచి కుక్కలకుఁ జండాలురకు గోఖరములకు నమస్కరింపవలయును. సర్వభూతములయందు నాభావము దృఢముగాఁ గుదురుకొనుదనుక మనోవాక్కాయవ్యాపారముల ని ట్లుపాసింపవలయును. దాన వరుసగా సర్వము బ్రహ్మస్వరూపముగాఁ గనఁబడును. అట్టి యభ్యాసముకల వాఁడు బంధవిముక్తుఁడై సర్వోపరతినొందును. సర్వభూతస్థునిగా నన్నెఱుంగుటయే నన్నుఁబొందుటకు సులభోపాయము.

ఈయుపదేశమున విశేషములు కొన్ని కలవు. ౧. భక్తుఁడు నన్నే తలంచుచుండవలయును. సంకల్పాత్మకమగుమనస్సును, అనుసంధానాత్మకమగుచిత్తమును నాపై నిలుపవలయును. అని శ్రీహరి తెలిపెను. ఇది యెట్లు నిలుపఁదగును? అన్నదియే ప్రశ్నము.

"సంకల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వానశేషతః,
మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః. ౨౪
శనైశ్శనైరుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్. ౨౫
యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్,
తత స్తతో నియమ్యైతదాత్మ న్యేవ వశం నయేత్. ౨౬
ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమం,
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషం." ౨౭

గీత. ౬ అధ్యా.

అను నీగీతోపదేశమే యిట సమాధానము. వేఱుమార్గము కావలాదు. అనఁగా మెలమెల్లన యోగాభ్యాసవశమున మనో

బుద్ధులని గ్రహింపవలయును. అట్లు యోగము నభ్యసించి యా పిదప మనశ్చిత్తముల నాపై నిలుపవలయునని శ్రీకృష్ణమూర్తి భావమైనట్లు సిద్ధాంతమేకదా.

౨. సర్వభూతములయందును దనయందు నాకాశమును గాంచునట్లు నిర్మలమానసుఁడై లోపల వెలుపల ననావృతుఁడనగు నన్ను (భగవంతుని)జూడవలయును. ఇట్టి కేవలజ్ఞానదృష్టి నవలంబించి సకలప్రాణికోటిని నన్నుగా భావించి యారాధింపవలయును. అట్లుచేయుచు బ్రాహ్మణునందును జండాలునందును, బ్రాహ్మణద్రవ్యము నపహరించినవానియందును, విప్రులకునిచ్చు నుత్తమదాత యెవఁడో యాతనియందును, సూర్యునందును విస్ఫులింగమునందును,అక్రూరునియందును గ్రూరునందును సమదృష్టి నిలుపునతఁడు పండితుఁడు. అని శ్రీకృష్ణుఁ డుపదేశించెను. దీనిసారమేమి? భగవంతుఁడు ఆకాశమువలె లోపల వెలుపల నిండియుండుననియు, నతఁడు వ్యాపింపని దేవియు లేదనియు నీభావమున నన్ను నంతటఁ జూడవలయును. దీనికే జ్ఞానదృష్టి యని పేరు. ఈదృష్టిచేఁ గాంచిన సకలభూతములు పరమేశ్వరుఁడుగాఁ గనఁబడును. అట్టివాని భగవంతుని గాంచుచుఁ బూజింపవలయును. . లేకున్నచో నాపూజ నిష్ఫలమగును. అనియే దీనిసార మనక తప్పదు. ఇది శ్రీహరియాశయము. ఇట్లుండఁగా శివకేశవులయందు భేదబుద్ధిగలవా రెవ్వరగుదురు? భక్తులుగారనుట సత్యము. కాన దేవస్వభక్తు లగుదురు. భక్తులవేషమును ధరించిన జగద్వంచకు లనఁబడుదురు. అన్నిభూతముల నన్నుగా భావింపుమన్నప్పుడు శివుని విష్ణువుగానే భావింపవచ్చును. విష్ణువును శివునిగా భావింపవచ్చును. ఈశివకేశవులను శక్తిగా భావింపవచ్చును, ఈముువ్వురను,ఇంక సూర్యు

రనుగలిపి భగవంతుఁడుగా భావింపవచ్చును. సర్వం విష్ణుమయం జగత్” అనుభావమున నుండవచ్చును. “సర్వం శివమయం జగత్” అనుభావమున నుండవచ్చును. సర్వనామములు సర్వప్రకృతులా భగవంతునకుఁ గలిగినపుడు భేదబుద్ధి కవకాశమేది? ఈభావ మెల్లరకుండునా యని ప్రశ్నించిన నుండదనవలయును. ఎవ్వారి కీభావము నిలుచునో వారే పండితులు. వారే భక్తులు నగుదురు. ఈభావము కుదురదేని వారు పండితులుగారు. భక్తులుగారు. అనఁగా నీభావము కుదురునంతదనుక దానికొఱకు సత్కర్మముల నాచరించుచు యోగము నభ్యసించుచుండవలయును. అదికుదిరినపిదప లోకానుగ్రహార్థము ఫలాభిసంధిరహితముగాఁ గర్మముల నాచరించుచు నెల్లరకు మార్గదర్శకులుగావలయును. అంతియకానివిష్ణువే శ్రేష్ఠుఁడు శివుఁడే శ్రేష్ఠుఁడు అనుదుర్వాదములుచేయుచుఁ గాలమును వ్యర్థబుచ్చిన భగవదనుగ్రహమునకుఁ బాత్రులు కాఁజాలరు.

3. ఈభావము దృఢపడినదా లేదా యని పరీక్షకై భగవంతుఁ డిట్లుపదేశించెను. బ్రాహ్మణాంత్యజాతివిశేషులయందు జాతినిబట్టి వైషమ్యముకలదు. దానిని బాటింపక సమదృ· వారియందుఁ గలిగియుండుట కష్టము. బ్రాహ్మణద్రవ్యము నపహరించువానియందును, బ్రాహ్మణులకు దానమిచ్చువానియందును కర్మమునుబట్టి వైషమ్యము కలదు. దానిని లెక్కసేయక వారియం దాపరమేశ్వరునిభావ మునుచుట మహాకష్టము. సూర్యునియందును స్ఫులింగమునందును గుణమునుబట్టి వైషమ్యము కలదు. దానింజూడక యొక్కరీతి భావించుట మానవకార్యముకాదు. శాంతునియందును క్రూరునియందును స్వభావమునుబట్టి వైషమ్యము గలదు. దానిని సరకుసేయక

సమానదృష్టిని వారిని భావించుట పరమకష్టము. ఇట్టి విరుద్ధ ధర్మములయందుఁ గేవలజ్ఞానదృష్టిగలిగి సమానముగాఁ జూడ నేర్చినవాఁడే పండితుఁడు. అంతియగాని వానికంటె వీఁడుత్కృష్టుఁడు. వీనికన్న వాఁడుత్కృష్టుఁడు. అని వదరుచుండువారు పండితులుకారని శ్రీకృష్ణభగవానుఁడే తెలిపెను. ఈయుపదేశము నుజక్కఁగా స్మరించుచుఁ దత్త్వము నాలోచించిన భగవంతుని సర్వభూతములయందును గాంచుచుఁ దద్భిన్నమగునది యేదియు లేదని భావించుచు నుండువాఁడే. భక్తుఁడని స్పష్టమయ్యెడిని.

౮. పూర్వోక్తసమదృత్వ మలవడినందులకు ఫల మియ్యది యని భగవంతుఁడు తెలుపుచున్నాఁడు. ఇట్లు నన్ను భావించు వానికిస్పర్ధాసూయాతిరస్కారాహంకారములు నశించును. అవి నశించినపిదప నాభక్తుఁడు తన్నుఁ బరిహాసముచేయు బంధుజనులను దేహాభిమానమును సిగ్గును వదలిపెట్టి శునకమునకు, జండాలునకు, గోవునకు, గాడిదకు, నింకను గలదుష్కర్మ సత్కర్మముల నాచరించి తదనురూపముగాఁ బశుపక్షిమానవాదితనువులు దాల్చినవానికి నమస్కారముచేయవలయును. ఏభావముచేత? అంతర్యామి యీశ్వరుఁ డనుబుద్ధిచేత. అని శ్రీశ్యామసుందరచక్రవర్తి యుపదేశించెను.

"విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని,
శుని చైవ శ్వపాకే చ పండితాస్సమదర్శినః."

అన్నగీతోపదేశ మిదియు సమానములేకదా.

చ. "వినయము విద్యయుం గలుగు విప్రునియందును గోవునందు నా
ప్పనఁ దగుహస్తియందు నొక పాకకుఁ బోవని కుక్కయందు దా

ని నడఁచి తెచ్చి వండితిను నీచపుమాలనియందుఁ దుల్యద
ర్శనులు తదంతరాత్ముని నిరంజనునిం గనునట్టిపండితుల్."

అని తిక్కనసోమయాజిగారు హృద్యపద్య ప్రత్నరత్నమును వ్రాసెను. సెబాస్. త_ృవే_త్తకావుననే దానిసారము నెక్కువ యని భావింపక వ్రాసి తనసర్వతోముఖపాండిత్యమును వెల్ల డించెను. ఆభావమునే చేర్పకయున్నచోఁ గవిబ్రహ్మకుఁ గల చమత్కృతి ప్రఖ్యాతిఁ గాంచకుండును.

ఈయుపదేశము నభిప్రాయమేమి? ఎవ్వారిమనస్సుల యందు సమత్వమునెలకొనునో వారికిస్పర్ధాసూయాదులుండవు. అవి యెపుడు మనఃపదమునఁ జోటులేక తొలఁగిపోవునో యపుడు నిర్మలచిత్తుఁడగును. ఆస్థితియందు నాతనికి సర్వమునం దీశ్వరత_త్త్వమే కనఁబడును. స్థూలదృష్టికందోఁచు దేహాభేద ముల నాతఁడు పాటింపఁడు. సర్వమీాశ్వరునిగా భావించును. కావునఁ జండాలగోశునకఖరాదులనుజూచినను భగవత_త్త్వమే యం దాతనికిం గానఁబడుంగాన నమస్కరించును. భగవత్కళ నావరించియుండు చర్మభస్త్రిక యాతనికిం గోచరింపదు. ఇదియే. భ_క్తుని యానందస్థితి. ఈస్థితియందున్న భ_క్తుఁడు దేహాద్యభి మానశూన్యుఁడగు. కావున నాతఁడు దేవాలయముల యందుఁ గలవిగ్రహములఁ గన్నులనైనఁ జూడఁడు. ఆయవ నుండియే యీాస్థితికివచ్చునుగదా. దీనిచే భేదబుద్ధి నశింపవలయు నని తేలును. సర్వభూతములయం దాపరమాత్మకళ వెలయు చున్నదని యెఱుంగవలయునని స్పష్టమగును. ఇఁక నట్టిభ_క్తునకు శివకేశవులయందు భేదబుద్ధికలదనుట కల్లగదా.

౫. ఈచెప్పినభావము కుదురకయున్న నేమిచేయందగు నని యుద్ధవుఁడు ప్రశ్నించు ననుకొని పరమేశ్వరుం డిట్లు

బోధించెను. సర్వభూతములయం దీనాభావము తోఁచుకాల మెపుడు వచ్చునో యంతదనుక వాఙ్మనఃకాయవృత్తులచేత నన్నారాధింపవలయును. దానిమూలమునఁ గ్రమముగాఁ బ్రాగుక్తభావము కలుగును. అప్పు డాతఁడు బంధవిముక్తుఁ డగును. ఇదియే నాకు సమ్మతమగుమతము. ఈయుపదేశసార మేమి? సర్వసమత్వము కుదిరినంతదనుక మేము భక్తులమని విఱ్ఱవీఁగుచుఁ గర్మముల మానుదురేమో యనుశంక భగవంతునకుఁ గలిగెను. సర్వత్ర భగవద్రూపము కనఁబడినంత స్థితియందు భక్తుఁ డొనరింపఁదగుకార్యము లేవి యుండును? ంతదనుక వానిని వదలక చేయవలయును.ఆస్థితియందుఁగూడ లోకోపకారార్థము చేయవచ్చును. మానవచ్చును. ఇచ్చోఁ గొందఱు

"సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః."

అనుగీతోక్తి నుదాహరించి సర్వధర్మములు వదలవలయుననియు భగవంతు నొక్కనినే శరణునొందవలయుననియు నివి యెల్ల రకు సమానధర్మమనియు బోధింతురు. సర్వమునందుఁ బర బ్రహ్మమును జూచువారల కీధర్మము చెల్లినను జెల్లును. కాని తక్కినవారికిఁ జెల్లదని

"యావ త్సర్వేషు భూతేషు మద్భావో నోపజాయతే,
తావదేవముపాసీత వాఙ్మనఃకాయవృత్తిభిః."

అను శ్రీకృష్ణోపదేశమే స్పష్టపఱచుచున్నది. సమదర్శనులుకూడ లోకసంగ్రహార్థము సత్కర్మముల నాచరింపవలయునని గీతాశాస్త్రమునందు మూఁడవయధ్యాయమునఁగల

"నియతం కురుకర్మ త్వం కర్మజ్యాయోహ్యకర్మణః,
శరీరయాత్రాపిచ తే నప్రసిద్ధ్యే దకర్మణః." ౮

అను నీశ్లోకము,

"ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైః పూర్వతరం కృతం,
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్." ౧౫

అను నీశ్లోకము బోధించుచున్నవి.

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే." ౬౫

౧౮ అధ్యా.

అను నీకృష్ణోపదేశము కర్మమును బోధించుటలేదా.

"యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి." ౫౯

అను నీశ్రీహరివాక్యము పైదానిని స్ఫుటీకరించుటలేదా.

"సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః,
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయం." ౫౬

అను నీప్రమాణము కర్మము నొనరించుమార్గమును బోధించుటలేదా.

"బ్రాహ్మణ క్షత్త్రియ విశాం శూద్రాణాం చ పరంతప,
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః." ౪౧

అను నీహరిశాసనము జాత్యుచితకర్మము లనుష్ఠేయములని తెలుపుటలేదా. ఈప్రమాణములెల్లఁ బొల్లులై ఆయొక్క శ్లోకమే ప్రమాణమగునెడల గీతాశాస్త్రమునకే మోసము వచ్చును. అలసులు పలుకుమాటలకుఁ జోటీయరాదు. సత్కర్మములను ఫలాభిసంధిరహితములుగా నొనరించి భక్తిభావ

మున భగవంతు నారాధింపవలయుననున దొక్కటియే నిర
పాయమార్గము పనిలేక కూరుచుండి దేవతాభేదములఁ బాటిం
చుచు దానినే మననము చేయుచుఁ దద్భావాశ్రయించువారల
కావిషయమునే బోధించుచు నుండువంచకులమాటలను
బాటింపక శ్రీకృష్ణపరమాత్మను సర్వమయునిగా భావించుచుఁ
దదారాధనానందము ననుభవించుచు నుండుటే యత్యుత్త
మము.

భక్తునిప్రవృత్తి యెట్లుండునో యని విమర్శించిన శ్రీ
భాగవతము దానిం దెలుపుచున్నది. అభీష్టదేవతయందుఁ గల
పరమానురాగమే భక్తి యనఁబడుననియు నదియే తెలుపు
చున్నది.

"ఆసీనః పర్యటన్నశ్నన్ శయానః ప్రపిబన్ బ్రువన్,
నాను సందధ ఏతాని గోవిందపరిరంభితః. 39
క్వచిద్రుదతి వైకుంఠచింతాశబలచేతనః,
క్వచిద్ధసతి తచ్చింతాహ్లాద ఉద్గాయతి క్వచిత్. 40
క్వచిత్తద్భావనాయుక్తస్తన్మయోఽనుచకార హ,
నదతి క్వచిదుత్కంఠో విలజ్జో నృత్యతి క్వచిత్. 41
క్వచిదుత్పులకస్తూష్ణీ మాస్తే సంస్పర్శనిర్వృతః,
అస్పందప్రణయానంద సలిలామీలితేక్షణః. 42
సఉత్తమశ్లోకపదారవిందయో
ర్నిషేవయా కించన సంగలబ్ధయా,
తన్వన్ పరాం నిర్వృతిమాత్మనో ముహు
ర్దుస్సంగదీనస్య మనశ్శమం వ్యధాత్." 43
స్కం. 7 అధ్యా. 4.

ఈశ్లోకములకు మహాకవిపోతన,

శా. "పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్ భాషించుచున్ హాసలీ
లానిద్రాదులు చేయుచుం దిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీనారాయణపాదపద్మయుగళీచింతామృతాస్వాదనం
ధానుండై మఱచెన్ సురారిసుతుఁ డేతద్విశ్వమున్ భూవరా.

సీ. వైకుంఠచింతావివర్జితచేష్టుఁడై యొక్కచో నేడుచు నొక్కచోట
నశ్రాంతహరిభావనారూఢచిత్తుఁడై యుద్ధతుఁడై పాడు నొక్కచోట
విష్ణుఁ డింతియకాని వేఱొండు లేదని యొత్తిలి నగుచుండు నొక్కచోట
నలినాక్షుఁ డనునిధానముఁ గంటి నేనని యుబ్బి గంతులువైచు నొక్కచోటఁ

ఆ. బలుకు నొక్కచోటఁ బరమేశుఁ గేశవుఁ, బ్రణయహర్షజనితబాష్పసలిల
మిళితపులకుఁడై నిమీలితనేత్రుఁడై, యొక్కచోట నిలిచి యూరకుండు.

అనుపద్యరత్నముల వ్రాసి తనభక్తిపారతంత్ర్యమును వెల్లడించెను. ఇందుఁగల "తచ్చింతాహ్లాదః" అన్న వాక్యమునందు గర్భితమైయున్న "సర్వం విష్ణుమయం జగ" త్తనుభావమును బో న వెలిపుచ్చెను.

"సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం,
వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి. ౨౭
సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరం,
న హినస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాం గతిం. ౨౮

అధ్యా. ౧౩.

ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా. ౬౧
తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత,
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్. ౬౨

అధ్యా. ౧౮.

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯

యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి సచ మే న ప్రణశ్యతి. ౩౦
సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే. ౩౧
ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున,
సుఖం వా యదివా దుఃఖం స యోగీ పరమో మతః." ౩౨

అధ్యా. ౬.

అను నీభగవద్గీతాభాగముల నామహాకవి యెఱింగియే యాభావమును వెల్లడించెను. సమస్తము భగవన్మయమని యెఱుంగక యొకలోకమును గల్పించి యందే యాపరమేశ్వరుఁ డుండు సిర యుంచి తద్రూపభేదముల నధఃకరించి తన్నివాసస్థలము లల్పములని దెగడి తమమనోమాలిన్యమును వెలపుచ్చువారలకు శ్రీకృష్ణోపదేశము పనికిరాదని తోఁచెడిని. సర్వమునందాపరాత్పరునే చూచువాఁడే భక్తుఁడు. ఆతఁడే తత్కారుణకుఁ బాత్రుఁడగును. తక్కొరుఁడు కాఁడనుట యరాత్సిద్ధమేకదా.

అవాఙ్మానసగోచరమగు భగవత్తత్త్వము భక్తానుగ్రహార్థము వాఙ్మానసగోచరముగఁ జేయఁబడి సంభావింపఁబడును. రూపకల్పనము తదర్థమే. దానికే యర్చావతారమని పేరు. అంతియకాని భగవంతునిరూప మది కాదు. ఉపనిషత్తులుకూడ దాని నిర్ణయింపఁజాలకపోఁగాఁ దక్కినవానిమాట యిఁక నేటికి? తేజోరూపముగ యోగు లద్దానిని ధ్యానింతురు. ఉ_మజ్ఞాన యోగనిష్ఠులు జ్ఞానస్వరూపముగ నాతత్త్వమును భావింతురు. ఉత్తమకర్మయోగనిరతులు యజ్ఞేశ్వరునిగా (తేజోరూపునిగనే) తలంతురు. అనుత్తమభక్తియోగనిష్ణాతు లర్చారూపమునభీష్టమును గల్పించుకొని సేవింతురు. ఇన్నివిధముల

నారాధింపఁబడునది యాపరతత్త్వ మొక్కఁడే. దీనినే యుపనిషత్తులన్నియు నేకవాక్యముగాఁ దెలుపుచుండు. ఎన్నియభిప్రాయభేదములున్న నుండుఁగాక పరతత్త్వ మరూపమనామమఖిలవ్యాప్త మద్వితీయమనువిషయమున భిన్నాభిప్రాయములులేవు. శబ్దములను దాఱుమాఱుచేసి స్వమతానుసారముగా వానికర్థము కల్పించువారు గలరు. కాని భగవంతుఁ డొక్కఁడనువిషయమున నెల్ల రొక్కటియే యని నే నూహించువాఁడను. ఉపాసనావిషయమున భేదములుండకమానవు. అది సకారణమే. ఏలనఁగా నెల్లరొక్కరీతిఁ గర్మము లాచరించువారుకారు. కావున వారివారిశక్తికనురూపముగా నాపరతత్త్వము నారాధింపఁగల్గుదురు. ఇట్టులున్నపుడు పరమేశ్వరునకుంగల బహువిధనామరూపములలో నొక్కనామమునకే ప్రాధాన్య మొసఁగి తక్కినవాని నిందించునలవాటు కొందఱకుంగలదు. అదియే లోప మనవలయు. శ్రీకృష్ణమూర్తి మావాఁడని కొందఱు పలుకుదురు. అది యుక్తమే. కాని మీవాఁడు కాఁడనరాదు. పరమేశ్వరుసేవించుట కెల్లర కధికారము కలదు. పద్ధతియందు భేదముకలదు. కాని భగవంతుఁడు మావాఁడని మీవాఁడుకాఁడని వాదించువారిని మూర్ఖులనుటకంటె వేఱేమియు ననరాదు. సర్వేశ్వరుకరుణ కెల్లరు పాత్రులు.

"మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతా స్తేమే యుక్తతమా మతాః." ౨ శ్లో ౧౨ అ.

అను గీతాశ్లోక మీయర్థమును దృఢపఱచుచున్నది.

భగవదారాధనము మానసికమే యుత్తమము. భగవన్మంత్ర జపము మానసికమే యుత్తమఫలదము. భగవద్దర్శనము నట్టిదియే యైననే ముక్తిప్రదము. ఈవిషయమును

"అవికారమజం శుద్ధం స్వప్రకాశం నిరంజనం,
జ్ఞానరూపం సదానందం ప్రాహుర్వై మోక్షసాధనమ్. ౧౧
యస్యావతార రూపాణి బ్రహ్మాద్యా దేవతాగణాః,
సమర్చయంతి తం విద్యాచ్ఛాశ్వతస్థానదం హరిమ్. ౧౨
జితప్రాణా జితాహారా స్సదాధ్యానపరాయణాః,
హృది పశ్యంతి యం సత్యం తం జానీహి సుఖావహం. ౧౩
నిర్గుణోఽపి గుణాధారో లోకానుగ్రహరూపధృక్,
ఆకాశమధ్యగః పూర్ణ స్తం ప్రాహు ర్మోక్షదం నృణాం. ౧౪
అధ్యక్ష స్సర్వకార్యాణాం దేహినో హృదయం స్థితః,
అనూపమోఽఖిలాధార స్తం దేవం శరణం వ్రజేత్. ౧౫
త్రివిధః ప్రోక్తో వాచికోపాంశుమానసః,
త్రివిధేఽపి చ విప్రేంద్ర పూర్వాత్పూర్వాత్పరో వరః. ౧౬
మంత్రస్యోచ్చరణంసమ్య క్స్ఫుటాక్షర పదం యథా,
జపస్తు వాచికః ప్రోక్త స్సర్వయజ్ఞఫలప్రదః. ౬౩
మంత్రస్యోచ్చరణే కించి త్పదాత్పదవివేచనమ్,
స ఉపాంశు ర్జపః ప్రోక్తః పూర్వస్మాద్ద్విగుణోఽధికః. ౬౪
విధాయ హ్యక్షరశ్రేణ్యాం తత్తదర్థవిచారణమ్,
స జపో మానసః ప్రోక్తో యోగసిద్ధిప్రదాయకః." ౬౫

బృహన్నారదపురాణము ౩౩ అధ్యాయము.

అను నీపురాణభాగము దృఢపఱచుచున్నది. ఇందొకవిశేషము కనఁబడియెడిని. హృదయపీఠమున నభీష్టదేవతాకల్పితరూపమును దర్శింపవలయును. అదియే సుఖావహమ్మగును. బాహ్యమునఁ బాషాణాదినిర్మితరూపమును దర్శించు టత్యల్పఫలదమని సారము. కావుననే దేవాలయములు కేవలపామరులకొఱకు నిర్మింపఁబడినవనియు నీపూజ యుత్తమఫలము నీయఁజాల

దనియు దీనింబోగడువాక్యములు పామరులకు భక్తిని బుట్టింపఁ జెప్పఁబడినవనియు హృదయారవిందమున భగవంతుని నెలకొలిపి యాదివ్యరూపమునే యోగమహిమమునఁ జూచుచుండిన మహానంద మొనఁగూడుననియుఁ బెద్ద లుపదేశింతురు. సర్వసంగపరిత్యాగులే ముక్తిపదమున కరుగఁజాలుదురనియుఁ బలుకుదురు.

"నిర్మానమోహా జితసంగదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః,
ద్వంద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్. ౫
యతంతో యోగిన శ్చైనం పశ్యం త్యాత్మన్యవస్థితం,
యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యంత్య చేతసః." ౧౧

గీత ౧౫ అధ్యా.

అను నీశ్రీకృష్ణోపదేశమునే వారు నమ్మిరనవలయును. కావున భక్తుఁ డగుమానవుఁడు సద్గురువులమూలమున యోగవిద్య నభ్యసించి సత్కర్మముల నాచరించుచు వానివలనిఫలముల నీశ్వరార్పణ మొనరించి జ్ఞానప్రధానుఁడై భగవంతుని నిత్యము స్వహృదయపీఠమునందే యాసీనునిగా నొనరించుకొని యారూపమునే కాంచుచు నెందుఁజూచిన నాపరాత్పరునిమహత్త్వమునే కనుఁగొనుచునుండిన సంసారసాగరము నుత్తరింపఁ గలఁడనుట చక్కనిసిద్ధాంతము. కర్మము భక్తిజ్ఞానము నను నీమూఁడును బరస్పరసంబంధములనియు నెఱుంగఁదగినసిద్ధాంతము.

"జ్ఞానలభ్యం పరం మోక్షం ప్రాహు స్తత్త్వార్థ చింతకాః,
యజ్ఞానం భ క్తి మూలం చ భ క్తిః కర్మవతాం తథా. ౨౭
దానాని యజ్ఞా వివిధాః తీర్థయాత్రాదయః కృతాః,
యేన జన్మసహస్రేషు తస్య భ క్తిర్భవేద్ధరౌ. ౨౮
అక్షయః పరమో ధర్మో భ క్తిలేశేన జాయతే,
శ్రద్ధయా పరయా చైవ సర్వం పాపం ప్రణశ్యతి. ౨౯
సర్వపాపేషు నష్టేషు బుద్ధి ర్భవతి నిర్మలా,
సైవ బుద్ధిస్సమాఖ్యాతా జ్ఞానశబ్దేన సూరిభిః. ౩౦
జ్ఞానం చ మోక్షదం ప్రాహు స్తజ్జ్ఞానం యోగినాం భవేత్,
యోగస్తు ద్వివిధః ప్రోక్తః కర్మజ్ఞాన ప్రభేదతః. ౩౧
క్రియాయోగం వినాన్యేషాం జ్ఞానయోగో న సిధ్యతి,
క్రియాయోగరత స్తస్మా చ్ఛ్రద్ధయా హరిమర్చయేత్. ౩౨
ద్విజభూమ్యగ్నిసూర్యాంబుధాతుహృచ్చిత్ర సంజ్ఞితాః,
ప్రతిమాః కేశవ స్యైతాః పూజ్యా ఏతాస్తు భ క్తితః. ౩౩
కర్మణా మనసా వాచా పరపీడాపరాఙ్ముఖః,
తస్మా త్సర్వగతం విష్ణుం పూజయే ద్భ క్తిసంయుతః. ౩౪
యది క్రోధాదిదుష్టాత్మా పూజాధ్యానపరో భవేత్,
న తస్య తుష్యతే విష్ణు ర్యతో ధర్మపతిస్స్మృతః. ౩౮
యది కామాదిదుష్టాత్మా దేవపూజాపరో భవేత్,
దంభాచారస్స విజ్ఞేయ స్సర్వపాతకిభిస్సమః. ౩౯
తపః పూజాధ్యానపరో య స్త్వసూయారతో భవేత్,
త త్తపస్సా చ పూజా చ తద్ధ్యానం హి నిరర్థకం. ౪౦
తస్మా త్సర్వాత్మకం విష్ణుం శమాదిగుణతత్పరః,
ముక్త్యర్థ మర్చయే త్సమ్యక్క్రియాయోగపరః పరః. ౪౧

కర్మణా మనసా వాచా సర్వలోకహితే రతః,
సమర్పయతి దేవేశం క్రియాయోగస్స ఉచ్యతే. ४३
నారాయణం జగద్యోనిం సర్వాంతర్యామినం హరిం,
స్తోత్రాద్యైస్స్తౌతి యో విష్ణుం కర్మయోగీ స ఉచ్యతే. ४४
ఉపవాసాదిభిశ్చైవ పురాణశ్రవణాదిభిః,
పుష్పాద్యైశ్చార్చనం విష్ణోః క్రియాయోగ ఉదాహృతః. ४५
ఏవం భక్తిమతాం విష్ణౌ క్రియాయోగరతాత్మనాం,
సర్వపాపాని నశ్యంతి పూర్వజన్మార్జితాని వై. ४६
పాపక్షయాచ్ఛుద్ధమతి ర్వాంఛతి జ్ఞానముత్తమం,
జ్ఞానం హి మోక్షదం జ్ఞేయం తదుపాయం వదామి తే." ४७

బృహన్నారదీయము. 33 అధ్యా-

అను నీప్రమాణములు పైవిషయమును దెలుపుచున్నవి. సత్కర్మముల భగవదర్పణముగా నాచరించిన భక్తి కుదురు ననియు దాన - నముగలుగుననియు దీనిసారము. ఈమూఁడిం టిలో నొక్కదానికి వేఱొక్కటి సహకారియనియు భావము. భక్తిలేక కర్మములనాచరించుట, జ్ఞానములేక భక్తియనుట నిరాధారమనియుఁ దాత్పర్యము. ఇంకొక్కవిశేషము. ఏకార్య ముచేయుచున్నను బుద్ధి యెట్లున్నను భగవన్నుతిచేసిన మహా ఫల మనందగుము క్తికలుగునన్న వంచకులమాట యుపచార మాత్రమని యెఱుంగవలయుననియు దీనినుండి తేలెను- క్రోధాదులచే నాత్మ దుష్టముకాఁగాఁ బూజలు ధ్యానము చెయఁబూనిన నాతనియెడ శ్రీహరి కరుణాపరుఁడుకాఁడఁట. ఏలన నాపరమాత్మ ధర్మప్రభువుకదా. కామాదివికారములచే మనస్సు దు - ముకాఁగా దేవపూజ చేయనారంభించిన

నాతఁడు దంభాచారుఁ డనంబడును. సకలపాపముల నొనరించిన వానితో వాఁడు సమానుఁడగును. ఇతరులకలిమికి నొండె వైదుష్యమునకు నొండె నోర్వజాలనివాఁడు తపఃపూజాధ్యాన పరుఁ డయ్యెనేని యాతపోధ్యానపూజలు నిరర్థకములగును. కావున శమదమములుగలిగి సర్వవ్యాపకుఁ డగుభగవంతు నుచితరీతి యథాశక్తిన్యాయము ననుసరించి యారాధింపవల యును. ఇదియే యిందుఁ గలవిశేషము.

## కర్మ భక్తి జ్ఞాన యోగనియమములు.

కొందఱు కర్మయోగము భక్తియోగము జ్ఞానయోగము నని పేరు లుచ్చరించుచుఁ దద్విధులం దెలుపకయే యుప న్యాసమును ముగించుచుందురు. వానిస్వరూప మెఱుంగుట ముఖ్యముకదా. మనస్సుచేతను, వాక్కులచేతను, యుపని చేతను సర్వలోక హితమునుగోరుచు భగవంతు నారా ధించుచు వినుతించుచు నుండువాఁడు కర్మయోగి యనం బడు. ఉపవాసాదులు పురాణశ్రవణాదులు పుష్పాదులఁ బరమేశ్వరుఁ బూజించుటయుఁ గర్మయోగమునఁ జేరును. కర్మయోగి భగవంతునియందుఁ బరమానురాగము గల వాఁడై కర్మఫలముల నాపరాత్పరున కర్పించిన భక్తియోగి యనంబడును. పూర్వజన్మార్జితపాపము ల వానికిం దొలంగును. అనఁగా భక్తిగలిగియే కర్మము లాచరింపవలయు ననుటయే యిచ్చటఁ గలసారము. కర్మములమాని భక్తుఁ డుండరాదు. భక్తుఁడుకాక కర్మములనాచరింపరాదు. ఈరెండును నవిర హితముగా నొనరించిన ఫలములేదు. అనఁగా నీమూఁడు నొక దానివదలి వేఱొకటియుండదని సారము. భగవదారాధనాదుల

వలనఁ బాపములు తొలఁగఁగా మనస్సు పరిశుద్ధమగును. జ్ఞాన మాస్థితియందుఁ బొడసూపును. జ్ఞానము మోక్షము నిచ్చు నందురు. కర్మయోగమును వదలిన జ్ఞానము కలుగదు. జ్ఞానము కలుగక కర్మయోగి తరింపఁజాలఁడు. యోగము రెండువిధములు. కర్మయోగమని జ్ఞానయోగమని. జ్ఞానము కలిగి కర్మయోగము నవలంబించి శ్రద్ధచే శ్రీహరి నారాధింప వలయును. అనఁగా నాశ్రద్ధకే భక్తి యనునామాంతరమని పెద్దలు కొందఱు పలుకుదురు. భగవంతునిస్థితి నెఱుంగుటయే జ్ఞానము. లోకహితమునుగోరి భగవంతు నారాధించుటయే కర్మము. భగవంతు నారాధించుశ్రద్ధ భక్తిగాక మఱేమగును? ఈమూఁడును వేఱువేఱునామములుగల వగుట కేమికారణ మని యడుగవచ్చును. ప్రాగ్జన్మపుణ్యము ననుసరించి కొందఱు కర్మయోగులుగనే యుందురు. అనఁగాఁ గర్మప్రధానులని భావము. కొందఱు భక్తులుగనే యుందురు. అనఁగా భక్తి ప్రధానులని భావము. కొందఱు జ్ఞానయోగులుగనే యుందురు. అనఁగా జ్ఞానప్రధానులన్నమాట. ఈజ్ఞానయోగులు పరి పాకావస్థయందుఁ గర్మముల నాచరింపకయుందురు. ఇన్నింటి ఫలమే యది. అనఁగా భగవంతునే యెల్లతావులం జూచు చుండువారు చేయఁదగుకర్మములే లేవని భావము. అట్టివారు సమలోష్టాశ్మకాంచను లనంబడుదురు. వారికి జాతిమతధర్మ ములు లేవు.

"యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసం ఛిన్నసంశయం,
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ. ౪౧
తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః,

ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత." ४.४२
గీత ४ అధ్యా.

అను గీతావాక్యములు పై విషయమును స్థిరపఱచుచున్నవి.

"న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే,
తత్స్వయం యోగ సంసిద్ధః కాలేనాత్మని విందతి. ३८
శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సంయతేంద్రియః,
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరేణాధిగచ్ఛతి." ३९
గీత. ४ అధ్యా.

అను నీగీతావాక్యములే భక్తిజ్ఞానముల తెఱంగు బోధించుచున్నవి. కొందఱు శ్రద్ధ యనఁగా ఆస్తిక్యబుద్ధి యందురు. విమర్శింపఁగా ననురాగపరాకాష్ఠ శ్రద్ధ యనఁబడునని తేలెడిని. అదియే భక్తి యనియు ననువదింపంబడును ఏవో యభిప్రాయభేదము లున్న నుండనిండు. భక్తిలేక కర్మముల నాచరించుట. కర్మాచరణములేక భ_ జ్ఞానములేక యివి రెండును వ్యర్థములనుట సత్సంప్రదాయము.

కావున నోమహాశయులారా! సద్గురువుల సేవించి యనఁగా వారిని సద్వృత్తిచే సంతోషపఱచి యోగము నభ్యసించు పద్ధతుల నేర్చుకొని యారీతిగా నభ్యసించి మనస్సు దుర్విషయవిముఖమగునట్లు చేసికొని తన కని ఫలములఁగోరక సర్వభూతసుఖావహముగా సత్కర్మముల నాచరించుచు భగత్త_ ్వమిదియని విమర్శించి సమదర్శనుఁడై క్రమక్రమముగా ధనాశాదుల మాని సువర్ణరత్న కాంతాశ్మములయందు సమదృష్టిగలిగి తాఁజేయఁదగుకర్మములు లేకున్నను పామరుల కుపకారము చేయఁదా నవ్వాని నాచరించుచు ఫలాభిసంధి కీషత్తైన

నవకాశమీయక సర్వకాలసర్వావస్థలయందును దనద్భ-
భగవంతునియందే నిలిచియుండఁ జేసికొనుచు నిరహంకా
రుఁడై నిర్మముఁడై సంసారసాగరముు దాఁటి శాశ్వతానంద
పద మొందవలయును.

శ్రీరాముఁ డెక్కుడని, శ్రీకృష్ణుఁ డధికుఁడని శంకరుఁ
డుత్కృష్టుఁడని, పరదేవి యందఱకన్న నెక్కుడని యీ
మొదలగు భేదములకు మనస్సునఁ జోటిచ్చుచుఁ బిలిచి పిలిచి
కలహించుచు వాదములయం దాఱితేఱితిమని విఱ్ఱవీఁగుచు
నెల్లమతములకంటె మామత ముత్తమో _ మమని డంబములు
పచరించుచు నీమూలమున మహాపాపముల నార్జించుచుఁ దన్మూ
లమునఁ దనజన్మమును నిరర్థకముగ వలయునని చేసికొనుచుఁ
దిర్యగ్యోనులయందుఁ బుట్టఁదగు నంహోధనరాశినార్జించుచుఁ
జెడుటకంటె సర్వము దానై సర్వమునందుఁ దానంతర్భా
తుఁడై యెవ్వారికిం గానరాక యద్వితీయుఁడై సర్వవిలక్ష
ణుఁడై యచింత్యమహిముఁడై సర్వరూపములఁ దాల్చుచు
సర్వనామములఁ బిలువఁబడుచు నిర్మానుష్యమగు గుహాంతరాళ
మునఁగాని మనుజనికరసాంద్రమహానగరాంతరమునఁగాని
మఱియెట్టిచోటఁగాని యార్తుఁడై స్మరించినంతన తద్భక్తికిఁ
మెచ్చి పొడసూపుచుఁ దత్కర్మమునకుం దగినఫలముల నొసం
గుచు నిర్లిప్తుఁడై సర్వసాక్షియై యుండుపరమేశ్వరు నభీష్ట
నామమున నిచ్ఛాకల్పితరూపమున నారాధించు టుత్తమము.
సర్వవేదములసార మిదియే. సర్వోపనిషత్సార మిదియే. భగవ
ద్గీతాసార మిదియే. సర్వపురాణసార మిదియే. సర్వేతిహాససార
మిదియే. మహాత్ములయుపదేశసార మిదియే. సర్వయోగీశ్వ

రానుభవ మహార్థసార మిదియే. కలికృతకల్మషాపనోదనపటు తరభవ్యతమసర్వభక్తజనధ్యేయ పదపంకజవిరాజమానశ్యామ సుందరచక్రవర్తిరహస్యోపదిష్ట సుజ్ఞానసారమిదియే.

ఈమార్గము నవలంబించిన మతకలహము లుండవు. దుర్వాదముల కవకాశ మొదవదు. పరశ్రేయస్సహానమును వదల వలనుపడదు. భేదబుద్ధికిఁ జోటు లేదు. మహామతులారా! దాసులమని యోగులమని, సన్న్యాసులమని, వేదాంతులమని, మాంత్రికులమని, భక్తులమని, పౌరాణకులమని యింక నెన్ని యో పేరులుగలవారమని, సాపాటురామన్నలు, అఱచేతిరామ న్నలు, వంచకులు, ధనార్జనతత్పరులు, భోగులు తిరుగు చుందురు. వారిమాటలకు లుపోవరాదు. వారియుపదేశము లకుఁ జెవియొగ్గరాదు వారికి భగవంతుఁడు కనఁబడునని కల లోను దలంపరాదు. అట్టివారికిఁ దొలఁగి స్వమతము నిస్సార మని విడనాడక పరమత మింతకంటె నుత్తమమని తలంపక గీతాదులఁ బఠించి తదనురూపముగా జాతిధర్మముల నాచ రించుచుఁ బెద్దల గారవించుచుఁ బురాణములఁ బఠించుచు మతోద్ధారకుల బహూకరించుచు భగవంతుఁ డొక్కఁడయ్యు భక్తులకొఱ కనేకరూపముల ననేకనామముల నవతరించునని విశ్వసించి యందుఁ దనకు నిష్టమగురూపమును మదిఁ బదిలపఱ చుకొని శక్తికిం దగినయట్లు సత్కర్మముల నలరించుచు సేవిం చుచుఁ బరమతముల బహూకరించుచుఁ బరదైవముల నిందిం పక సర్వమత ప్రతిపాదితభగవద్రూపమును గొనియాడుచుఁ గాలము పుచ్చవలయును. అవకాశముకలిగినపుడెల్లను బరమే శ్వరుని స్మరించుచుండవలయును. అతఁ డొక్కఁడే దిక్కని నమ్మవలయును.

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్."

అన్న భగవద్వాక్యమే సాధువులకు శరణము.

ఇది భగవద్భక్తియను మూఁడవసోపానము.

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీకరుణాపాత్ర జనమంచి సుబ్రహ్మణ్యమనీషిపుత్త్రతాండవకృష్ణాపరాభిధేయ శేషాద్రి నామధేయప్రణీతకృతులయం దిదియుత్తమమార్గము సంపూర్ణము.






చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1931.